# మా బాలగోపాల్




## బులెటిన్ - 11

మానవ హక్కుల వేదిక ప్రచురణ

# మానవహక్కులు - 2010

బులెటిన్ - 11

---


**మానవహక్కుల వేదిక ప్రచురణ**

**Human Rights Forum Publication**

ప్రచురణ సంఖ్య: 23
ప్రచురణ కాలం: అక్టోబర్ 2010
కాపీలు: 2000, వెల: 15 రూపాయలు
కవర్: శ్రావణ్
డిటిపి: కె.వి.ఆర్
ముద్రణ: నవ్య ప్రింటర్స్



ప్రతులకు:
**ఎస్. జీవన్ కుమార్**
3-12-117/ఎ-2/బి, పి.ఎస్. కాలనీ,
గణేష్‌నగర్, రామంతపూర్,
హైదరాబాద్ - 500 013
ఫోన్: 040-27039519



**ప్రజాశక్తి, నవోదయ, దిశ బుక్ హౌస్‌లు**

మా వెబ్‌సైట్: www.humanrightsforum.org
బాలగోపాల్ రచనల కోసం: www.balagopal.org

# సంపాదకీయానికి బదులు...

ఇంతకాలం ఈ చోటు బాలగోపాల్‌ది.

మామూలుగా అయితే ఏ ప్రయాణీకుడైనా దిగిపోవడానికి లేచి నిలబడగానే పదిమంది అక్కడ కూర్చోవడానికి ముందుకొస్తారు.

కాని ఈ చోటు అలాంటిది కాదు.

ఇది ఎవరినైనా సరే భయపెట్టే చోటు.

బాధ్యతల్ని మోపే చోటు.

గుండె నిండా మెదడు నిండా ఆలోచనల్ని నింపి విలువల్ని నింపి ఇక అడుగేయ్‌.. ఒకటి కాదు.. వేసిన ప్రతి అడుగూ బాధ్యతగా.. ఒకరి పట్ల కాదు.. ప్రతి ఒక్కరి పట్లా అంతే బాధ్యతగా ఉండేలా కాలు కదుపు.. నడుస్తూనే ఉండు.. ఒక్కడివిగా కాదు.. అందర్నీ కలుపుకుని.. ఊరేగింపుగా కదులు అని చెప్పే చోటు.

ఎవరికి సాధ్యం? ఎవరికంత ధైర్యం?

అయినా అసాధ్యాలూ, అధైర్యాలూ ఎరగని మనిషికి వారసులంగా ఆ కాడినెత్తుకుని మళ్లీ బయలుదేరాం.

# కూడదీసుకుంటూ...

**హ**క్కుల ఉద్యమకారుడు బాలగోపాల్ గుండె ఆగి ఏడాది. అన్నిటికీ వెలకట్టే రోజుల్లో అన్నిట్లోనూ విలువలను చూపించిన ఆ నేత్రంలోని అంతర్నేత్రం కన్ను మూసి ఏడాది. మూడు దశాబ్దాలపాటు పనిచేసేవాడూ, పనిచేసేవారి చేతిలో పనిముట్టూ తానే అయి హక్కులు హక్కులంటూ, విలువలు విలువలంటూ, వాటిని నిలబెట్టాలంటూ, వినాల్సిన వాళ్లు వినాలంటూ చెపుతూ చెపుతూ హఠాత్తుగా మాయమైపోయి ఏడాది.

ఎంత సాదాగా బతికారో అంత సాదాగా చనిపోయారు. ఆ సాదాతనాన్ని ప్రేమించిన వారు ఎందరో. చుట్టుపక్కల వినబడే రణగొణధ్వనులతో నిమిత్తం లేకుండా తన ఒంటరితనాన్ని, ఏకాంతాన్ని సమాజశ్రేయస్సు కోసం అంకితం చేసి చడీ చప్పుడు కాకుండా, పెద్దగా యాగీ చేయకుండా, ఎటువంటి షికాయతులూ చేయకుండా వెళ్లిపోయారు.

ఏ పని చేసినా విలక్షణంగా చేయడం అలవర్చుకున్నారు. నిజనిర్ధారణకు వెళ్లి వాస్తవాలు సేకరించినా, కోర్టులో కేసు వాదించినా, ఒక వ్యాసం రాసినా, ప్రసంగించినా, ప్రభాతకు పాఠం చెప్పినా, ఇంట్లో పనులందుకున్నా పనిపట్ల అంతే శ్రద్ధ, ఆసక్తి, మమకారం. ఒక్క మాటలో చెప్పాలంటే గూడుకట్టుకున్న పని ఆయన. నేను ఇంత చాకిరీ చేస్తున్నాను కదా మీరు కూడా పడీపడీ చేయండని ఆయన తన తోటివారిని ఏనాడూ ఒత్తిడి పెట్టలేదు. ఈ పనులు చేయడానికి అవతలి వాడి జేబులో డబ్బులున్నాయా, అంత సమయం కేటాయించగలడా, వాళ్ల ఇంట్లో పరిస్థితులు అనుకూలిస్తాయా, ఆరోగ్యం ఒప్పుతుందా... వారి ప్రతి కష్టాన్ని, ప్రతి పరిమితిని అర్థం చేసుకోగలిగేవారు. వాటిని అధిగమించడానికి వాళ్లకు కావాల్సిన సమయాన్ని, అవకాశాలను వారికిచ్చేవారే కాని ఆ లోపాలను ఎత్తిచూపి చిన్నబుచ్చేవారు కాదు.

మోయలేని భారమేదైనా వుంటే అది బులెటిన్లు, కరపత్రాలు రాసి పంచే పని నుండి సంస్థకు సంబంధించిన ప్రతి పనిని ఎక్కువ భాగం తాను మోసి మిగిలింది అవకాశముంటే మోయమనేవారు. పని చేయడం లేదని సర్క్యులర్ల ద్వారా ఒకింత కోప్పడ్డా చేయలేకపోతే మాత్రం ఏనాడూ ఏమీ అనేవారు కాదు. క్రియాశీలంగా పనిచేసేవారిని చూసి లోలోన ఎంతో మురిసిపోయేవారు. ఈ విషయం ఆయనతో పనిచేసిన ప్రతి ఒక్కరికీ తెలుసు. కుటుంబ బాధ్యతలు, వృత్తిపరమైన బాధ్యతలు నెరవేర్చగా మిగిలిన కాలాన్ని హక్కుల ఉద్యమానికి కేటాయించమని ఆయన ప్రతి ప్రధాన కార్యదర్శి  నివేదికలోనూ విన్నవించేవారు. అంత ఓపికుండబట్టే ఇవాళ మానవహక్కుల వేదిక, మానవహక్కుల ఉద్యమం, మానవహక్కుల దృక్పథం నిలదొక్కుకుంది, విస్తరించింది.

కార్యకర్తలను కాపాడుకునే విషయానికి కూడా ఎంతో ప్రాధాన్యతనిచ్చేవారు. సమకాలికులతో స్నేహంగా ఉంటూ, చిన్నవాళ్లని మాత్రం ఆయన పద్ధతిలో ఆయన గారాం చేశారు. నవ్వులు, ఛలోక్తుల మధ్య సాగే పనిలో ఒత్తిడి తెలిసేది కాదు. ఈ ప్రయాణంలో అందర్నీ మైళ్లకు మైళ్లు నడిపించేసి ఇప్పుడు ఏమీ ఎరగనట్టు ఇక ఈ తిప్పలన్నీ మీరెలా పడతారో చూద్దాం అన్నట్లు పక్కకు జరిగి చూస్తూ ఉండిపోయేరు. మా సంస్థ అంతర్గత సమావేశాలు రాగద్వేషాలకు తావు లేకుండా సాఫీగా సాగడానికి కారణం ఆయన మాలో పెంపొందించిన భావసారూప్యత, పని చేయాలనే తపన. నిష్కల్మషమైన మా మైత్రీ బృందానికి కేంద్రబిందువాయన. పదేళ్లనాడు నెలకొన్న పరిస్థితుల్లో తెలంగాణ జిల్లాల్లో మానవహక్కుల వేదిక కార్యకర్తలను తయారు చేసి, అక్కడ శాఖలు ఏర్పాటు చేసి, ఇంతకాలం వాటితో పనిచేయించడం సామాన్యమైన విషయమేనా?

సంస్థ, సంస్థ సభ్యులు ఎక్కువ కాలం పనిచేసేందుకు ఆయన ఎంచుకున్న విధానాలు, పని పద్ధతుల్లోని సృజనాత్మకతను అర్థం చేసుకోవడానికి కొంచెం ఓపిక అవసరం. ఏ ప్రాంతంలోనైనా ఆ ప్రాంత విశిష్టతను గుర్తించి వాటిపై సంస్థ సభ్యుల దృష్టిని సారింపజేయడం, ఎవరి గడ్డపై వారి చెవిని పెట్టి గుండె చప్పుడు వినిపించడం ఆయనకే సాధ్యమైంది. ఎవరి ఊరిని వారికి పరిచయం చేశారు. ఎవరి దోసిట్లో వారి ఏటినీరుని పోశారు. మేము తడమగలిగిన మనిషి. మా హృదయాలను తడిమిన మనిషి. ఆయన లేని లోటు గుండెలోని ప్రతిపొర లోంచి వస్తున్న మూలుగు. అది బైటకీ రాదూ, లోపలా ఉండిపోదు.

జీవితంలో బహుశా ఆయన అన్నిటికంటే ఎక్కువ ప్రేమించింది పనినేనేమో. అది

కూడా నలుగురికీ ఉపయోగపడే పనిని. పనిలో పడిపోతే పరిసరాలు, చుట్టుప్రక్కల మనుషులను కూడా మర్చిపోగలరు. అలాని వారి బాధలు పట్టవా అంటే అదేం కాదు. ఇంటికొస్తే సారు ఒక్కసారి కూడా పలకరించలేదే అని నొచ్చుకున్నవారికి ఏదైనా ఆపదొస్తే వెంటనే ప్రత్యక్షమయ్యేవారు. నరేన్, నల్గొండ సుబ్బారావుగారు, అనంతపురం సుధాకర్, ప్రొఫెసర్ హరగోపాల్, సెస్ వెంకటయ్య, కరీంనగర్ రాజారాం, విజయనగరం అప్పన్నదొర, బాలగోపాల్ అక్క సుదంత, వాళ్ల అమ్మ నాగమణిగారు అనారోగ్యానికి గురైనప్పుడు ఆయన వారితో గడిపిన సమయం, ఇచ్చిన ఓదార్పు అందరికంటా పడుండదు. ఖంగు ఖంగున కఠోర షడ్జమంలో ఉపన్యాసాలిచ్చే ఆ వ్యక్తేనా నర్రా ప్రభాకర్‌రెడ్డి శవాన్ని చూసి భోరు భోరున పసిపిల్లాడిలా ఏడ్చింది?

అవును.. ఆయన నేత్రంలోని అంతర్నేత్రం. ఇబ్బందికరమైన ప్రశ్నలను లేవనెత్తడం ఆయన స్వభావంలోనే వుంది. అవతల వ్యక్తులు అస్మదీయులా, తస్మదీయులా అనే దానితో సంబంధం లేకుండా మనస్సాక్షిని తాకే నైతిక ప్రశ్నలను లేవనెత్తారు. ఒక తరం హక్కుల కార్యకర్తలకి అది అలవాటు చేశారు. ఒక సమస్యని హక్కుల దృక్పథంలో విలువల ప్రాతిపదికన అంచనా వేయడం ఆయన తన వరకే పరిమితం చేసుకోలేదు. దాన్ని హక్కుల ఉద్యమ సాంప్రదాయం చేశారు. అది ఇప్పట్లో పొమ్మన్నా పోదు. ఇబ్బందికరమైన ప్రశ్నలు అవతలి వారికి వేయడమేకాక, తమకు తాము వేసుకోవడం కూడా అలవాటు చేసుకున్న వారికి ఆయనతో బతికుండగా గానీ, చనిపోయిన తర్వాత గానీ ఏనాడూ పేచీ లేదు. ఆయన తాత్విక దృక్పథం నిండా నైతిక విలువల మెరుపు తీగలు. ఎక్కడున్నామో అక్కడ నుండి అధికారాన్ని ప్రశ్నించే ధోరణి. అర్థవంతమైన ధిక్కారం. ఈ తత్వం ఆయన ఒక తరం హక్కుల కార్యకర్తలకి నేర్పి పోయారు.

* * *

బాలగోపాల్ లేని లోటు లోకానికి తాకకూడదని, మానని గాయాన్ని దాచిపెట్టే ప్రయత్నంలో మాలో కొందరు హక్కులపని పెట్టుకుని తెగ తిరుగుతున్నాం. కొత్త సమస్యల మీద రాయడం అలవాటు చేసుకుంటున్నాం. ఆయన సగంలో వదిలేసిన కోర్టు కేసుల్ని పూర్తిచేయడం నేర్చుకుంటున్నాం; గెలవడం నేర్చుకుంటున్నాం. ఆయనలా తేటగా కరపత్రాలు రాసే ప్రయత్నం చేస్తున్నాం. మాట్లాడటమే కాదు బాగా మాట్లాడ్డం, మామూలు గొంతుతో కాదు గొంతెత్తి మాట్లాడ్డం అలవాటు చేసుకుంటున్నాం. ఒంటరితనాన్ని, ఏకాంతాన్ని, ఏకాగ్రతను గట్టిగా పెనవేసుకుని అమూల్యమైన ఆయన రచనా సంపదలో ఒక్కొక్క అక్షరాన్ని ప్రేమగా నిమురుతూ

నచ్చిన రంగులద్ది అచ్చేసే పనిలో కొంతమందిమి నిమగ్నమయ్యాం. ఆయన వదిలివెళ్లిన అజెండాని పూర్తిచేసే క్రమంలో - వై.ఎస్. రాజశేఖరరెడ్డి నుంచి కడపజిల్లా పేరుని కాపాడుకోవడానికి శతవిధాల కృషి చేస్తున్నాం. పోలవరం వల్ల జరగనున్న నష్టాన్ని మర్చిపోతే ఎలా అనుకుని ఆ నిప్పును మరోసారి రాజేసే ప్రయత్నం చేస్తున్నాం. ఎస్.సి, ఎస్.టి అత్యాచారాల నిరోధక చట్టం గురించి 'ఇరవై ఏళ్ళయినా అంటరాని న్యాయమేనా' అని నిలదీస్తున్నాం. సోంపేట మొదలుకొని కృష్ణపట్నం వరకు తీరాన్ని కబళిస్తున్న 'అభివృద్ధి'ని ప్రశ్నిస్తున్నాం. నగరాలనుండి పేదల బస్తీలను ఏరివేసే 'సౌందర్యాత్మక దృష్టి'ని వ్యతిరేకిస్తున్నాం. ఆయన అమితంగా ప్రేమించే ఆదివాసీ ప్రజల ఆరోగ్య రక్షణ కోసం ఆదిలాబాద్ జిల్లాలో 'బేర్‌ఫుట్ డాక్టర్లను' తయారు చేస్తున్నాం. మనుషుల్ని ఎత్తుకెళ్ళి కాల్చేసి ఎన్‌కౌంటర్లు ప్రకటించడం నాగరికత అనిపించుకోదని పదే పదే పాలకులకూ, సమాజానికీ చెబుతున్నాం.

ఆయన వదిలి వెళ్లిన ఆచరణను కొనసాగించడానికి, విడిచిపెట్టిన ప్రమాణాలను అందుకోవడానికి మేం చేస్తున్న ఈ ప్రయత్నంలో మా వెన్నంటి వున్న వారందరికీ మానవ హక్కుల వేదిక కృతజ్ఞతలు తెలుపుతోంది. ఈ పనులన్నిటిలో బాలగోపాల్ సంతకం కనిపిస్తుందని తెలుపుతూ ఆయనపై మాకున్న ప్రేమనూ, అనురాగాన్నీ వ్యక్తం చేయడానికి ఈ 11వ బులెటిన్ తీసుకువస్తున్నాం. ఇది తీసుకురావడంలో జరిగిన ఆలస్యాన్ని అర్థం చేసుకోగలరని భావిస్తున్నాం. ఈ వ్యాసాల్లోని ప్రతి అక్షరమూ పలుమార్లు కన్నీటితో తడిసాయని మాత్రమే దానికి సంజాయిషీగా చెప్పగలం. గత ఏడాది మాకు తగిలిన దెబ్బలు సామాన్యమైనవి కావు. మా రాష్ట్ర ఉపాధ్యక్షుడు జి. నరేంద్రనాథ్ పోయినేడు జూలై 5న క్యాన్సర్ బారినపడి చనిపోయారు. అదే నెల 24వ తేదీన మా నెల్లూరు జిల్లాశాఖ అధ్యక్షుడు యం. సాంబశివరావు రైలు ప్రమాదంలో చనిపోయారు. నెల తిరక్కుండా ఆగస్టు 17న నెల్లూరు జిల్లాశాఖ ఉపాధ్యక్షులు మేకల కృష్ణయ్య రోడ్డు ప్రమాదంలో మరణించారు. ఇక బాలగోపాల్ విషయం మీకు తెలిసిందే. ఇబ్బందులను కాస్తూ మొండిగా పనిచేసుకుపోవడం ఆయన సంస్థ సభ్యులకు కూడా అలవాటు చేయబట్టే ఇవాళ ఈ బులెటిన్‌తో మీ ముందు నిలబడ్డాం. ఈ సందర్భంలో కోల్పోయిన ఆ మిత్రులందర్నీ జ్ఞాపకం చేసుకుంటున్నాం.

గత మూడు దశాబ్దాలుగా వివిధ జిల్లాల్లో హక్కుల ఉద్యమంలో బాలగోపాల్‌తో కలిసి పనిచేసిన మానవహక్కుల వేదిక సభ్యుల వ్యాసాలు ఈ బులెటిన్‌లో ఉన్నాయి. ఆయా ప్రాంతాల్లో వ్యక్తులతో, ప్రజలతో బాలగోపాల్‌కి వున్న అనుబంధం ఈ వ్యాసాల

ద్వారా మనకు అవగతం అవుతుంది. ఇతర రాష్ట్రాల్లో బాలగోపాల్‌తో కలిసి పనిచేసిన మిత్రుల వ్యాసాలను, హక్కుల సంస్థలు ఇచ్చిన సందేశాలను కూడా ఇందులో ప్రచురిస్తున్నాం. తర్జుమా చేస్తే భావం చెడుతుందేమోననే ఉద్దేశంతో వాటిని యథాతథంగా ఆంగ్లంలోనే ముద్రిస్తున్నాం.

చివరిగా బాలగోపాల్ మా మూడవ రాష్ట్ర మహాసభలలో ఇచ్చిన సందేశాన్ని గుర్తు చేసుకుందాం.

“ఒక రాజకీయ సిద్ధాంతం పట్ల నిబద్ధత గానీ, ఒక రాజకీయ ఉద్యమ అవసరాలు గానీ, ఒక సామాజిక వర్గం ప్రయోజనాలు కానీ కాక, కొన్ని విలువల పట్ల నిబద్ధతతో మనమందరం ఒక దగ్గరకు వచ్చాం. ఆ విలువల వెలుగులో సమాజాన్ని, మానవ జీవితాన్ని అర్థం చేసుకుంటూ దానిని ప్రజాస్వామీకరించడానికి, మానవీకరించడానికి అవసరమైన కార్యరంగాన్ని నిర్దేశించుకొని కార్యక్రమాలు చేపడుతున్నాం. మనం చేపట్టే కార్యక్రమాలు అన్ని అణగారిన వర్గాల ఆరాటాలకూ ఆసరా ఇస్తాయి గాని మనకు ప్రమాణం ఆ ఆరాటంలో వ్యక్తమయ్యే విలువలు. ఇది మన రాష్ట్రంలోని ప్రజా ఉద్యమాల చరిత్రలో ఒక కొత్త ప్రయోగం. దీనిని నిలబెట్టలేకపోతే మన ప్రయత్నానికే కాక, విలువలు మనుషుల్ని ఒక దగ్గరకు తీసుకురాగలవన్న ప్రజాతంత్ర విశ్వాసానికి కూడా నష్టం చేసిన వారమౌతాం. నిలబెట్టడమే కాక విజయవంతంగా ముందుకు తీసుకుపోయినట్లయితే ప్రజాస్వామ్య భావనకు బలం చేకూర్చిన వాళ్లమౌతాం”.

ఆ స్ఫూర్తికి కొనసాగింపే ఈ బులెటిన్

**– మానవహక్కుల వేదిక**
8.10.2010

# ఇందులో ...

# మమ్మల్నందర్నీ సానబెట్టిన మనిషి

ఎస్. జీవన్‌కుమార్*

**హ**క్కుల ఉద్యమానికి ఒక గమనాన్ని, ఒక తాత్విక చింతనను నిర్దేశించినవాడు బాలగోపాల్. శ్రీకాకుళం, వరంగల్, హైదరాబాద్, కరీంనగర్ విప్లవోద్యమాల నేపథ్యంలో ఉదయించిన ఆ సూర్యుడు తన వెలుగును విశ్వమంతా వ్యాపింపచేసే ప్రయాణంలో ఆకస్మికంగా అస్తమించడం చాలా విచారకరం. బాలగోపాల్ హక్కుల ఉద్యమంలోకి ప్రవేశించేనాటికే మన రాష్ట్రంలో హక్కుల ఉద్యమం ఉంది. కాని భిన్న కోణాల్లో హక్కుల అంశాల్ని గుర్తించడం, వాటిని నివేదికల రూపంలో రాయడం, వాటిని హక్కులు కోల్పోతున్న ప్రజలకు అర్థమయ్యే రీతిలో చెప్పడం, ఏమీ పట్టనట్టుగా చెవిటిజీవిగా ఉన్న ప్రభుత్వాన్ని మేల్కొలిపే ప్రయత్నం చేయడం, న్యాయస్థానాల ముందుకు విషయాలు తేవడం, రాజకీయ పార్టీలను పునరాలోచించుకునేట్టు చేయడం, సభ్యసమాజం అని పిలవబడుతున్న ఈ సమాజాన్ని ప్రశ్నించడం, తమదైన ప్రపంచంలో తేలిపోతున్న మేధావి వర్గానికి అప్పుడప్పుడు అక్షింతలు వేసి వాళ్ళ కర్తవ్యాన్ని గుర్తు చేయడం బాలగోపాల్ చేసిన పని.

ఈ అన్ని అంశాలను సంస్థలో పనిచేస్తున్న కార్యకర్తలకు అరటిపండు ఒలచినట్టుగా ఒలిచిపెట్టి వాళ్ళను హక్కుల కృషికి కార్యోన్ముఖుల్ని చేసిన విధానం ఆయన నిర్వహించిన అమోఘమైన కృషి. ఆయన అందించిన ఆ పండు గుజ్జును ఆస్వాదించి లాభపడ్డ హక్కుల కార్యకర్తల్లో నేను ఒకణ్ణి. ఆయన సాన్నిహిత్యమే నేను గర్వంగా హక్కుల కార్యకర్తను అని ప్రకటించుకునే ధైర్యాన్నిచ్చింది. ఆంధ్రప్రదేశ్ పౌర హక్కుల సంఘంలోకి వచ్చిన తర్వాత ఆయన నాలుగు అంశాలపై ప్రత్యేక దృష్టి పెట్టి పనిచేస్తూ, మా అందరితోనూ పని చేయించాడు.

* మానవహక్కుల వేదిక రాష్ట్ర అధ్యక్షుడు, హైదరాబాద్

1. సంస్థ నిర్మాణాన్ని విస్తృతపరచడం, పటిష్టపరచడం, అందులో భాగంగా కార్యకర్తల్ని గుర్తించి ప్రోత్సహించడం.

2. హక్కుల ఉల్లంఘనల్ని గుర్తించడం, వాటిని నివేదికల రూపంలో రాసి, ప్రచారం నిర్వహించడం.

3. హక్కుల లేమిని ఎత్తిచూపి, వాటిని పొందటానికి పద్ధతుల్ని శోధించడం.

4. ప్రజా ఉద్యమాలు లేవనెత్తుతున్న సమస్యల్లోని హక్కుల అంశాలను గుర్తించి వాటిని విలువలుగా, హక్కులుగా ప్రచారం చేయడం.

## నివేదికల్లో నూతనత్వం

ఎమర్జెన్సీ ఎత్తివేసిన తర్వాత ఆం.ప్ర. పౌరహక్కుల సంఘాన్ని అన్ని విప్లవ పార్టీలకు చెందిన సానుభూతిపరులూ, ప్రతినిధులూ, ప్రజాస్వామిక వాదులూ కూర్చొని పునరుద్ధరింపచేసారు. వాళ్ళ వాళ్ళ పార్టీల ప్రకారం రంగనాధం, విఠల్‌రావు, కాశీపతిగార్లను రాష్ట్ర కన్వీనర్లుగా నియమించారు. వరంగల్ జిల్లానుండి ఆరుగురు అప్పుడు రాష్ట్ర కార్యవర్గంలో ఉండటమేకాక, ఆ జిల్లా కమిటీ నిర్మాణం కూడా అన్ని జిల్లాలకంటే ముందు జరిగింది. పౌరహక్కుల సంఘం కార్యకర్తలకు వరంగలే కేంద్ర బిందువుగా ఉండేది. ఎమర్జెన్సీలో జరిగిన పోలీసు అత్యాచారాలను విచారించడానికి భార్గవ కమిషన్ ఏర్పాటు కాకముందే ఢిల్లీ నుండి పియుసిఎల్.డి.ఆర్. సంస్థకు చెందిన బృందం ఒకటి వరంగల్ ఎ.పి.సి.ఎల్.సి. సభ్యులతో కలిసి కరీంనగర్‌లోని కల్లోలిత ప్రాంతాల్లో పర్యటించింది. ప్రాథమిక నివేదికను వరంగల్‌లోనూ సమగ్ర నివేదికను ఢిల్లీలోనూ విడుదల చేసారు. వరంగల్‌లో కాళోజిగారి ఇంట్లో మేము విడుదల చేయడం జరిగింది.

ఎమర్జెన్సీలో గిరాయిపల్లి దగ్గర జరిగిన ఎన్‌కౌంటర్‌పై నిజనిర్ధారణ చేయడానికి అరుణ్‌శౌరి వరంగల్ వచ్చి పత్రికల్లో రాయడమే కాక, తర్వాత భార్గవ కమిషన్‌కు నివేదిక సమర్పించాడు. అయితే ఆ సమయాల్లో పౌరహక్కుల సంఘం రాసిన నివేదికలైనా, ఇతర సంస్థలు రాసిన రిపోర్టులైనా ఒక తరహాలో ఉండేవి. హక్కుల ఉల్లంఘన జరిగిన ప్రాంతంలో పనిచేస్తున్న పార్టీల కార్యక్రమాలు, వాళ్ళు తీసుకున్న సమస్యల వివరణ, సాధించిన విజయాలకు సంబంధించిన విషయాలు నివేదికలో ఉపోద్ఘాతంగా ఉండేవి. దాని తర్వాత హక్కుల ఉల్లంఘన జరిగిన వైనం, ఆ కథనం రాసేవారు. విప్లవ పార్టీలు హక్కుల సంఘం నివేదికలో ఉండవలసిన అంశాల గురించి సూచనలు, ప్రాధాన్యతలు కూడా ఉత్తరాల ద్వారా అందించినట్టు నాకు జ్ఞాపకం. అప్పుడు హక్కుల సంఘం చేసే ఉపన్యాసాల్లో కూడా ఇదే పద్ధతి అమల్లో

ఉండేది. సంఘటన జరిగిన ప్రాంతాన్ని బట్టి, అక్కడ పని చేస్తున్న విప్లవ పార్టీని బట్టి ముగ్గురు రాష్ట్ర కన్వీనర్లలో ఒకరు, కార్యవర్గంలో ఆ పార్టీకి సంబంధించిన వ్యక్తులు బహిరంగ సభలకు, సమావేశాలకు హాజరయేవారు.

1979లో వరంగల్‌లో జరిగిన మొదటి రాష్ట్ర మహాసభలో కన్నబిరాన్ అధ్యక్షుడిగా, బి. ప్రదీప్ రాష్ట్ర కార్యదర్శిగా ఎన్నికైన తర్వాత పైన చెప్పిన పద్ధతిలో కొంచెం మార్పు వచ్చింది. ఎక్కడ సంఘటన జరిగినా కార్యదర్శిని, అధ్యక్షుడిని ఏదో ఒక విప్లవ గ్రూపు ప్రయాణ ఏర్పాట్లు చేసి తీసుకుపోవడం మొదలైంది. బాలగోపాల్ కార్యవర్గంలోకి వచ్చిన తర్వాత సూర్యాపేటలో జరిగిన ఎన్‌కౌంటర్ నిజనిర్ధారణకు వెళ్ళాడు. దానికి సంబంధించిన నివేదిక కూడా ఆయనే రాసాడు. సంఘటన ఎట్లా జరిగింది, ఆ క్రమం, సంఘటనకు సంబంధించిన వాస్తవాలు, వాటికే ప్రాధాన్యం ఇచ్చి రాయడం జరిగింది. హతులైన వ్యక్తులు ఏ పార్టీకి చెందినవారు అన్న ప్రస్తావన ఉందికాని ఆ పార్టీ చేస్తున్న ఉద్యమం గురించి ఏమీ సమాచారం లేదు. నేను, ప్రదీప్ ఆ నివేదిక చూసి కొంచెం ఆశ్చర్యపడ్డాం. తర్వాత రాసిన అన్ని రిపోర్టుల్లోనూ ఇదే పద్ధతి పాటించి మాకు కూడా అలవాటు చేసాడు.

బాలగోపాల్ సంస్థలోకి రాక ముందు వరంగల్ జిల్లాలో ములుగు, ఏటూరునాగారం ప్రాంతంలో జరిగిన హక్కుల ఉల్లంఘనలపై నేను నివేదికలు రాసేవాడిని. ఖమ్మం జిల్లా పండితాపురంలో చెరువు శిఖం భూమికి సంబంధించి జరిగిన ఆందోళన, అక్కడ జరిగిన ఫైరింగ్, లాఠీచార్జీలపై నివేదికను హరగోపాల్‌గారు, నేను, జర్నలిస్ట్ వి.ఎల్. నరసింహరావు, నరసింహయ్య కలసి రాసాం. అందులో అప్పుడు కొండపల్లి సీతారామయ్య నాయకత్వంలో ఆ సమస్యపై ఎట్లా ఉద్యమాలు జరిగాయో వివరించాం.

అట్లాగే ములుగు, ఏటూరునాగారం, పస్రా ప్రాంతాలకు సంబంధించిన నివేదికల్లో చంద్రపుల్లారెడ్డి నాయకత్వంలోని విప్లవపార్టీ తునికాకు రేట్ల పెంపుదల విషయంలో, బీడీ కట్టల రేట్ల విషయంలో ఎట్లా ఆందోళనలు నిర్వహించిందో వివరించాం. బాలగోపాల్ ఈ రిపోర్టులు నాకు చూపెట్టి, మనం హక్కుల సంఘాలుగా రాస్తున్నప్పుడు ఈ నేపథ్యం అంతా వివరించాల్సిన అవసరం లేదు. సంఘటన ఎట్లా జరిగింది, దానికి సంబంధించిన వరుస క్రమం ఏమిటి, ప్రజలు సాక్షులుగా ఉన్నారా, చట్ట ఉల్లంఘన ఎట్లా జరిగింది, స్థానికులు ఏం అభిప్రాయపడుతున్నారు అన్న అంశాలపై మాత్రమే నివేదికలో ఫోకస్ చేయాలని చెప్పారు. అంతే కాకుండా ఊహాగానాలకు, వదంతులకు చోటివ్వకుండా పూర్తి ఆబ్జెక్టివ్‌గా రాయాలి అని చెప్పాడు. అప్పటినుండి మా నివేదికలు పూర్తిగా మారిపోయాయి.

బాలగోపాల్ కార్యదర్శి అయిన తర్వాత అన్ని రిపోర్టులూ, పత్రికా ప్రకటనలూ ఆయనే రాయడం మొదలుపెట్టాడు. బాలగోపాల్ పంపే పత్రికా ప్రకటన క్రియ, టెన్స్ మార్చి అట్లానే ప్రచురిస్తాం. చాలా స్పష్టత, క్లుప్తత ఉంటుందని అప్పుడు ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో పనిచేసే స్వామి అనే సీనియర్ రిపోర్టర్ నాతో అనేవాడు. ఇదివరకు ఎవరైనా అరెస్టయినపుడు పత్రికా ప్రకటనలు మాత్రమే ఇచ్చేవాళ్లం. నిర్దిష్టంగా ఫలానా పోలీస్‌స్టేషన్‌లో ఉన్నాడని తెలిసినపుడు మాత్రమే నేను, డా॥ రామనాథం గారు పోలీస్‌స్టేషన్‌కు వెళ్లినట్టు జ్ఞాపకం. బాలగోపాల్ రాష్ట్ర కార్యదర్శి అయిన తర్వాత మేం పోలీస్‌స్టేషన్స్‌కు వెళ్ళడం ఒక పనిగానే పెట్టుకున్నాం. ఒకటి, రెండు సందర్భాలలో బాలగోపాల్‌తో పోలీసులు దురుసుగా ప్రవర్తించారు కూడా. అంతే కాకుండా లాకప్‌లో ఉన్న విద్యార్థులను, యువకులను అసభ్యంగా తిట్టి, మీ నాయకులు వచ్చారని ధీమాగా ఉన్నారా అంటూ ఎక్కువ చిత్రహింసలు పెట్టిన సంఘటనలు కూడా జరిగాయి. ఇది మా దృష్టికి వచ్చిన తర్వాత మనం పోలీస్ స్టేషన్లకు వెళ్ళడం మానేసి, పై అధికార్లను కలుద్దాం అని బాలగోపాల్ ప్రతిపాదించాడు.

## మంచి కార్యకర్తలకోసం వెతుక్కునేవాడు

మేము టౌన్ డిఎస్‌పిని, రూరల్ డిఎస్‌పిని కలిసి మెమొరాండంలు ఇవ్వడం మొదలుపెట్టాం. కొన్ని సందర్భాల్లో ఎస్.పి.ని కూడా కలిసేవాళ్ళం. నిజానికి నాకు తహసీల్దార్లకు, ఆర్.డి.వోలకు కూడా అధికారాలుంటాయని తెలియదు. బాలగోపాల్ వాళ్ళకు కూడా ఎగ్జిక్యూటివ్ అధికారాలుంటాయి, వాళ్ళ దృష్టికి కూడా మనం విషయాలు తేవడం అవసరం అని చెప్పాడు. అప్పటినుంచి మేము ఆర్.డి.ఓ.కు కూడా మెమోరాండం ఇవ్వడం, మరీ ముఖ్యమైన పెద్దస్థాయి కార్యకర్త పోలీసుల అదుపులో ఉంటే కలెక్టరును కూడా కలవడం ప్రారంభించాం. ఇట్లా పని విధానంలో బాలగోపాల్ ఎన్నో మార్పులు తెచ్చాడు. 1979లో బాలగోపాల్ కార్యదర్శి అయినప్పుడు నేను వరంగల్ జిల్లా కమిటీకి కార్యదర్శిని. నా దగ్గర అప్పుడు స్కూటర్ లేదు. భాస్కరరావు గారినో, మా కాలేజీ లక్ష్మినారాయణనో, సీతారామారావునో స్కూటర్ అడుక్కుని నిజనిర్ధారణకోసం గ్రామాలకు పోయేవాళ్ళం. కొన్నిసార్లు మేమిద్దరం సైకిళ్ళపై కూడా వరంగల్, హన్మకొండ వాడల్లో తిరిగినట్టు గుర్తు. నేను 1980లో స్కూటర్ కొన్న తర్వాత దాదాపు ప్రతిరోజూ నేను కాలేజీ నుంచి వస్తూ 3.30 గంటలకు బాలగోపాల్ గది దగ్గర ఆగేవాణ్ణి. అప్పటికి ఆయన క్లాసు ముగించుకుని సైకిల్‌పై రూంకి వచ్చేవాడు. ఇద్దరం కలసి స్కూటర్‌పై ఏదో ఒక గ్రామానికో, అధికారిని కలవడానికో వెళ్తుండేవాళ్ళం.

బాలగోపాల్ కార్యదర్శి అయిన తర్వాత పని విధానంలో మార్పులతోబాటు సంస్థ నిర్మాణం కోసం చాలా కృషి చేసాడు. పని విధానం బాగుపడాలంటే కార్యకర్తల్ని జిల్లాలలో గుర్తించాలి. వాళ్ళకు తగిన ప్రోత్సాహం, సూచనలు సలహాలు అందిచడం చాలా అవసరం అని చెప్పేవాడు. జిల్లాలో తను పర్యటనకు వెళ్ళినప్పుడు కార్యకర్తల్ని గుర్తించే విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించాడు. ఏ రాజకీయ ఆలోచనల నేపథ్యంలోంచి వచ్చినా వ్యక్తులుగా నిత్యజీవితంలో నిజాయితీగా ఉన్నారా అన్న అంశాన్ని ప్రధానంగా పరిశీలించేవాడు. కుటుంబంలో, ముఖ్యంగా జీవిత భాగస్వామితో ప్రజాస్వామికంగా, గౌరవంగా మసులుకుంటాడా అనేది కూడ గమనించేవాడు. ఏదైనా జిల్లాకు పోయి రాగానే అక్కడ తను గుర్తించిన కార్యకర్త గురించి చాలా హుషారుగా చెప్పేవాడు. "ఫరవాలేదు, మన సంస్థకు పనికొస్తాడు – కొంచెం మనం పని అలవాటు చేయవలసి ఉంటుంది" అని చెబుతుండేవాడు. ఆయన కార్యదర్శి అయిన ఆరునెలల నుండీ సంస్థ నిర్మాణంపై బాగా దృష్టిపెట్టాడు. 1984 డిసెంబర్‌కల్లా అన్ని జిల్లాల్లో పూర్తి స్థాయి జిల్లా కమిటీలు ఏర్పాటయ్యాయి. జిల్లా కేంద్రంలో ఉండే కార్యకర్తలు నెలలో ఏదో ఒక రోజు కలుసుకుని, కార్యక్రమాల గురించి చర్చించుకోవడం, రాష్ట్ర కమిటీనుండి వచ్చిన సర్క్యులర్‌ను చదువుకోవడం, కరపత్రాలు పంచడం ఒక పద్ధతిగా ఉండాలని, అది కార్యకర్తల మధ్య అనవసరమైన అపోహలు, అభిప్రాయ బేధాలు తలెత్తకుండా ఉండే వాతావరణానికి దోహదం చేస్తుందని చెప్పేవాడు.

ఈ పద్ధతి దాదాపుగా చాలా జిల్లాలలో పాటించేవారు. కార్యవర్గంతో చర్చించి ఏర్పాటు చేసుకున్న కార్యక్రమాలే కాకుండా, ఏమైన సంఘటనలు జరిగినప్పుడు తానే జిల్లా బాధ్యులకు ఫోన్‌చేసి 'నేను ఫలానా రోజు వస్తున్నాను ఎవరికి వీలైతే వాళ్ళు సిద్ధంగా ఉండండి' అని చెప్పి జిల్లా బాధ్యుల్ని కార్యోన్ముఖుల్ని చేయడం ఒక పనిగా నిర్వహించాడు. ఆ తర్వాత వాళ్లే ఫోన్‌చేసి ఫలానా సంఘటన విషయంలో మీరు రాగలరా అని అడగడం మొదలుపెట్టారు. ఈ మొత్తం ప్రక్రియ ఒకరకమైన పని సంస్కృతిని సంస్థలో పెంపొందింపచేసింది. ఈ పని విధానం వల్ల రాష్ట్రంలో మనం నిజనిర్ధారణ చేయని హక్కుల ఉల్లంఘన అంశం లేనే లేదు అని గర్వంగా చెప్పుకోగలిగాం. అందుకే 'ఎన్‌కౌంటర్' కేసుల్లో విచారణ జరపడానికి జాతీయ మానవహక్కుల కమిషన్ రాష్ట్రానికి వచ్చినప్పుడు, అందులో సభ్యుడొకాయన, "అసలు ప్రపంచంలోనే ఇంత పకడ్బందీ నిర్మాణం, ఇంత క్రమశిక్షణతో కూడిన సంస్థ" లేదనే అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు.

## కోర్టులకు పోవడం బాలగోపాల్‌తోనే మొదలు

పనివిధానంలో అర్జీలు పెట్టడం, కరపత్రాలు వేసి ప్రచారం చేయడం, బహిరంగ సభలు నిర్వహించడమే కాకుండా న్యాయస్థానాలకు పోవడాన్ని కూడా బాలగోపాల్

వరంగల్‌లోనే ప్రారంభించాడు. బాలగోపాల్ కార్యదర్శి అయేనాటికి వరంగల్, కరీంనగర్ జిల్లాలలోని గ్రామాలలో సి.ఆర్.పి. బి.ఎస్.ఎఫ్. పోలీసు క్యాంపులుండేవి. గ్రామాల్లో కోళ్ళు పట్టుకొని తినడం, ఫ్రీగా పాలు, పెరుగు అందించాలనే వత్తిడులు పోలీసులు అదేపనిగా చేసేవారు. కాజీపేట దగ్గరలో ఉన్న రాంపూర్ గ్రామంలోని పంచాయితీ ఆఫీసులో ఒక పోలీసు క్యాంపు పెట్టారు. అట్లాగే బట్టుపల్లి గ్రామంలోని ప్రాథమిక పాఠశాలలో ఒక పోలీసు క్యాంపు పెట్టారు. మేం ఈ విషయాన్ని కలెక్టర్ దృష్టికి తీసుకువచ్చినా ఫలితం కనపడలేదు. గ్రామ ప్రజలకు సంబంధించిన ప్రజా సంస్థలలో పోలీసు క్యాంపులు పెట్టడం వలన గ్రామ పరిపాలన సజావుగా సాగకపోవడమే కాకుండా గ్రామ ప్రజలు, విద్యార్థులు తమ హక్కుల్ని కోల్పోతున్నారనే వాదనతో ఒక పిటీషన్‌ను కన్నబిరాన్ గారి ద్వారా హైకోర్టులో వేయించాడు. కోర్టు నుండి నోటీసు రాగానే ఎటువంటి ప్రతి వాదనలోకి పోకుండా వెంటనే ఈ రెండు గ్రామాల్లోని సంస్థలనుండి పోలీసు క్యాంపులను వేరే చోటికి తరలించడం జరిగింది.

అప్పటినుండి అవసరమనుకున్న సందర్భంలో సంస్థ కోర్టుకు వెళ్ళడం, లేక బాధితులు కోర్టుకు వెళ్ళడానికి సంసిద్ధంగా ఉంటే వాళ్ళను ప్రోత్సహించడం, సహాయం చేయడం మన కార్యక్రమంలో భాగం చేసుకున్నాం. హక్కుల సాధన కోసం న్యాయస్థానాలకు, ప్రత్యామ్నాయ సంస్థలకు పోయే ప్రక్రియ ఇట్లా మొదలై చింతపల్లిలో ఆదివాసుల ఇండ్లను తగలబెట్టినప్పుడు 'ఇండియన్ పీపుల్స్ ట్రిబ్యునల్' ద్వారా విషయాలను బయటికి తేవడం, జాతీయ మానవహక్కుల కమిషన్‌ను ఆంధ్రప్రదేశ్‌కు రప్పించి ఎన్‌కౌంటర్లపై విచారణ చేయించడం మొదలైనవన్నీ చేశాడు. అదృశ్యం కేసులు విచారణకు టి.ఎల్.ఎన్.రెడ్డి కమిషన్‌ని ఏర్పాటు చేసినపుడు రాష్ట్రంలోని అన్ని జిల్లాలు తిరిగి, మా అందర్నీ పురమాయించి వాంగ్మూలాలు సేకరించి, సాక్షులను తీసుకొచ్చి అన్నీ రికార్డయ్యేలా చేశాడు. ఎన్‌కౌంటర్లపై సుప్రీంకోర్టులో కేసువేయడం, రాష్ట్రంలో సాయుధ ముఠాల అకృత్యాల విషయంలో 'లోకాయుక్త'కు విచారణ చేపట్టే అధికారం ఉందని ఆ సంస్థకు నచ్చచెప్పి, అందులో ఫిర్యాదు నమోదు చేసి సాక్ష్యాలు ఇప్పించడం వంటి ప్రక్రియలన్నీ ఆయనే ప్రారంభించాడు. ఈ మొత్తం వ్యవహారం అంతా కూడా హక్కుల కార్యకర్తలకు గొప్ప అవగాహనను, చైతన్యాన్ని కలుగచేసింది. లాయర్ అయ్యాక స్వయంగా ఎన్నో కేసులు వేసి పేద ప్రజానీకానికి హక్కులు సాధించి పెట్టాడు.

వ్యవస్థీకృతమైన అన్ని అణచివేతలను హక్కుల ఉల్లంఘనలుగా గుర్తించడం మొదలుపెట్టాక ఒక్కొక్క అంశంపై నిజనిర్ధారణ చేసి, సమావేశాలు నిర్వహించి, కరపత్రాలు వేసి, వ్యాసాలు రాసి వాటిని ప్రజల అవగాహనలో భాగమయ్యేంతవరకూ

ఆ పనిని అలాగే కొనసాగించేవాడు. చంద్రబాబు తీసుకొచ్చిన విజన్ – 2020 నివేదికనైనా, గుత్తికోయిల సమస్యనైనా, సెజ్‌లనైనా, మతోన్మాదాన్నయినా అన్నిటి మీదా ఇదే పని పద్ధతి అవలంబించాడు. మాకూ అదే అలవాటు చేశాడు.

## పాదయాత్రలూ, ప్రచారయాత్రలూ

కరీంనగర్, ఆదిలాబాద్, వరంగల్, ఖమ్మం జిల్లాలలో సింగరేణి బొగ్గు కంపెనీ తలపెట్టిన ఓపెన్‌కాస్ట్ బొగ్గు గనుల విషయం తెలుసుకోవడానికి మానవహక్కుల వేదిక బృందం ముందుగా కరీంనగర్, ఆదిలాబాద్‌లో పర్యటించింది. కొన్ని చోట్ల గ్రామాలు ఖాళీ అయి వ్యవసాయ భూములు ఉండిపోతున్నాయని, వ్యవసాయ భూములు మాత్రమే సేకరించిన చోట గ్రామాలు మిగిలిపోయి ప్రజలకు ఇబ్బంది అవుతుందని ఈ సందర్భంగా గమనించాం. అప్పుడు అధికార్లను కలసి గ్రామాన్ని వ్యవసాయ భూముల్తో సహా సేకరించాలనే అభ్యర్థనను అధికార్ల ముందు ఉంచాం. కాని క్రమంగా అది భారీ యంత్ర ఆధారిత ప్రక్రియ అనీ పైమట్టి తొలగించే పనులు బయటి కాంట్రాక్టర్ నిర్వహిస్తాడనీ, నామమాత్రపు ఉద్యోగాలు కూడా రావనీ అర్థం అయింది. ఈ నాలుగు జిల్లాలలో తలపెట్టిన 70 పైచిలుకు ఓసిపిలే కాకుండా ఖమ్మం జిల్లాను దాటి పశ్చిమగోదావరి జిల్లాలో కూడా వాటిని చేపట్టే ఆలోచన ఉన్నట్టు గమనించాం. ఇట్లా కాదు దీన్ని పూర్తిగా వ్యతిరేకించవలసిందే, అందుకోసం ఒక బలమైన ఉద్యమం చేపట్టాలి అని బాలగోపాల్ సూచించాడు.

మామూలుగా అన్ని రాజకీయ పార్టీలు ఎన్నికల సమయంలో మాత్రమే చేపట్టే పాదయాత్ర, ప్రచార యాత్రలను బాలగోపాల్ సలహాతో కరీంనగర్, వరంగల్, ఆదిలాబాద్, ఖమ్మం, పశ్చిమగోదావరి జిల్లాలలో నిర్వహించాం. జరగబోయే విధ్వంసాన్నీ హక్కుల చౌర్యాన్నీ వాళ్ల భాషలో వివరించాం. ఇది చాలా మంచి ఫలితాలనిచ్చింది. ఇదే ప్రక్రియను శ్రీకాకుళంలో థర్మల్ ప్రాజెక్టులకు వ్యతిరేకంగా ప్రజల్ని కదలించడానికీ ఉపయోగించాం. అట్లాగే కోస్టల్ కారిడార్‌లో జరగబోయే విధ్వంసాన్ని వివరించడానికి కూడా ఈ పద్ధతినే ఎంచుకున్నాం. పోలవరం ప్రాజెక్టు విషయంలో అనుకున్నాం కాని తను ఉండగా చేయలేకపోయాం. బాలగోపాల్ పదును పెట్టిన ఈ ప్రచార యాత్ర ప్రక్రియను ఇప్పుడు ఎస్.సి., ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టం అమలు విషయంలో కరీంనగర్, మెదక్ జిల్లాలలో గ్రానైట్ కోసం కొండలను తవ్వి ప్రకృతిని విధ్వంసం చేస్తున్న వైనాన్ని ప్రచారం చేయడానికి చాలా ప్రభావవంతంగా వాడుతున్నాం. అభివృద్ధి చట్రంలో హక్కుల అంశాల్ని ఎట్లా చూడాలో మాకు వ్యాసాల ద్వారా, కార్యాచరణ ద్వారా ఎంతో అవగాహన కల్పించాడు.

సంస్థను ప్రజాస్వామికంగా నడిపే విషయంలో చాలా పట్టుదల, పారదర్శకత, క్రమశిక్షణ చూపేవాడు. కార్యవర్గం నిర్వహించే తీరు, కార్యకలాపాలు కొనసాగించే పద్ధతులు, ప్రాధాన్యతలను ఎంచుకొనే విషయం.. అన్నిట్లో ప్రజాస్వామికంగా వ్యవహరించే ఆచరణ శైలిని మాకు నేర్పించాడు.

కార్యకర్తల సమర్ధతను, బలహీనతను, లిమిటేషన్‌ను బాగా అర్థం చేసుకొని మసులుకునేవాడు. నాకు తెలిసి ఒక ఫిర్యాదు రూపంలోగాని, ఆరోపణ రూపంలో గాని కార్యకర్తపై కోపాన్ని ప్రదర్శించడం గాని, విమర్శకు పూనుకోవడం గాని చేసేవాడు కాదు. నా పట్ల ఆయనకుండే చనువు వల్ల నాపై అప్పుడప్పుడు జోకులు సరళమైన విమర్శ రూపంలో విసిరేవాడు. ఏ కార్యకర్త అయినా చేతనైన పని నిజాయితీగా చేస్తే చాలు అనేవాడు. తనని ప్రమాణంగా పెట్టుకోవాలని కానీ, తనే ఎక్కువ పనిచేస్తున్నాననే విసుగు గానీ భావనగానీ ఎప్పుడూ ప్రదర్శించేవాడు కాదు. ఆయన ఆచరణ, ఆయన వ్యక్తిత్వం మమ్మల్ని మేమే ప్రశ్నించుకొని మా వ్యక్తిత్వాన్ని నిర్వచించుకోవడానికి అవకాశం కల్పించింది. బాలగోపాల్ భౌతికంగా లేకున్నా, ఆ సూర్యుడి వెలుగులో అడుగులు వేస్తూ ముందుకు పోగలం అనే ధైర్యం అలవర్చుకున్నాం.

# అంచనాలకు అందనివాడు

యస్.యం. బాషా*

**అ**క్టోబర్ 8, 2009 మానవీయ విలువల్ని ప్రేమించే వారినీ, హక్కుల కార్యకర్తలనీ తీవ్ర దు:ఖానికి గురిచేసిన రోజు. ఐదు రోజుల మునుపు అనంతపురంలో హెచ్ఆర్ఎఫ్ మూడవ రాష్ట్ర మహాసభలు ఎంతో ఉత్సాహభరితంగా జరిగాయి. అప్పటికి ఆరోగ్యంగా ఆనందంగా ఉన్న మనిషి ఈ లోపే ఆకస్మిక మరణానికి గురయ్యాడంటే మాకెవరికీ నమ్మశక్యం కాలేదు.

అనంతపురం సభల్లో వర్తమాన సామాజిక పరిస్థితులపై ఆయన చేసిన విశ్లేషణ, సమస్యల ప్రస్తావన కొత్త, పాత సభ్యులందరినీ తీవ్రమైన ఆలోచనల్లోకి పడవేసాయి. సమకాలీన రాజకీయాల్లో భయం, అభద్రతలు ప్రజల్ని వాస్తవ పరిస్థితుల గురించి మాట్లాడకుండా శాసిస్తున్న వైనాన్ని ఆరోజు ఆయన బహిరంగ సభలో చేసిన ప్రసంగం ప్రస్తావించింది.

బాలగోపాల్‌ని అంచనా వేయగల సమర్థత, ధైర్యం నాకు లేదు. ఆయన మేధస్సునీ, విజ్ఞానాన్నీ అంచనా వేయగల తూనికరాళ్ళు నావద్ద లేవు. ఒక మాట మటుకు హక్కుల కార్యకర్తగా నేను చెప్పగలను. హక్కుల ఉద్యమంలో కార్యకర్త, నాయకుడు అన్న తేడా లేకుండా పని చేసిన వాడు బాలగోపాల్. రాష్ట్రంలోనూ, దేశంలోనూ ఎంతోమంది సామాజిక మేధావులున్నా బాలగోపాల్‌నే ప్రజలు విశ్వసించడానికి కారణమేమయి ఉంటుందో తేలిగ్గానే ఊహించగలం. అందరికీ మార్గదర్శకంగా ఉండే ఆయన వ్యక్తిత్వమూ, పని విధానమే దానికి కారణం. కార్యాచరణా, విలువల ఆచరణా ఆయన వ్యక్తిత్వంలో మిళితమై పోయాయి.

చాలామందిలాగే బాలగోపాల్ గారితో కలిసి అనేక కార్యక్రమాల్లో పాల్గొన్న అనుభవం నాకుంది. ఛత్తీస్‌గఢ్, మణిపూర్, కర్నాటకలలో హక్కుల కార్యరంగంలో

---

* **మానవహక్కుల వేదిక రాష్ట్ర ఉపాధ్యక్షుడు, అనంతపురం**

భాగంగా పర్యటించాము. తిండీతిప్పలూ, పడక విషయంలో మేం ఆయనతో పడలేక విసుక్కున్న సందర్భాలున్నాయి. సౌఖ్యాన్ని ఏనాడూ కోరడు. ఒక పూటైనా మంచి భోజనం తినిపిస్తాడా లేదా అని అనుకునేవాళ్ళం. పగలంతా తిరిగి అలసిపోయినా రాత్రంతా మేల్కొని నివేదికలు రాసేవాడు. గొప్ప పని రాక్షసుడు. ఇవన్నీ సామాన్యంగా అనిపించే విషయాలు అనిపించవచ్చు కాని వ్యక్తిత్వం నిర్ధారణకు ఇటువంటి విషయాలు కూడా తోడ్పడతాయి.

శ్రీకాకుళ ఉద్యమ నేపథ్యంలో హక్కుల సంఘం తెరమీదకి వచ్చింది. కాలక్రమేణా ఉద్యమ నిర్బంధంపైనే కాకుండా సాధారణ ప్రజానీకం ఎదుర్కొంటున్న నిర్బంధం, హింసలను వ్యతిరేకించే కార్యక్రమాల్ని కూడా చేపట్టే వైఖరిని హక్కులసంఘాలు తీసుకున్నాయి. తర్వాత కాలంలో హక్కుల సంఘాలు స్వతంత్రంగా ఏర్పడాలని, పనిచెయ్యాలని ఆలోచనలు వ్యక్తమయినా ఆచరణలో మాత్రం రాజకీయ పార్టీల కనుసన్నల్లోనే పనిచేసాయి. హక్కుల సంఘాలు స్వతంత్ర సంస్థలుగా ఎదగడానికి పార్టీలు ఇష్టపడలేదు. పార్టీలు ఇష్టపడటం లేదనడం కంటే, హక్కుల సంఘాల్లో పనిచేస్తున్న నాయకులు కూడా పార్టీల ప్రాపకాన్ని వదులుకోవడానికి ఇష్టపడలేదు.

పార్టీల ప్రమేయంవల్ల హక్కుల కార్యాచరణలో ద్వంద్వ ప్రమాణాలు పాటించాల్సి రావడంతో నిజమైన ప్రజాతంత్ర సంస్థలుగా ఎదగడంలో హక్కుల సంఘాలు అవరోధాలు ఎదుర్కొన్నాయి. ఆ తర్వాత తెలంగాణలో ప్రభుత్వం నక్సలైట్ కార్యకర్తలపై, సామాన్య ప్రజలపై ప్రయోగిస్తున్న రాజ్యహింసకు ప్రతిగా ఆయా పార్టీలు అమలుపర్చే హింసా పద్ధతులపై చర్చ మొదలయ్యింది. ప్రజల మీద జరిగే అన్ని హింసా రూపాల్ని ఖండించవలసిందే అన్నది బాలగోపాల్ విశ్వాసం. ఆయన వాదనను అంగీకరించని వీరశైవులు కొందరు అంగీకరించకపోతే అంగీకరించకపోయారు, ఆయనపై ఆరోపణలకు దిగారు. మరొకరయితే ఆ ఆరోపణల తీవ్రతకీ, దాడికీ తట్టుకోలేక నమస్కారంపెట్టి వెళ్లిపోయి ఉందురు. కానీ బాలగోపాల్ అలా చేయలేదు. తాను నమ్మిన విలువలకు కట్టుబడ్డారు. విలువల మేరు పర్వతమై నిలబడ్డారు. ఆ తర్వాత మాలాంటి వాళ్లందరితో కలిసి మానవహక్కుల వేదిక ఏర్పాటు చేశారు. స్వతంత్ర హక్కుల సంస్థగా మానవహక్కుల వేదికను ఆయన నడిపించిన తీరు అసామాన్యమైనది. ప్రజాస్వామిక సంస్కృతిని పెంపొందించే లక్ష్యంతో ఆయన అనంతపురం మహాసభల్లో ప్రధాన కార్యదర్శి పదవిని వద్దనుకున్నాడు.

బాలగోపాల్ గురించి ఇలా ఎంతైనా చెప్పుకోవచ్చు. ఒక్క మాటలో చెప్పుకోవాలంటే బాలగోపాల్ పరిపూర్ణ మానవుడు. తనకు తానుగా ఒక మంచి మానవునిగా జీవితం గడిపిన వాడు.

# నిరంతరం తట్టిలేపే జ్ఞాపకం

డా॥ ఎ. సుబ్రహ్మణ్యం*

మనుషులు దూరమైనా జ్ఞాపకాలు విడువవు. కొందరు దూరమైనా తట్టి లేపే జ్ఞాపకాలుగా మిగిలే ఉంటారు. అవి ఎప్పుడూ నిత్య నూతనంగా భాసిస్తుంటాయి. అట్లా జ్ఞాపకాలుగా మిగిలిన కొందరు కొండగుర్తులవుతారు. కొన్ని నిర్దిష్ట విషయాలకు వారే చిరునామాలవుతారు. నా జ్ఞాపకాలలో అట్లా మిగిలిన కొందరిలో ముఖ్యుడు కె. బాలగోపాల్. ఆయన హక్కుల ఉద్యమానికి కొండగుర్తు. నాగరిక సమాజానికి ఎప్పటికీ అవసరమయ్యే ప్రజా హక్కుల ఉద్యమానికి ఒక సిద్ధాంత కర్త. ఒక చుక్కాని.

బాలగోపాల్‌తో నాకు పరిచయం రెండు దశాబ్దాలకుపైనే. అది గొప్ప అనుబంధం కూడా. ఒక దశలో ఆయనంటేనే పెద్ద ఆశ్చర్యం. నాయకులు ఇట్లా కూడా ఉంటారా అని ఆశ్చర్యం. మేధావి ఇంతటి కార్యకర్త కూడానా అనే సంభ్రమం. అసలా నాయకత్వ సరళే నాకు కొత్త. ఒక మహోన్నత లక్ష్యం కోసం, ఒక ఆదర్శ సమాజం కోసం సంఘాలు ఏర్పడతాయి. కానీ నాయకగణం విషయానికొచ్చేసరికి అవే పెత్తందారీ పోకడలు. అణచివేయబడిన తరగతుల నుండి వచ్చిన నాలాంటి వారికి ఈ ధోరణులు మరింత కాక పుట్టించేవి. లక్ష్యాలు మహోన్నతం అయినప్పుడు ఇటువంటి స్వల్ప విషయాలను పట్టించుకోకూడదని మళ్లీ ముక్తాయింపులు. 'పెత్తనం చెయ్యాలనే సంబరం నీకు ఉండొచ్చు. పెత్తనం చేయించుకోవాలని నాకెందుకుంటుంది' అన్న తూసిడైడిస్ మాటలు పదేపదే గుర్తొచ్చేవి. ఒక విధమైన ఊపిరాడని వాతావరణం. ఆ స్థితిలో 'ఆక్సిజన్'లా బాలగోపాల్ ప్రవేశం.

'మహోన్నతమైన లక్ష్యాల కోసం జరిగే ఉద్యమంలో అందరూ సమాన భాగస్వాములే. నిచ్చెన మెట్లు లేవు. ఆధిపత్యం లేదు. పెత్తనం లేదు. ఆ విధమైన

* **మానవహక్కుల వేదిక రాష్ట్ర ఉపాధ్యక్షుడు, నెల్లూరు**

నాయకత్వం కోసం యావలేదు. ఒక లక్ష్యం కోసం కూడినవాళ్లం పనిచేసుకుంటూ పోదాం. తక్కినవి అంత ప్రధానం కాదు. పనిచెయ్యడమే ముఖ్యం'. ఇదీ బాలగోపాల్ ప్రవేశం తర్వాత కనిపించిన పరిణామం. ఇది కార్యకర్తలకు స్ఫూర్తిని, ఉత్సాహాన్ని ఇచ్చే వాతావరణం. ఉద్యమానికి ఊతమిచ్చే అనుకూల వాతావరణం. అత్యుత్తమ ఫలితాలు సాధించగల ఆదర్శ కార్యక్షేత్రం. అందులో మొలకెత్తిన నా వంటి బీజాలెన్నో!

పేజీలకు పేజీల రాతలు, శోషవచ్చే ఉపన్యాసాలు కాదు. నిర్దేశించుకున్న సూత్రాలకు చిత్తశుద్ధితో కట్టుబడిన ఆచరణ ముఖ్యం. అంతకు మించి ఏ హంగులు, అట్టహాసాలు అవసరం లేదు. హంగులు, ఆడంబరాల ద్వారా కాక పనిచేయడం ద్వారానే గుర్తింపు పొందిన అరుదైన నాయకుడు డా॥ బాలగోపాల్. హక్కుల లేమి, హక్కుల అణచివేత, హక్కుల అవగాహనా రాహిత్యంతో ముడిపడిన రంగంలో పనిచేసే నాయకత్వం ఎట్లా ఉండాలో మాదిరి చూపించిన వారు డా॥ బాలగోపాల్.

హక్కుల ఉద్యమంలో ఆయనే నాకు స్ఫూర్తి, ఆదర్శం. ఇక్కడ రెండు విషయాలు నేను గుర్తు చేసుకోవాలి. ఆయనతో కలసి పని చెయ్యడం చాలా సులువు. అది ఎంతో హాయిగా కూడా ఉంటుంది. నాయకుడుగా ఆయన ఏ విధమైన ఆధిపత్యాన్ని, పెత్తనాన్ని ప్రదర్శించడు. ఆయన ఒక నిఖార్సైన, నిబద్ధత గల కార్యకర్త. ఆయనను అనుసరిస్తే చాలు పనిలో భాగమైపోతాం. జ్ఞానం, కార్యాచరణ రెండూ కలిసొస్తాయి. వాటి అభేదాన్ని అర్థం చేసుకుంటాం. ఇది ఒక అరుదైన విషయం.

## నేల విడవని విజ్ఞత

మరొకటి – ఆయన తాత్విక అవగాహన, అందులోని సునిశితత్వం, సరళత, నేల విడవని విజ్ఞత. పౌరహక్కుల సంఘంలో సైద్ధాంతిక విభేదాలు తలెత్తినప్పుడు, హక్కుల ఉద్యమ పరిధిని విస్తరిస్తూ, హక్కుల ఉల్లంఘనల జాబితాలో ఆయన చోటు కల్పించిన అంశాలు మాబోటి వాళ్ళ గుండెలను తాకాయి. రాజ్యహింసే హక్కుల ఉల్లంఘనలకు పర్యాయపదంగా పరిగణించబడుతున్న దినాలలో, భారత సమాజంలో భయంకరమైన ఇతర వ్యవస్థీకృత హింసా రూపాలున్నాయని – ఒక వర్గంగా స్త్రీలపై జరిగే హింస, దళితులపై సాగే అమానుష వివక్షా హింస, నాగరిక సమాజం నుండి వెలివేయబడి ప్రదర్శనా వస్తువులుగా మారిన ఆదివాసులపై అమలయ్యే హింసాకాండ మొదలైనవి రాజ్యహింసకు ఏమాత్రం తీసిపోవని, తమ స్థితిగతులు సమూలంగా మారాలనే లక్ష్యంతో ఆయా వర్గాలు చేసే పోరాటాలు కూడా విప్లవ పోరాటాలుగా పరిగణించబడాలని ఆయన పెట్టిన ప్రతిపాదన నాబోటి వాళ్ళను తట్టి లేపాయి. హక్కుల ఉద్యమం పేరిట అప్పటి వరకూ సాగిన కార్యాచరణకు గల పరిమితులను గుర్తు చేశాయి. స్త్రీ, దళిత, ఆదివాసీ విముక్తి ఉద్యమాలు, ఇతర అస్తిత్వవాద ఉద్యమాలకు బాలగోపాల్ ప్రతిపాదనలు ఊతమిచ్చాయి.

ఈ సందర్భంలో నేను మరొక విషయాన్ని కూడా గుర్తు చేసుకోవాలి. పౌరహక్కుల సంఘంలో సైద్ధాంతిక విభేదాలపై చర్చల సందర్భంగా విప్లవకారులు ప్రజల యెడల బాధ్యతగా వ్యవహరించాలని, కర్కశత్వానికి, అమానుష చర్యలకు పాల్పడరాదని, నూతన ప్రజాస్వామిక విప్లవం సాధించిన తర్వాత కూడా ప్రజల ప్రశ్నించే హక్కుకు హామీ ఉండవలసిందేనని, నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని లక్ష్యంగా ప్రకటించుకున్నవారు ఆ ప్రజాస్వామిక విలువలను తప్పనిసరిగా గౌరవించవలసిందేనని బాలగోపాల్ అంటుండేవారు. ఈ విషయంలో బాలగోపాల్ కొంత అతిగా స్పందిస్తున్నారని, ఆయన వ్యక్తం చేసిన భయాలు చాలావరకు ఊహిస్తున్నవి కావచ్చునని, విప్లవ కార్యక్రమాల సందర్భంగా పీడిత వర్గాల కసి నుండి అక్కడక్కడ జరిగిన ఘటనలకు ఎక్కువ భయపడుతున్నారని వ్యక్తిగతంగా నేను భావించాను. ఉద్యమ ప్రాంతాలకు దూరంగా ఉన్న ప్రాంతాలకు చెందిన వ్యక్తిగా అప్పటికి అది నేను ఏర్పరచుకున్న భావన. అయితే ఒక తెలంగాణ జిల్లాకు చెందిన ఒక ఎస్సీ అబ్బాయి ఒక బి.సి. అమ్మాయిని ఇష్టపడి, పెద్దలకు ఇష్టం లేకుండా పెళ్ళి చేసుకున్న సందర్భంలో పార్టీ ఎస్సీ అబ్బాయినే శిక్షించిందని తెలిసినప్పుడు విప్లవోద్యమంలో జరిగే హింసా ఘటనలన్నీ అనివార్య పరిస్థితులలో సంభవించినవి కావని, కుల వివక్ష ఇక్కడ కూడా ఒక స్వభావంగా నడుస్తూనే ఉందని అర్థమైంది. నా భావనలోని పొరపాటును గుర్తించాను. నేను, మరికొందరు మిత్రులం కలిసి బాలగోపాల్‌తో రెండు దఫాలుగా చర్చలు జరిపి, పూర్తి అవగాహన ఏర్పడ్డాకే కొంత ఆలస్యంగా మానవహక్కుల వేదికలో భాగమయ్యాం.

### 'యు ఆర్ గ్రేట్' అన్నాడు ఇంజనీరు

నెల్లూరు జిల్లాకు చెందిన హక్కుల ఉద్యమ కార్యకర్తగా బాలగోపాల్‌తో నాకు ఎన్నో అనుభవాలున్నాయి. తుఫానులు, వరదలు, రొయ్యల చెరువులు, కరువులు, విస్థాపనలు, సెజ్‌లు, పర్యావరణం, అసహజమరణాలు, చట్టాల ప్రచారం, అవగాహనా తరగతులు... ఇట్లా అనేక అంశాలమీద అనేక సందర్భాల్లో ఆయన నెల్లూరు జిల్లాకు వచ్చారు. జిల్లా భౌగోళిక స్థితి ఆయనకు కరతలామలకం. తడనుండి కావలి వరకు, ఉదయగిరి, వరికుంటపాడు నుండి ముత్తుకూరు వరకు అన్ని ప్రాంతాలు, వాటి ప్రత్యేకతలు ఆయనకు తెలుసు. జిల్లావాసులమైన మాకంటే ఎక్కువ పరిజ్ఞానం ఆయనకు ఉండడం మమ్మల్ని ఎంతో అబ్బురపరిచేది. ఆ విషయంలో పోటీ పడాలనుకునే వాళ్ళం. ఆయన పర్యటనలన్నీ ఏదో ఒక ముఖ్యమైన విషయానికి, సమస్యలకు సంబంధించినవే. వాటిలో కొన్ని బాగా గుర్తుండిపోయాయి. 2004 సంవత్సరంలో భారీ వర్షాలకు చెరువులు తెగిపోయి జిల్లా అతలాకుతలమైపోయింది.

అప్పుడు బాలగోపాల్ నాయకత్వంలో సైదాపురం, బాలాయపల్లి, వెంకటగిరి, బోగోలు, జలదంకి, కలిగిరి, వింజమూరు మండలాలు తిరిగాం. కండలేరు, సోమశిల, తెలుగుగంగ లోతట్టు ప్రాంతాలను పరిశీలించాం. ఆ సందర్భంగా ఆయన నెల్లూరు జిల్లాలో నీటి పారుదల వ్యవస్థ, సోమశిల, కండలేరు రిజర్వాయర్లు, తెలుగుగంగ కాలువల నిర్మాణం తర్వాత ఉత్పన్నమైన పరిస్థితి, జిల్లాలో ప్రముఖ నీటి వనరుగా ఉన్న చెరువుల వ్యవస్థను కాపాడడానికి తీసుకోవలసిన చర్యలపై ఒక సమగ్రమైన నివేదికను తయారుచేశారు. ఆ సమయంలోనే నీటిపారుదల శాఖ కార్య నిర్వాహక ఇంజనీరు కార్యాలయానికి సమాచారం కోసం వెళ్ళినప్పుడు జరిగిన సంఘటన ఒకటి చెప్పాలి. అక్కడ పనిచేసే ఒక ఇంజనీర్ వరంగల్‌లో తన సమకాలికుడట. ఆ చనువుతో బాలగోపాల్ తనకు కావలసిన ఎన్నో సాంకేతిక విషయాలను సేకరించారు. వాటి వివరణలు అడిగారు. కాసేపటికి సదరు ఇంజనీరు బాలగోపాల్‌ను మీరు కూడా ఇంజనీరేనా అని అడిగారు. కాదు, ఇది కేవలం విషయ సేకరణ కోసమే అని బాలగోపాల్ బదులిచ్చారు. 'ఒక అనుభవజ్ఞుడైన ఇరిగేషన్ ఇంజనీరులా చర్చించారు. యూ ఆర్ గ్రేట్' అంటూ ఆయన బాలగోపాల్‌ను అభినందించడం, అదేమీ పట్టించు కోకుండా బాలగోపాల్ తలవంచుకుని బయటికి వచ్చేయడం నాకు బాగా గుర్తు.

నెల్లూరు జిల్లా తడ వద్ద స్థాపించిన తొలి 'సెజ్' కర్మాగారం 'అపాచీ'. 2008లో ఈ 'సెజ్' కారణంగా భూములు, ఇళ్ళస్థలాలు, సాగునీటి కాలువలు కోల్పోయిన గ్రామాల ప్రజలను కలిసి పరిస్థితిని అర్థం చేసుకోవడానికి బాలగోపాల్ అక్కడకు వచ్చారు. భూసేకరణలోను, పరిహారం చెల్లింపులలోను, హామీ ఇచ్చిన ఉపాధి విషయాలలోనూ జరిగిన అవకతవకలను రికార్డు చేశారు. ఎక్కడా తాను హైకోర్టు న్యాయవాదినని చెప్పుకోలేదు. అలా చెపితే ఏదో కేసుల కోసం వచ్చిన లాయర్ అనుకుని ప్రజలు పొరపడే అవకాశం ఉందని, దానివల్ల సమస్యకు సంబంధించిన అన్ని విషయాలు బయటకు రాకుండా పోతాయని ఆయన ఈ జాగ్రత్త తీసుకున్నట్లు తర్వాత మాకు అర్థమయింది.

2009లో బాలగోపాల్ తీరప్రాంతాలను సందర్శించారు. కృష్ణపట్నం వద్ద నిర్మించబడిన 'పోర్టు' వల్ల ఖాళీ అవుతున్న మత్స్యకార గ్రామాలకు వెళ్ళి పోర్టు వల్ల మత్స్యకారుల ఉపాధికి, జీవించే హక్కుకు సంభవించబోయే ప్రమాదాన్ని వివరించారు. అదే విధంగా ముత్తుకూరు సమీప గ్రామాల్లో నిర్మాణం కాబోతున్న విద్యుత్ కేంద్రాల వల్ల ముత్తుకూరు మండలమే గాక మొత్తం జిల్లా భయంకరమైన కాలుష్యం బారిన పడబోతుందని, రామగుండంకు మించిన విపత్తును ఎదుర్కోబోతోందని పర్యావరణ శాస్త్రవేత్తల ద్వారా మత్స్యకారులకు వివరంగా చెప్పించి వారిని హెచ్చరించారు.

విశాఖ, శ్రీకాకుళం, కాకినాడ ప్రాంతాలలో కాలుష్య కారక పరిశ్రమలకు వ్యతిరేకంగా జరుగుతున్న ఉద్యమాల ప్రస్తావన వచ్చినప్పుడంతా అటువంటి విద్యుత్ కేంద్రాలవల్ల నెల్లూరు జిల్లాకు జరగబోయే ప్రమాదాన్ని గుర్తు చేస్తూ ఈ విషయమై ప్రజలను హెచ్చరించడానికి తీర ప్రాంతం వెంబడి పాదయాత్ర జరుపుదామని ప్రతిపాదించారు. ఆ కర్తవ్యాన్ని తప్పక నెరవేరుస్తాం.

బాలగోపాల్‌తో నాకు వ్యక్తిగత అనుబంధం కూడా ఉంది. బహుశా ఆయన చదివిన కాలేజీ (కావలి జవహర్ భారతి)లోనే నేనూ చదవడం వల్లనో, లేక నెల్లూరు జిల్లాతో ఆయనకుగల అనుబంధం వల్లనో నాతో కొంత చనువుగా ఉండేవాడు. నామీద జోక్‌లు వేసేవాడు. ఏమీ పట్టనట్టు ఉంటాడు గానీ మంచి హాస్య చతురుడు. ఒకసారి నాకోసం ఎవరిదో ఒక డొక్కు స్కూటర్ తీసుకుని నేను పనిచేస్తున్న కాలేజీ ఉన్న ఇనమడుగు అనే ఊరికి వచ్చారు. నెల్లూరు నుండి ఆ ఊరు 10 కి.మీ. ఉంటుంది. ఇద్దరం బయల్దేరి నెల్లూరు వస్తుండగా దారిలో ఆ స్కూటర్ ఆగిపోయింది. కనీసం 3–4 కి.మీ నెట్టుకు రావలసి వచ్చింది. టౌన్‌లోకి ప్రవేశించేచోట ఒక సిగ్నల్ బోర్డు ఉంది. దానిమీద – ట్రాఫిక్ నిబంధనలు పాటించండి. ప్రమాదాలను నివారించండి. ఇట్లు ట్రాఫిక్ సి.ఐ. నెల్లూరు – అని రాసి ఉంది. వెంటనే బాలగోపాల్ – 'ఏమయ్యా! ఈ హెచ్చరిక సి.ఐ.దా? మరి ఎస్.ఐ.కి ఆ పట్టింపులేదా' అన్నారు. అంత ఒత్తిడిలోనూ ఆయన హాస్య చతురత ముచ్చట వేసేది.

## ఉద్యమాల రౌడీవా అనేవారు

2003 ఆ ప్రాంతాలలో నేను హక్కుల సంస్థతోబాటు బలహీన వర్గాల సమాఖ్య, ఆలిండియా సమతా సైనిక్‌దళ్, పర్యావరణ పరిరక్షణ సమితి, ఎస్సీ ఎస్టీ అత్యాచారాల నిరోధక చట్టం అమలు కోసం ఏర్పడిన కమిటీ తదితర సంస్థలతో కలిసి పనిచేసేవాణ్ణి. ఆ పరిస్థితిపై వ్యాఖ్యానిస్తూ నువ్వు నెల్లూరు జిల్లాలో ఉద్యమాల రౌడీవా అనేవారు. ఆయనకు ఎప్పుడైనా ఫోన్ చేస్తే విషయం సూపర్‌సానిక్ వేగంతో చెప్పాల్సిందే. మధ్యలో ఆలోచనలో పడి ఊపిరి తీసుకున్నా ఫోన్ పెట్టేసేవారు. ఒకసారి నేను ఆ విషయమై – ఎంతో అవసరం ఉండి ఫోన్ చేస్తాం. ఫోన్ చేసింది మేము. బిల్లు పడేది మాకు. మధ్యలో మీకేం బాధ. ఎవరో తరిమినట్టు ఫోన్ పెట్టేస్తారు – అని నిలదీశాను. భలే ఉన్నావే. బిల్లు నీదే. కానీ టైం నాది కదా – అని ఆయన సమాధానం.

బాలగోపాలంటే నాకు ఒక ప్రత్యేకమైన గౌరవం. అందుకు కారణం ఆయన వ్యక్తిత్వం. ప్రతి వ్యక్తీ ఏదో ఒక వర్గానికి, కులానికి, మతానికి, ప్రాంతానికి, సంస్కృతికి చెందినవారై ఉంటారు. వాటి కారణంగా సంబంధిత స్వభావం, లక్షణాలు

అనివార్యంగా అలవడి ఉంటాయి. అదే కారణంగా వాటిలో చాలామటుకు అవలక్షణాలుగాను, ఆధిపత్య లక్షణాలుగాను, ఛాందస లక్షణాలుగాను ఉండొచ్చు. ప్రగతిశీల భావాలు గలిగినవారు ఆ లక్షణాలను ప్రయత్నపూర్వకంగా వదిలించుకుని, నూతన విలువలను ప్రోది చెయ్యాలి. మనిషి వ్యక్తిత్వానికి, ప్రగతిశీలతకు అదే కొలబద్ద. ఆహారపుటలవాటుల నుండి ఆలోచనాసరళి వరకు మార్చుకోవడానికి బాలగోపాల్ చేసిన ప్రయత్నాలు, కృషి, సంకల్పం నేను చాలా దగ్గరగా గమనించాను. ఈ విషయంలో బాలగోపాల్‌ది మహోన్నత వ్యక్తిత్వం. అది నన్ను నిరంతరం అప్రమత్తం చేసే ఒక దిక్సూచి.

# దేవుడైనా మోకరిల్లాల్సిందే

కె.వి. జగన్నాథరావు*

**మా** బారువా ప్రాంతం బాలగోపాల్‌కి ఎంతో రుణపడి ఉంది. థర్మల్ కాలుష్యానికి సోంపేట సొమ్మసిల్లిపోకముందే, కొత్త అభివృద్ధి నమూనాకు బీల, తంపర భూములు ఎండి ఎడారులు కాకముందే, స్థానిక ప్రజల జీవితాలు ఆ ఎడారుల్లో తడారక మునుపే బాలగోపాల్ ఆ విధ్వంసక దృశ్యాన్ని పసిగట్టారు. పసిగట్టి ప్రమాద హెచ్చరిక చేశారు. ప్రజలు కూడా ఆయన హెచ్చరికను పెడచెవిన పెట్టలేదు. బాలగోపాల్ అటువంటి నమ్మకాన్ని కలిగించారు ప్రజల్లో. ఏ నాయకుడూ, ఏ రాజకీయ పక్షమూ తోడు రాకపోయినా బారువా-సోంపేట ప్రజలు స్వతంత్రంగా పవర్ ప్లాంట్ వ్యతిరేక పోరాటం చేశారు. ఇంకా చేస్తున్నారు.

బాగా వెనక్కి వెళితే జీరుపాలెం మత్స్యకారులు నడిపిన పోరాటానికీ బాలగోపాల్ అండ ఉంది. తాము వేట చేసుకొచ్చిన మత్స్య సంపదలో కొంత భాగాన్ని స్థానిక భూస్వామి శ్రీరాములు నాయుడు కాజేస్తుంటే దశాబ్దాలుగా సాగుతున్న ఆ దోపిడికి వ్యతిరేకంగా మత్స్యకారులు తిరగబడ్డారు. ఆగ్రహంతో ఆ భూస్వామి గ్రామం మొత్తాన్నీ తగులబెట్టాడు. ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘానికి బాలగోపాల్ ఆనాడు ప్రధాన కార్యదర్శి. వారిపై జరిగిన దురాగతాన్ని బయటి ప్రపంచానికి తెలియజేయడంలో ఆయన విశేషమైన కృషి చేశారు.

ఇటీవల 2007 మే నెలలో శ్రీకాకుళంలో మానవహక్కుల వేదిక రెండవ రాష్ట్ర మహాసభలను జరుపుకున్నాం. సభలు విజయవంతం కావడం, సంఘం బలపడటం

---

*** మానవహక్కుల వేదిక రాష్ట్ర కార్యదర్శి, శ్రీకాకుళం**

స్వతంత్ర హక్కుల ఉద్యమం కోసం పోరాటం చేసుకుంటూ వచ్చిన బాలగోపాల్‌కి గొప్ప ఆనందాన్ని ఇచ్చాయి.

## ఊపిరి పీల్చినట్టే పని చేయాల్సొచ్చేది

బాలగోపాల్‌గారి గురించి రాయాలన్నా, చెప్పాలన్నా ఎవరైనా కొంచెం మాత్రమే చేయగలం. పూర్తిగా చెప్పడం ఏ ఒక్కరికీ సాధ్యం కాదనుకుంటున్నాను. ఆయనతో పని చేయడం మాత్రం అందుకు విరుద్ధం. కొంచెం కొంచెం చేసి వూరుకోలేం. పూర్తిగా నిమగ్నమవ్వాల్సిందే. కళ్లార్పడం, ఊపిరి పీల్చడం ఎంత సహజంగా చేస్తామో పని కూడా అలా అలవాటయ్యేలా చేస్తారాయన.

తొలిసారి 1986లో ఆయనతో నాకు పరిచయం ఏర్పడింది. ఆనాటినుంచీ ఇప్పటి వరకూ ఆయన వందలసార్లు శ్రీకాకుళాన్ని సందర్శించారు. జీరుపాలెం ఘటన నాటినుంచి నిన్నటి సోంపేట ఘటన వరకూ జిల్లాలో హక్కుల ఉల్లంఘనకు వ్యతిరేకంగా జరిగిన అన్ని పోరాటాల వెనుకా బాలగోపాల్ గారి పాత్ర, మార్గదర్శకత్వం ఉన్నాయి.

జిల్లాలో హెచ్.ఆర్.ఎఫ్ బలపడటానికి ఆయన మాకందరకూ నేర్పిన పని విధానమే కారణం. పదిమంది తోడు వచ్చినా, రాకపోయినా ఆయన తన కర్తవ్యాన్ని ఎప్పుడూ నిర్వహించకుండా ఉండిపోలేదు. కదిలించేవారు ఒక్కరున్నా చాలు చైతన్యం రగిలించవచ్చుననుకునే మనస్తత్వం ఆయనది. నిర్బంధం కారణంగా శ్రీకాకుళం జిల్లా ఎపిసిఎల్‌సి యూనిట్ అధ్యక్ష కార్యదర్శులు రాజీనామాలు చేసిన ఒక సందర్భంలో యూనిట్ మొత్తం రద్దయ్యింది. అయినా కూడా జిల్లాలో ఎపిసిఎల్‌సి కార్యక్రమాలు జరిగాయి. ఆయన ఒంటరిగా వచ్చి కార్యక్రమాలను నడిపేవారు. ఆయన తీసుకున్న ఈ వైఖరి జిల్లా యూనిట్ పున:ప్రారంభానికి దోహదం చేసింది.

మాటల్లో క్లుప్తత, విశ్లేషణలో గాఢత, పనిలో తాదాత్మ్యత ఆయనకే సొంతమైన లక్షణాలు. ఎంతటి పెద్ద విషయాన్నైనా ఫోనులో చాలా క్లుప్తీకరించి చెప్పేవారు. ఆయన అఫిడవిట్లు కూడా అలాగే క్లుప్తంగా, సూటిగా ఉంటాయని, అనవసర ప్రసంగం చేయరనీ న్యాయవాదులు అంటారు.

కేసులు, ఫీజుల విషయంలో ఆయన ఎంత కచ్చితంగా ఉంటారో నాకు తెలిసిన ఒక ఉదాహరణ చెపుతాను. ఒకసారి విశాఖపట్నంలో ఒక లాయరు ఒక కేసు అప్పగించబోయారు. బాలగోపాల్‌గారు రెండు ప్రశ్నలు అడిగారు. 'దళితులకు వ్యతిరేకమా', 'స్త్రీలకు వ్యతిరేకమా' అని. రెండూ కాదు, రివిజన్ అని చెప్పి ఆ న్యాయవాది 5 వేల రూపాయల ఫీజు ఇవ్వబోయారు. బాలగోపాల్‌గారు 2 వేలు చాలు అన్నారు. 'పర్వాలేదు సార్ నా సొంతం కాదు. పార్టీ ఇచ్చింది' అన్నాడతను. 'నీవు

పాడైపోతే నీ ఇష్టం. కాని నన్ను పాడు చేస్తానంటే నేను ఒప్పుకోను' అని సున్నితంగా నవ్వుతూ రెండు వేలే తీసుకున్నారు.

బాలగోపాల్‌ని అందరూ సీరియస్ వ్యక్తని అనుకుంటూ ఉంటారు. కానీ ఆయనలో హాస్యం పాలు తక్కువేం కాదు. ఒకరోజు మా ఇంటివద్ద భోజనం చేసి రాసుకుంటున్నారు. ఉడకపెట్టిన శెనక్కాయలు ఇచ్చాను. తిన్నారు. తర్వాత పాలు ఇచ్చాను. తాగారు. తర్వాత వక్కపొడి వేసుకుంటారా అని అడిగాను 'ఇందాకటి నుంచి చూస్తున్నాను. చివరికి నాచేత గడ్డికూడా తినిపించేలా ఉన్నావే!' అని నన్ను ఎగతాళి చేశారు.

ఒక మనిషి తాను ఏవిధంగా ఉండాలని నిర్ణయించుకుంటాడో అదే విధంగా, అదే కమిట్‌మెంట్‌తో సుదీర్ఘకాలం, జీవితాంతం పనిచేయడం ఊహించుకోవడానికే కష్టం. సాదాసీదా జీవితశైలిని గడుపుతూ చివరకు బట్టలూ, చెప్పులూ, ఆరోగ్యం వంటి విషయాలను కూడా పట్టించుకునేవారు కాదు. మనిషి పతనం 'స్వంతం' గురించి ఆలోచించడంతోనే ఆరంభమవుతుందంటారు. బహుశా బట్టలూ, చెప్పులూ వంటివి ఆ పతనానికి మొదటి మెట్టనుకునే వారేమో బాలగోపాల్. ఆ మొదటి మెట్టును కూడా తాకని ఆయన వ్యక్తిత్వం ముందు దేవుడైనా మోకరిల్లవలసిందే.

# గుర్తు చేసుకోవడమంటే ఆచరించడమే

జి. మోహన్*

**బా**లగోపాల్‌గారితో నా తొలి పరిచయం 1989 నల్గొండ జిల్లా పౌరహక్కుల సంఘం మొదటి సభల సందర్భంలో. ఇక్కడే స్వతంత్ర ఆలోచన, నిష్పాక్షికత కలిగిన ఆయన వ్యక్తిత్వం నాకు పరిచయమయ్యింది. హక్కుల కార్యకర్తగా నేను రూపు దిద్దుకోవడానికి తగిన స్ఫూర్తిని ఆయన నుంచి పొందడం మొదలయ్యింది.

నల్గొండ జిల్లాలో భిన్న రాజకీయ దృక్పథాలు కలిగిన రెండు విప్లవ గ్రూపుల వారు పౌరహక్కుల సంఘంలో ఉండేవారు. ఆ సభలో సంఘ బాధ్యతల నిర్వహణను సగం సగం పంచుకుందామని వాటాలు వేసుకుంటున్న సందర్భంలో బాలగోపాల్ అప్రజాస్వామికమైన ఈ పద్ధతిని ఖండించారు. పనిచేసే వ్యక్తులు సంఘ బాధ్యులుగా ఉండాలి కానీ వాటాలు వేసుకోవడమేమిటంటూ విమర్శించారు. అంతవరకూ నాకు బాలగోపాల్‌పై ఉన్న అభిప్రాయం తొలగిపోయి, ఆయనో స్వతంత్రమైన వ్యక్తని అర్థమైంది.

సంఘంలో ప్రజాస్వామిక విలువల ఆచరణకు ఆయన ఎంతగా ప్రాధాన్యం ఇస్తారో తెలియజెప్పే మరో సందర్భం – మానవ హక్కుల వేదిక మొదటి రాష్ట్ర మహాసభలు మిర్యాలగూడెంలో జరగడానికి ముందు రాష్ట్ర కార్యవర్గ సమావేశం జరిగింది. మహాసభల్లో కొత్త కార్యవర్గాన్ని సభ్యులు ఎన్నుకుంటారు. పాత కార్యవర్గం కొత్త కార్యవర్గంలో ఎవర్ని తీసుకుంటే బాగుంటుందో ఒక ప్రతిపాదనను ఉంచుతుంది. దానిపై చర్చ జరుగుతోంది. ఒక సభ్యుడు రాష్ట్ర కార్యవర్గంలోకి ఒక బయటి వ్యక్తిని ప్రతిపాదించారు. దానికి బాలగోపాల్ 'ఇదేం కాంగ్రెస్ పార్టీ కాదు,

* మానవహక్కుల వేదిక రాష్ట్ర కార్యదర్శి, నల్గొండ

ఎవరినో ఒకర్ని తీసుకోవడానికి. పనిచేసే వాళ్ళకే స్థానం' అంటూ ఆ ప్రతిపాదనను నిర్ద్వంద్వంగా తిరస్కరించారు. విలువల ఆచరణలో చిన్నపాటి భంగం ఏర్పడినా ఆ ప్రయత్నాన్ని ఆయన నిలువరించకుండా ఉండలేరు. ఆ ప్రయత్నంలో అవతలివారు ఎంతటి సన్నిహితులయినా ఆయన మొహమాటపడరు.

హక్కుల కార్యకర్తలుగా మనం ఆయన దగ్గరనుంచి స్వీకరించాల్సిన లక్షణాలెన్నో ఉన్నాయి. నిబద్ధత, ధైర్యం, తెగువ, నమ్మిన విలువలకి అనుగుణమైన ఆచరణ వంటి అంశాలెన్నో. వీటన్నిటినీ సూచించే ఘటనలెన్నో పరంపరగా కళ్ళముందు కదలాడుతున్నాయి.

బూటకపు ఎన్‌కౌంటర్లపై విచారణ జరపడానికి జస్టిస్ రంగనాథ్ మిశ్రా కమిషన్ ఒకసారి నల్గొండకు వచ్చింది. 1993 అనుకుంటా. జిల్లాపరిషత్ గెస్ట్‌హౌస్‌లో కమిషన్ విడిది చేసింది. బాధిత కుటుంబాలను కమిషన్ ముందు ప్రవేశపెట్టడానికి బాలగోపాల్, కన్నబిరాన్ కూడా హాజరయ్యారు. అప్పటికే పెద్ద సంఖ్యలో ఉన్న సాయుధ మఫ్టీ పోలీసులూ, నక్సలైట్ బాధిత కుటుంబాల వారూ బాలగోపాల్‌పై రాళ్ళ దాడికి దిగారు. బాలగోపాల్‌తో సహా కొందరు హక్కుల కార్యకర్తల చొక్కాలను చింపేసారు. అందరం నిస్సహాయంగా అక్కడ నుంచి నిష్క్రమించాం. బాలగోపాల్ ఒక్కరే కొద్ది విరామం తర్వాత వెనక్కి వెళ్ళి విచారణలో పాల్గొని బైట జరిగిన ఘటనను కమిషన్ దృష్టికి తీసుకువెళ్ళారు. మర్నాడు వరంగల్‌లో జరిగిన విచారణలో సైతం పాల్గొన్నారు. దాడి జరిగిందన్న కారణంతో తాను చేయాల్సిన పనిని మానుకోలేదు. శరీరానికో, ప్రాణానికో హాని చేయగల ప్రమాదకర పరిస్థితులను కూడా లెక్కచేయని మొండి ధైర్యం ఆయనది.

## విశాల దృష్టి

నయీమ్ అనుచరులు ఎపిసిఎల్‌సి నల్గొండ జిల్లా కార్యదర్శి ఆజం ఆలీని ఫిబ్రవరి 18, 2001 నాడు నడిబజారులో పట్టపగలు హత్య చేశారు. మేముగానీ, ఎపిసిఎల్‌సి సభ్యులుగానీ ఎవ్వరమూ హత్యాస్థలానికి పోయే సాహసం చేయలేకపోయాం. కానీ వార్త తెలిసిన వెంటనే హైదరాబాద్ నుంచి కోర్టుపని మానుకుని బాలగోపాల్ హత్యాస్థలానికి చేరుకొన్నారు. ప్రభుత్వ కనుసన్నల్లో నయీం ముఠా చేస్తున్న హత్యా రాజకీయాలను ఖండించారు. ఇక్కడ ధైర్యాన్నే కాదు మనం చూడాల్సింది – తన తోటి సంఘ సభ్యుని హత్యను హక్కుల ఉద్యమంపై జరిగిన దాడిగానే చూసాడు తప్ప మరొక విధంగా చూడని విశాల దృష్టిని.

ఈ విశాల దృష్టే ఆయన హక్కుల కార్యరంగాన్ని విస్తృత పరచింది. పౌర హక్కుల సంఘం అంటేనే నక్సలైట్ సంస్థలకు అనుబంధ ప్రజాసంఘం అనే చర్చ ఒకనాడు

ప్రజల్లో నడుస్తుండేది. మా జిల్లాలో కూడా కార్యరంగం ఆ పరిధిలోనే ఉండేది. ఇదేనా మన కార్యరంగం అని నేను అనుమానంగా ప్రశ్నించినపుడు బాలగోపాల్ నాకు ఒక చక్కని సలహానిచ్చారు. గత ఆరు నెలలుగా జిల్లాలోని దినపత్రికలని తిరగేసి ప్రజలను బాధిస్తున్న సమస్యలేమిటో సేకరించమని సూచించారు. నా వెతుకులాటలో కరువూ, చేనేత కార్మికుల ఆత్మహత్యలూ ప్రధాన సమస్యలుగా నా దృష్టికి వచ్చాయి. ఆ రెండు సమస్యలపైనా బాలగోపాల్ గారి నేతృత్వంలో మేం పర్యటించి వాస్తవాలను పత్రికల ద్వారా ప్రజల ముందుంచాం. మా కొత్త పని విధానాన్ని ప్రజలు ఆమోదించారు. హక్కుల కార్యరంగాన్ని ఎంత విస్తృతం చేయవచ్చో క్రమంగా మాకు బాలగోపాల్ స్పష్టం చేశారు. ఇదే స్ఫూర్తితో మేం జిల్లాలో దళితులపైనా, స్త్రీలపైనా అమలవుతున్న హింసపై పనిచేయడం మొదలుపెట్టాం. ఉద్యమం వ్యాప్తి చెందింది. కొత్త కార్యకర్తలు వచ్చారు. 'ఫీల్డ్ ఫైరింగ్ రేంజ్' ఏర్పాటు, 'ఎఎమ్ఆర్‌పి' జలాలను హైదరాబాద్‌కు తరలించడం, సిమెంట్ కంపెనీల కాలుష్యం, ఫ్లోరైడ్ నీటి సమస్య వంటి సమస్యలపై మాతో పనిచేయించారు.

లాకప్‌లో దొంగల హక్కులు మొదలుకొని ఖైదీల, కార్మికుల, స్త్రీల, దళితుల, రైతుల, నిర్వాసితుల హక్కులనెన్నింటినో బాలగోపాల్ గుర్తించి, సమాజానికి అర్థం చేయించే ప్రయత్నాలను సాగించారు. మన వైఖరీ, ప్రయత్నాలూ ప్రజలకు అర్థంకాక వ్యతిరేకించిన సందర్భాల్లో కూడా ఆయన ఈ విషయాలపై సమాజంలో మరింత చర్చ జరగాలనీ, చర్చకు మనం తెరలేపాలనీ అనేవారు.

ఓసారి నల్గొండ జిల్లా సూర్యాపేట దురాజ్‌పల్లి గుట్టల్లో పోలీసులు ఇద్దరు దొంగల్ని కాల్చేసారు. బాలగోపాల్ సహా మా కమిటీ నిజనిర్ధారణకు వెళ్ళింది. మా నిజనిర్ధారణపై ప్రజలనుంచి వ్యతిరేకత వచ్చింది. ప్రజల భద్రతను భంగపరుస్తున్న వారినీ, బలవంతపు వసూళ్ళకూ, దౌర్జన్యాలకూ పాల్పడుతున్న వారినీ పోలీసులు చంపితే మీరెందుకు జోక్యం చేసుకుంటున్నారనే ప్రశ్న ప్రజలనుంచి వచ్చింది. నేర విచారణకు న్యాయస్థానాలుండగా పోలీసులు ఆ అధికారాన్ని తమ చేతుల్లోకి తీసుకోవడం తప్పుడు పద్ధతని బాలగోపాల్ వివరించారు. జీవించే హక్కునూ, నేర విచారణ హక్కునూ హరించడం హక్కుల ఉల్లంఘనే అవుతుందని తెలియజెప్పారు.

ఇలా ఎన్నో సందర్భాలు. ఆయన జ్ఞాపకాలు నన్ను వెన్నాడుతూనే ఉన్నాయి. ఆయనను గుర్తు చేసుకోవడమంటే ఆయననను ఆచరించడమే. ఆయనను ఆచరించడమంటే ఆ విలువలకు బద్ధులై బతకడమే.

# జాదూ కీ ఝప్పి

**కె. అనూరాధ***

**రా**జకీయ కోలాహలంతో ఎప్పుడూ సందడిగా ఉండే విజయవాడలో 1982–89 కాలంలో మా ఇల్లు చాలా వాటికి కేంద్రంగా ఉండేది. విరసం, ఎపిసిఎల్సి, ఇతర ప్రజా సంఘాల కార్యకలాపాలు జోరుగా సాగేవి. ఆ రోజుల్లో విజయవాడలో ఉంటే కనుక చాలా ప్రొద్దునే మా ఇంటికి వచ్చే అతిథి బాలగోపాల్. ఫోను కాల్స్ చేసుకోవడానికి వచ్చేవారు. మా అమ్మ పి అండ్ టి డాక్టరు కావడం వల్ల ఎస్టిడి సౌకర్యం ఉండేది. దానికి బాలగోపాల్ గారికి మాత్రమే పూర్తి అనుమతి ఉండేది. ఢిల్లీ, మద్రాసు ఇతర రాష్ట్రాల నుండి ఆయన కోసం వచ్చే మెసేజ్లు నేను తీసుకోవటమే గాక ఆయన ఇవ్వమన్న మెసేజ్లు కూడా వాళ్లకు ఇచ్చేదాన్ని. హిందీ, ఇంగ్లీషు కూడా రావడం వల్ల ఇబ్బంది లేకుండా ఈ సెక్రటేరియల్ పనులు చేసేదాన్ని. ఆయనకొచ్చిన ఫోను మెసేజ్లు అవగానే ఇంకా ఏమిటి సంగతులని అడిగేవారు. జరిగిన సంగతులతోపాటు చక్కటి 'గాసిప్'ను మేళవించి చెప్తుంటే చాలా ఆసక్తిగా వినేవారు. బోలెడన్ని జోకులు వేసి, మళ్లీ నాకు పని అప్పజెప్పి వెళ్ళేవారు.

కవి గుల్జార్ 'మేరా కుఛ్ సామాన్ తుమ్హారే పాస్ పడాహై' అంటూ స్నేహాల మధ్య గడిచిన క్షణాలు, ఊసులు, జ్ఞాపకాల సంపదను గురించి రాస్తాడు. అలాంటి ఎన్నో జ్ఞాపకాలను తడుముతుంటే... నాకు పదే పదే కలిగిన భావన – ఆయన ప్రపంచానికి మేధావి కావచ్చుగాని నాకు మాత్రం 'జాదూ కి ఝప్పి', మేజికల్ పవర్ ఉన్న అద్భుతమైన మనిషి.

బాలగోపాల్ సార్తో ముప్ఫై సంవత్సరాల అనుబంధాన్ని నాలుగు పేజీల్లో చెప్పడం అసాధ్యం. నా పెళ్లి, ఉద్యోగం, పిల్లలు, కుటుంబ విషయాలకు సంబంధించి

* మానవహక్కుల వేదిక విశాఖ జిల్లా కార్యదర్శి

తీసుకున్న అన్ని ముఖ్యమైన నిర్ణయాలపై ఆయన ముద్ర ఉంది. 1990లో నేను చిక్‌మగళూరులో ఉద్యోగంలో చేరాను. అమ్మ చనిపోయి అప్పటికి కొద్ది రోజులే అయ్యింది. అప్పుడు నేనున్న మానసిక స్థితిలో సార్ రాసిన ఉత్తరాలే నాకు ఎంతో ఊరట కలిగించేవి. కృష్ణతో నా వివాహ విషయం తెలియగానే చాలా సంతోషపడుతూ ఉత్తరం రాసారు. నేను కాకినాడలో ఉద్యోగంలో చేరాక నిజనిర్ధారణ పని మీద వచ్చిన ప్రతిసారీ కలిసి వెళ్ళేవారు. కృష్ణ ఇంట్లో పనులు పట్టించుకోడని నవ్వుతూనే కోప్పడేవారు. కృష్ణ ఉద్యోగం మానేశాక ఏదో ఒకటి చేయమని ఒక పక్క పోరుతూనే హెచ్ఆర్ఎఫ్ నాకు ఆర్థికంగా భారం కాగూడదని చూసేవారు. నాకు అక్కతో వున్న అనుబంధం వల్లగాని, చిన్నప్పటినుండీ ఆయనతో వున్న సాన్నిహిత్యం వల్ల గాని నా జీవితంలో అడుగడుగునా నేను సంతోషంగా వున్నానా లేనా అని కనిపెట్టుకునే వారు. బహుశా ఆయన చెల్లెళ్లకి కూడా అంత అదృష్టం దక్కి వుండదు.

సినిమాలంటే అంత ఆసక్తి లేదుగాని సార్‌కి తలత్ మహమూద్ పాటలంటే చాలా ఇష్టం. సమయం దొరికినప్పుడు క్యాసెట్ పెట్టుకుని వింటూ పని చేసుకునేవారు. ఎపిసిఎల్‌సిలో ఓటింగ్ జరిగి ఆయన అభిప్రాయం వీగిపోయిన రోజు తలత్ చనిపోయిన వార్త నేనే ఆయనకు చెప్పాను. ఆ క్షణంలో ఆయన తలత్ పాడిన ఈ పాటను గుర్తు చేసుకుని వుంటారు.

సబ్ కుఛ్ లుటాకే హోష్ మే ఆయే తో క్యా కియా
దిల్‌నే అగర్ చిరాగ్ జలాయే తో క్యా కియా

అంతా పోగొట్టుకున్న రోజే తలత్‌ని కూడా పోగొట్టుకోవడం ఎంత కాకతాళీయమో! నేను తలత్‌ని బాలగోపాల్‌తో తప్ప వేరేగా అసోసియేట్ చేయలేను. అదే లోతు, అంతే సున్నితత్వంతో సాగే నిర్మల గానం.

### బోధించడం ఆయన తత్వం కాదు

బాలగోపాల్ గారితో సాన్నిహిత్యం, కలిసి పనిచేయడం నన్ను ఎట్లా ప్రభావితం చేసాయో చెప్పాలనుంది. ఆయనలో నాకు చాలా భిన్నంగా, విశిష్టంగా కనిపించిన అంశం ఏమిటంటే ఎప్పుడూ ఎవరికీ Preach చేయరు. ఎపిసిఎల్‌సిలో చర్చ జరిగిన కాలంలోగాని ఆ తర్వాత హెచ్ఆర్ఎఫ్ పెట్టినప్పుడు గాని నాకు తెలిసి ఆయన ఏ ఒక్కరినీ తన పక్షం తీసుకోమని అడగలేదు. అప్పట్లో నాకు తెలిసిన విప్లవ సంఘాల్లోగాని, పార్టీల్లోగాని అది ఊహించలేని గుణం. కేడర్‌ని ఎడ్యుకేట్ చేసే పేరుతో అభిప్రాయాన్ని మలుచుకోవడం సర్వసాధారణం. కాని అందుకు పూర్తి భిన్నంగా వ్యవహరించారు బాలగోపాల్. ఆయన ఆలోచనలకున్న బలమే మా

అందరినీ ప్రభావితం చేసింది. తన ఆలోచనను తిరుగులేని ఆర్గ్యుమెంట్‌గా పెట్టడంలో ఆయనకెవరూ సాటిరారు. అదే సమయంలో ఇతర ఆర్గ్యుమెంట్స్‌ని అంతే సహనంతో వినేవారు. అప్పటివరకు ఇతర సంఘాలలో కేవలం అఫీషియల్ లైన్‌కో, పార్టీ లైన్‌కో కట్టుబడి వుండే మేధావులను చూసిన నాకు ఇది చాలా విశిష్టంగా, ఉన్నతంగా కనబడింది. అప్పటి వరకూ విప్లవ రాజకీయాలతో మమేకమై మార్కిస్టు భావాలను చాలా గట్టిగా నమ్మే స్నేహితుల మధ్య వుంటున్న నాకు బాలగోపాల్ గారు చేసిన కొన్ని సిద్ధాంతపరమైన విశ్లేషణలు ఎంతో ఆలోచింపచేసాయి. కొందరు వాటిని దాడిగా పరిగణిస్తే, కొందరు ఆయన సిద్ధాంత గందరగోళంలో పడ్డాడని భావించారు. కొందరు ఇంకా నీచానికి దిగజారి వ్యక్తిగత విమర్శలు కూడా చేసారు. సిద్ధాంతాన్ని మతంగా భావించేవారు దానిలో మార్పుని, అభివృద్ధిని ఆహ్వానించలేరనేది నాకు అర్థం అయ్యింది. విరసంలో స్త్రీ సమస్య మీద అవగాహనా పత్రం తయారు చేసినప్పుడు నేను ఎదుర్కొన్న చేదు అనుభవాలు ఆ నమ్మకాన్ని మరింత బలపరిచాయి. ఆ సందర్భంలో నన్ను మళ్ళీ ఒకసారి 'మతభ్రష్టురాలి'ని చేసినందుకు సారుకి రుణపడి వుంటాను.

బాలగోపాల్ మార్క్సిస్టా, హ్యూమనిస్టా, గాంధేయవాదా? ఆయన్ని ఏ వాదంలో ఇమడ్చాలన్న తర్జనభర్జన జరుగుతూనే వుంటుంది. He was an essential mix of everything అని నాకు అనిపిస్తుంది. A true democrat. కొత్త ఆలోచనలకు తలుపులు ఎప్పుడూ తెరిచి వుంచేవారు. తెలియని విషయాలను అడిగి తెలుసుకునేవారు. ఆయన ఎంతో జాగ్రత్తగా కాపాడుకున్న Modesty (వినమ్రత) ప్రస్తుతం అంతరించిపోతున్న విలువల్లో ఒకటి.

## ఎంత ముభావో అంత సరదామనిషి

చాలా ముభావంగా వుండే స్వభావం వల్ల ఆయన గురించి చాలా దురభిప్రాయాలు వుండేవి. ఆయనకేమీ పట్టదని, insensitive గా వుంటారని అనుకునేవారు. పని ఒత్తిడి ఉన్నప్పుడు తన గూట్లోకి వెళ్ళిపోయినా మిగతా సమయంలో ఎంతో సరదాగా వుండగలరు. ఒకసారి సార్‌తో వైజాగ్ నుండి విజయవాడ దాకా రైలు ప్రయాణం చేస్తున్నప్పుడు తన బాల్యం గురించి ఎన్నో విషయాలు చెప్పారు. దారి పొడవునా పల్లీలు, రకరకాల చిరుతిళ్ల తింటూ చాయ్‌లు తాగుతూ చెబుతూనే వున్నారు. చిరుతిళ్లు అంటే ఆయనకు ఎంతో ఇష్టం. అందుకే ఒకసారి రైలు పెట్టెలో కిందంతా పల్లీతొక్కలు కనబడితే 'అట్నుంచి ఈ బోగీలోనే వచ్చారా' అని ఆటపట్టిస్తే చాలా సరదాగా తీసుకుని నవ్వేసారు. ఎపిసిఎల్‌సి రోజుల్లో స్టేజ్ మీద విప్లవ పాటలు పాడకూడదని అనుకున్న తర్వాత విజయవాడ యూనిట్

సభ్యులం వీధినాటకాన్ని ఒక రూపంగా ఎంచుకుని ప్రచారం చేసాం. దానికి సార్ నుండి ఎంతో ప్రోత్సాహం వుండేది. తర్వాత కార్యదర్శి నివేదికలో వీధినాటకాల ప్రస్తావన లేకపోతే పోట్లాడాను. వెంటనే తప్పు ఒప్పుకుని చేర్చారు.

బాలగోపాల్ గారి రచనలతో అందరికీ పరిచయం వుంది. ఒక భిన్నమైన కోణం, హక్కుల అవగాహన ఆయన ప్రత్యేకత. ఒకసారి ఎన్‌హెచ్ఆర్‌సికి కంప్లైంట్ ఇవ్వడానికి 'స్వేచ్ఛ' పత్రికల్లోనుంచి ఎన్‌కౌంటర్ మరణాలు, లాకప్ హత్యల జాబితా తయారు చేసే పనిని నాకు అప్పగించారు. స్వేచ్ఛలన్నీ ముందు పెట్టుకుని వరుసగా జాబితా రాయడమే గాక వివరాలు తెలుసుకోవడానికి రిపోర్టులు చదవాల్సి వచ్చింది. సాధారణంగా అలాంటి రిపోర్టులు చాలా పొడిగా వుంటాయి. కాని ఎన్‌కౌంటర్‌లు, లాకప్ హత్యలు వంటి గంభీరమైన సంఘటనల్లో దాగివున్న అనేక సున్నితమైన అంశాలను భావోద్వేగంతో రిపోర్టు చేయడం ఒక్క బాలగోపాల్‌గారికే సాధ్యమైంది. అవి ఏ కవిత్వానికీ తీసిపోవు. జరిగిన అన్యాయం మాటున ఉన్న విషాదాన్ని, ఆ వ్యక్తుల జీవితాలను సామాజిక కోణంలో చూస్తారు. అవి కేవలం రిపోర్టులు మాత్రమే కావు. చారిత్రిక కథనాలు. బహుశా ఆ పని నాకు అప్పజెప్పకపోతే నేనా డిస్కవరీ చేసేదాన్నే కాదు.

ఆయన రాసిన ప్రతి రచన ఒక బలమైన నిరసనగా, అట్టడుగు ప్రజల గొంతుగా వెలువడినదే. మెరుగైన ప్రత్యామ్నాయ సమాజం కోసం, ఉన్నతమైన విలువల కోసం రాసినవే అన్నీ. ఆయనను నిరంతరం ఏదో ఒక పనే నడిపిస్తూ ఉంటుంది. గత పదేళ్లుగా ఆయన రొటీన్ చూస్తే భయం వేసేది. ఒక పక్క న్యాయవాద వృత్తి, ఇంకొక పక్క హెచ్ఆర్ఎఫ్ పనిమీద ప్రతి శనాదివారాలు రాష్ట్రంలో తిరగడం, వాటితోపాటు ప్రభాత చదువు బాధ్యత. ఫోనులో కూడా రెండు నిమిషాలు సావకాశంగా మాట్లాడే అవకాశం దొరికేది కాదు. చివరికి నిద్రను కూడా జయించారు. శరీరాన్ని ఒక యంత్రం కింద మార్చారు. సమయం విలువ తెలియడంతోపాటు చాలా క్రమశిక్షణ ఉంటే తప్ప అది సాధ్యం కాదు.

## నిజాయతీ లేమికి బాధపడేవారు

మనుషుల ప్రవర్తన పట్ల ఆయనకు చాలా ప్రత్యేకమైన అబ్జర్వేషన్ ఉండేది. నిజాయితీ లేని వారి పట్ల చాలా చిన్నచూపు వుండేది. ఒకసారి నాకు రాసిన ఉత్తరంలో ఆ విషయం రాశారు కూడా. 'పనికి నేను భయపడను. ఎంత పనైనా చేయగలను కాని మనుషుల dishonesty అంటేనే నాకు భయమేస్తుంది' అని రాసారు. ముఖ్యంగా వామపక్ష రాజకీయాల్లో వుంటూ, మెరుగైన సమాజాన్ని, విలువల్ని ఆకాంక్షించేవారు నిజాయితీగా లేకపోవడాన్ని ఆయన సహించలేకపోయేవారు. మనుషుల్లోని 'చీకటి కోణాల' ప్రస్తావన అలాగే వచ్చి వుంటుంది.

వ్యక్తిగతంగా ఆయనపై వచ్చిన నిందారోపణలను ఆయన ఎప్పుడూ సీరియస్‌గా తీసుకోలేదు. ఆయన సిద్ధాంతపరంగా ప్రవేశపెట్టిన ఆలోచనల పట్ల తెలుగు సమాజం రకరకాలుగా స్పందించినా సైద్ధాంతిక జవాబు అవసరమైతే తప్ప వ్యక్తిగత ఆరోపణలకు ఆయన ఎప్పుడూ జవాబు చెప్పలేదు. '1995 తర్వాత నువ్వు రాజకీయంగా పతనమైనావు' అన్నదానికి ఏమని స్పందిస్తాము? ఆచరణ ద్వారానే నిరూపించాలనేవారు. కాని ఆయన చనిపోయిన తర్వాత తెలిసిందేమిటంటే ఇలాంటి విమర్శలు చేసేవారికి సైద్ధాంతికంగా జవాబు చెప్పే ఓపిక ఎటూ లేదు, ఆయన ఆచరణను కూడా గుర్తించడం ఇష్టం ఉండదని. ఇంత జరిగినా బాలగోపాల్ సార్ ఎవరిపట్లా ద్వేషంగా, కోపంగా వున్నట్లు నాకు తెలీదు.

2004 వేసవిలో హెచ్ఆర్ఎఫ్ బృందంతో కలిసి కాశ్మీర్ వెళ్లడం నాకు అపురూపంగా మిగిలిపోతుంది. కాశ్మీర్ సమస్యపట్ల సార్ పరిశీలన, అవగాహన వల్లనేమో అక్కడికి వెళ్లగానే ఆయన కాశ్మీరీగా మారిపోయారు. అక్కడివాళ్లు కూడా ఆయనను తమవాడిగా, మిత్రునిగా భావించారు. ప్రకృతి సౌందర్యంతోపాటు ఆ లోయని కమ్ముకున్న విషాదాన్ని మాకు పరిచయం చేసారు. పీర్ పంజల్ పర్వతాలు, వాటిమధ్య ప్రవహించే చీనాబ్, గొర్రెల మందతో వలసపోతున్న గుజ్జర్లు, ప్రతి ఇంట్లో చనిపోయిన మిలిటెంట్ల ఫోటోలు, నిత్యం నిశ్శబ్దంగా జరుగుతున్న యుద్ధం... ఇవన్నీ మాకు చూపెట్టారు. ఒక రోజు సరదాగా 'గుజ్జర్లకీ మీకు పెద్దగా తేడాలేదు, ఎక్కడో మీకూ వాళ్లకీ చుట్టరికం వుందని' ఏడిపించాను. ఇప్పుడనిపిస్తుంది ఆయనకు గుజ్జర్లతోనే కాదు, ఏజెన్సీలో ఆదివాసులతోనూ, నోరులేని దీనావస్థలో వున్న ప్రతివారితోనూ చాలా దగ్గర చుట్టరికం వుంది.

చుట్టరికాలు, బంధాలు అన్నీ తెంచుకుని, వచ్చిన పని అయిపోయినట్టు హడావిడిగా 'ఏ మెరే దిల్ కహా ఔర్ చల్' అంటూ చెప్పాపెట్టకుండా వెళ్లిపోయారు. తలత్ పాడినట్లు –

చార్ ఆంసూ కోయీ రో దియా
ఫేర్ కే మూ కోయీ చల్ దియా
లుట్ రహా థా కిసీకా జహాన్
దేఖతీ రహ్‌గయీ యే జమీన్
చుప్ రహా బేరెహం ఆస్మాన్

ఆ రోజు భూమీ, ఆకాశం నిర్దాక్షిణ్యంగా మౌనం వహించాయి. అందరూ నాలుగు కన్నీళ్లు కార్చి వెళ్లిపోతున్నారేంటి? ఎవరూ సార్‌ని తిరిగి తీసుకురారేంటి అని అక్క ఎదురు చూస్తూనే వుంది. ఇదంతా కేవలం ఒక పీడకల మాత్రమేనని ఆశతో

వుంది. నేనూ అలాగే అనుకున్నాను. వెనక్కి తిరిగి చూస్తే పది సంవత్సరాల నిరంతర శ్రమ, తపస్సు మధ్య బాలగోపాల్ కనపడ్డారు. వ్యక్తిగత విమర్శల మధ్య, దాడుల మధ్య పట్టుదలగా నిలబడి స్వతంత్రమైన హక్కుల ఉద్యమానికి పూనుకున్న సారు కనబడ్డారు. ఆయన అనుకున్నది సాధించారు. ఆ ప్రయత్నంలో ఆయనతో కలిసి నడిచినందుకు నా జీవితాంతం గర్వపడతాను. ఆ పనిలో వుంటేనే ఆయన చెయ్యి ఎప్పుడూ నా తల మీద వున్నట్టు అనిపిస్తుంది.

# ఒక్కసారి కూడా పొగడలేకపోయాను

**వేణుగోపాల్***

**బా**లగోపాల్. ఆయన మరణం కాకుండా ఇంకేదైనా జరిగుంటే బాగుండేది. అదేదైనా. అలాంటి వ్యక్తాయన. దేశంలో ఎంతమందికి ఎన్ని జ్ఞాపకాలో ఆయన్తో...

"మిమ్మల్ని కొన్నడగాల".

"నువ్వడగందెప్పుడు?"

"ఇన్నేళ్ళుగా ఈ ఉద్యమంలో పనిచేస్తున్నారు, ఎప్పుడన్నా మొనాటస్‌గా అనిపించిందా?"

"మొనాటస్ కాదు; మొనాటనస్."

"అదే లెండి."

"ప్రభుత్వాలు ఎప్పటికప్పుడు కొత్త సమస్యల్ని తెస్తూ వున్నప్పుడు వాటికి సరిపోయే విశ్లేషణలూ, ఆందోళనలూ వుంటాయి కదా; అలా అనిపించలేదు."

"ఈ సమాజాన్ని మార్చలేమని ఎప్పుడైనా అనిపించిందా?"

"మార్చగలమని అనుకుంటే కదా! కంట్రిబ్యూషన్ వుంటుంది. అంతే."

"భార్యా, పిల్లలూ, కుటుంబమూ ఇలాంటివి పెరిగి – సంపాదిద్దాం. చిన్నగా బైటకి సర్దుకుందాం అనిపించట్లేదా?"

"నాకు లేదు. నువ్వు కలిగించకు."

---

* **మానవహక్కుల వేదిక ప్రకాశం జిల్లా కన్వీనర్**

"1998లో హైదరాబాద్ హిందీ ప్రచార సభలో మనం కూర్చున్నప్పుడు 'మానవ హక్కుల వేదిక నాయకత్వ బాధ్యతలు మీరే తీసుకోండి' అని అందరూ అన్నప్పుడు – 'నేను మార్క్సిజం మీద సీరియస్‌గా డిబేట్ చేయదల్చుకున్నాను. కాబట్టి ఆ బాధ్యతల్ని ఇంకెవరైనా తీసుకోండి' అని అన్నారు కదా!

"అవును. అన్నాను"

"మరి ఎందుకని ఆ పని చేయలేకపోయారు?"

"అక్కడక్కడ చేశాను కానీ, అదే 'పని'గా చేయలేకపోయాను."

"చేస్తారా?"

"చూస్తాను"

"చివరగా ఇంకొకటి. చివరివరకూ ఈ ఉద్యమంలో వుంటారా?"

"కచ్చితంగా ఉంటాను."

చేనేత కార్మికుల ఆకలి హత్యలపై నిజనిర్థారణకు చినగంజాం వచ్చినప్పుడు బాలగోపాల్‌గారితో నేను మాట్లాడిన మాటలివి.

ఆ తర్వాత 2009 అక్టోబర్లో, అనంతపూర్లో, "ఈ చెప్పులు వేసుకోకపోతే వొచ్చే నష్టం ఏమన్నా వుందా? ఆ పాదాలేంటీ, ఆ వేళ్ళేంటీ, ఆ పుళ్ళేంటీ?" అని అడిగా – ముప్పాతిక అరిగి విరిగిన తన చెప్పుల్ని చూసి.

ఎప్పుడూ చెప్పే కథలే చెప్పబోతూంటే – ఇద్దరు చెరొక చెయ్యినీ, నేనేమో వెనక వీపునీ పట్టుకొని నెట్టుకొని వెళ్లి కొత్త చెప్పుల్ని కొనిపెట్టి వేయించాం.

సరిగ్గా పదిహేడేళ్ల క్రితం. ఇలాంటిదే ఒంగోల్లో ఇంకో గతం... అప్పుడు పౌరహక్కుల సంఘంలో వున్నాం. చొక్కా చంక భాగంలో చిరిగింది. ఉపన్యాసం కోసం స్టేజి మీదకు ఎక్కుతూవుంటే అది అందరికీ కనపడుతూ వుంది. దానిమీద కొందరు మాట్లాడుకోవడం విన్న నేను కిందికొచ్చాక 'చొక్కా కొందాం' రండన్నాను. 'వద్దు' అన్నారాయన. అంతగా చనువులేని నేను అంతకుమించి మాటల్ని పెంచలేదు.

నామీద ఎన్ని జోకులేశేవారో! 'నిన్ను నువ్వు తప్పితే ఎవ్వరూ మేధావనుకోరు.' 'నీకు షోకులు పెరిగాయి'. మే నెల్లో కార్లో నేను ఏ.సీ వేస్తాను. 'ఎండంటే కొందరికి భయం. భయం. పసిపిల్లలు వారికన్నా నయం. నయం' అంటూ ఆయన చిన్నగా డోరు గ్లాసు దించేవారు. కరువు మీద మార్కాపురంలో తిరుగుతున్నపుడు నేను బిస్లరీ వాటర్ బాటిళ్ళు కొంటున్నానని 'సంస్థలోనించి నిన్ను బహిష్కరించే శక్తి నాకా దేవుడు ఇవ్వాలని కోరతాన'న్నారు. ఆ మాట గుర్తొచ్చినప్పుడల్లా నాకు ఎంత నవ్వో. (మొత్తానికి

అది మానిపించి నాచేత కొళాయి నీళ్ళు తాగించి నాలో రెసిస్టెన్స్ పవర్‌ని పెంచిన బాలగోపాల్ గారికి కృతజ్ఞతలు.)

## కోరికలకు అతీతుడు

ఆదర్శాలను చెప్పడం వేరు. ఆదర్శంగా వుండడం వేరు. బాలగోపాల్ రెండవ రకం. ఒక వ్యక్తి తన గురించి 'స్వల్పం'గా వుంటూ ఇతర్ల (సమాజం) గురించి 'మొత్తం'గా ఎలా వుండగలడు? అలా వుండిన వ్యక్తే బాలగోపాల్. అందుకే ఆయన ఒక ఆదర్శం. రచించడం, ఉపన్యసించడం, ఆలోచించడం అనే 'కళ' గురించి కాదు; ఆయన సింప్లిసిటీ, ఆయన కమిట్‌మెంట్. ఇంకా చెప్పాలంటే – ఇంటా, బైటా, సంస్థ లోపలా, వెలుపలా, తనలో తనూ, ఇతర్లతోనూ ఇలా అన్నిటా ఒక్కలా వుండే అతని వ్యక్తిత్వం గొప్పది.

ఆయన మేధావే. చాలామందితో పోల్చడానికి వీల్లేని మేధావే. కానీ ఆయన మీద అభిమానం అందుక్కాదు. ఇరవై ఏళ్ళుగా ఎరుగుదును. ఈ దుప్పటి కావాలి. ఈ దిండు కావాలి. ఈ తిండి కావాలి… అని ఎన్నడైనా అడిగాడా? చలీ, గాలీ, ఎండా, వానా ఇలాంటి ప్రకృతి సమస్యలు ఆ శరీరాన్ని ఏమైనా తాకుతాయా? జాగ్రత్తలు పాటించమని చెబుతాయా?

డబ్బుకు లొంగని వాళ్ళు కూడా ఇప్పుడు మీడియాకు లొంగుతున్నారు. మీడియా పాడు చెయ్యనివాడు బాలగోపాల్.

నక్సలైట్లకూ, ప్రభుత్వానికీ మధ్య చర్యలు జరుగుతూవున్న కాలంలో మొట్టమొదటి ఎన్‌కౌంటర్ మా జిల్లాలోనే జరిగింది. అప్పుడు యస్పీ మహేష్‌చంద్ర లడ్డా, చనిపోయిన వ్యక్తి లక్ష్మి. అలియాస్ గుర్తులేదు. కొండలెక్కుతూ వున్నాం. ఫోటోకు పోజు ఇవ్వమని బాలగోపాల్‌ను మీడియా వాళ్ళు అడిగారు. 'మా పని మేము చేస్తూ పోతాం. మీ పని మీరు చేస్తూ పోండి. మీరు కవరేజ్ ఇవ్వకపోయినా పర్వాలేదు. ఇలా మాత్రం అడగొద్దు అని మొఖం మీదే చెప్పారు. ప్రెస్‌మీట్ అప్పుడు కూడా అంతే. ఉన్న సమయాన్ని ఎక్కువ ప్రాంతాలు తిరగడానికి కేటాయిస్తాడే తప్ప ప్రెస్ కవరేజ్ కోసం కేటాయించడు.

నా వ్యాసం చూశారా, నా పుస్తకాన్ని చదివారా, నా ఇంటర్వ్యూ చూశారా? అనే మాటల్ని ఆ నోటినుంచి ఎన్నడైనా విన్నామా? 'మిమ్మల్ని అరెస్ట్ చేశారటగా? జైల్లో పెట్టారట కదా!' అని ఒకసారి అడిగితే జవాబు చెప్పడానికి ఎంత బిడియపడ్డాడో! అంటే 'స్వంతం' అనే దానికి అంతగా ప్రాధాన్యం ఇవ్వడు అని చెప్పడానికే ఇదంతా.

మద్దిపాడు మండలంలో 'గేరా కిషోర్' అనే రౌడీషీటర్‌ని పోలీసులు కాల్చి చంపారు. హైకోర్టులో 'రిట్ పిటీషన్'ని బాలగోపాల్ వెయ్యాలి. వాళ్ళు వెయ్యి రూపాయలు ఇచ్చారు. దాంట్లోనించి అయిదు వందలు ఈయన తిరిగిచ్చాడు. అయిదువేలు, పదివేలు, పాతిక వేలు, లక్ష దాకా రిట్‌కు తీసుకునే ఈ రోజుల్లో ఆయన ఫీజు అయిదు వందలు. 'ప్రామిసరీ నోటొకటి వుంది వేస్తారా? అని ఒకాయన అడిగితే – 'అలాంటి కేసులు నేను చెయ్యన'ని ఖచ్చితంగా చెప్పాడు.

## 'ఇందిరయినా సరే చీదరగా మాట్లాడొద్దు'

గేరా కిషోరంటే గుర్తొచ్చింది – పోలీసుల మీద కేసు హైకోర్టులో జరుగుతూ వుంది. ఇంతలో ఈ కేసు వేసిన వాళ్ళని పోలీసులు బెదరగొట్టో, ఆశపెట్టో లొంగదీసుకొని జిల్లా కోర్టులో జడ్జిముందు 164 స్టేట్‌మెంట్ ఇప్పించారు. అంతేగాకుండా వాళ్ళచేత తిరిగి మామీదే తప్పుడు కంప్లయింట్ యిప్పించడానికి ప్రయత్నాలు చేస్తూవున్నారు. ఆ విషయాన్ని బాలగోపాల్‌గారితో అన్నాను.

జనరల్‌గా బాధితులెవరైనా ఇలా చేసిన సందర్భాల్లో వెంటనే 'ఈ కులం వాళ్ళు ఇంతే' అంటారు. సాధారణ వ్యక్తులే కాదు; పెద్ద పెద్ద అభ్యుదయవాదులనే వాళ్ళు కూడా అలానే అంటారు. కానీ ఆయన ఎప్పుడూ అలా అనలేదు. నవ్వి వూరుకుంటారు. మహా అయితే – 'మళ్ళీ ఒకసారి వాళ్ళతో మాట్లాడి చూడక పోయావా?' అంటారు అంతే.

దళితులపట్ల, మహిళలపట్ల సంస్కారవంతమైన భావాలు ఎన్నో నేర్చుకోవచ్చు ఆయన దగ్గర. 'నువ్వు బ్రాహ్మణుడివి' అంటూ ఆయన కులాన్ని ఆంధ్రా మేధావులు ఎన్నోసార్లు గుర్తుకు తెచ్చి విమర్శలు చేసినా కోపగించని వ్యక్తి బాలగోపాల్. ఆడవాళ్ళను... ఇందిరాగాంధి లాంటి ఆడవాళ్ళనైనాసరే 'అది' 'దాన్ని' అనే మాటలు అనడాన్ని వ్యతిరేకించాడాయన. సింగరాయకొండ మండలంలో వరదలు వచ్చి దేన్నీ మిగల్చకుండా తీసుకుపోయినప్పుడు – 'ప్రకృతి వైఫల్యమెంత? మానవ వైఫల్యమెంత?' అనే విచారణ కోసం వచ్చినప్పుడనుకుంటాను ఈ మాట అనింది. "ఆమె పవర్‌ని మిస్‌యూజ్ చేయొచ్చు, నియంత కావచ్చు. ఆ సందర్భాలు వేరు. దాంట్లో పురుషులెంతో ఆమె కూడా అంతే. కానీ 'అదీ, ఇదీ, దాన్నీ' అనే మాటల వెనక వున్న అర్థం వేరు. కాబట్టి మనం యూజ్ చేయకూడదు" అన్నారాయన.

కొన్ని విషయాల్లో చాలా ఖరాఖండిగా వుంటారు ఆయన. 'చిలకలూరిపేట బస్సు దహనం కేసు' అందరికీ గుర్తే వుంటుంది. ఒంగోల్లో మీటింగ్ పెట్టాం. స్పీకర్లుగా చంద్రశేఖర్, బాలగోపాల్. మీటింగ్ జరుగుతూ వుంది. కోపంతో కొంతమంది ఊగిపోతూ వున్నారు. మధ్యలో ఒకాయన 'ఆ బస్సులో మీ బంధువులెవరైనా వుండి

చస్తే, అప్పుడు కూడా ఇలాగే మాట్లాడతారా?' అని తన కోపాన్ని వెళ్లకక్కాడు. 'బంధువులే కాదు మా ఇంట్లో వాళ్ళు వున్నా ఇలాగే మాట్లాడతానం'టూ తటపటాయింపు లేకుండా జవాబిచ్చారాయన.

తంబళ్లపల్లి సంఘటనలో మావోయిస్టుల చేతిలో మైనర్లు చనిపోయారు. అప్పటి ప్రకాశం యస్పీ బాలసుబ్రహ్మణ్యం 'మావోయిస్టులు చిన్నపిల్లల్ని కూడా చంపేస్తున్నారు. మీరు రారా? మాట్లాడరా?' అని ఫోన్ చేసి మరీ బాలగోపాల్ గారిని పిలిచారు. ఆయన పిలుపుతో పనిలేకుండానే మేము వెళ్ళాలనుకున్నాం. వెళ్ళాం, విచారిస్తున్నాం. అప్పటికే పోలీసులు ఒకరిద్దరు మల్లయోధుల్ని మా మీదకు పోట్లాటకు సిద్ధం చేసినట్లున్నారు. వాళ్లు పైపైకి దూకుతున్నారు. నేను రెక్క పట్టుకొని బాలగోపాల్‌ని పక్కకు లాగాను. ఆయన నన్ను వారించారు. 'వాళ్లు చెయ్యొచ్చు, లేదా చేయించవచ్చు. మనకు సహనం ఉండాలి. తెలంగాణలో ఇవన్నీ మామూలే. మీకు కొత్త. బల ప్రదర్శన మన పని కాదు', అని చెప్పారు.

ఇంకేదో అనబోతుంటే – "ఈ విషయంలో నువ్వూ జయశ్రీ ఇద్దరూ ఒకటే. రాజ్యం శక్తి సామర్థ్యాలతో సంబంధం లేకుండా సమాంతరంగా తలబడాలంటారు" అని నవ్వుతూ చురకేశారు. కలెక్టర్ కృష్ణబాబుమీద కరపత్రం వేసినప్పుడు కూడా ఇలానే అన్నారనుకుంటాను.

కేసులూ, స్టేషన్లూ, జైళ్ళూ, శిక్షలూ... వీటిని ఆయన ఎప్పుడూ పెద్దగా పట్టించుకోలేదు. ఒకసారి జయలలిత విషయంలో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు మీద ఒక వ్యాసం రాసి పత్రికకు పంపించాను. 'లీగల్ సమస్య రావచ్చు వెయ్యలేం' అన్నారు. అది నా దగ్గరే వుంది. తర్వాత 'యస్పై లక్ష్మణ్‌ని నేనేదో కులం పేరుతో దూషించానం'టూ అప్పటి ప్రకాశం యస్పీ మహేష్‌చంద్ర లడ్హా నాపైన తప్పుడు కేసు పెట్టారు. ఆ విషయంలో ప్రెస్‌మీట్ కొరకు బాలగోపాల్ ఒంగోలు వచ్చినపుడు ఈ వ్యాసం చూశారు. 'బాగుంది కరపత్రం వేయొచ్చు' అన్నారు. 'ఏమన్నా లీగల్ ప్రాబ్లం వస్తుందా?' అన్నాను. 'మహా అయితే ఆరు నెలలు వేస్తారు. వెయ్యనీ. నీకెటూ ఇంగ్లీషు సరిగా రాదు. అక్కడ నేర్చుకోవచ్చు' అన్నారు నవ్వుతూ.

లాకప్ డెత్. డౌరీ డెత్. హంగర్ డెత్. ఎన్‌కౌంటర్. దళితుల హత్యలు. వరదలు, తుఫానులు, కరువులు, మిస్సింగులు విస్థాపనలు. కోస్తా కారిడార్లు. ఇలా ఎన్నిటికో వచ్చారు. మా జిల్లాలో వారికి తెలియని ప్రాంతమూ లేదు. తెలియని సమస్యా లేదు. మేము హక్కుల అవగాహనను నేర్చుకున్నదీ, పెంచుకున్నదీ ఆయన సహచర్యంవల్లే.

'బాలమిత్ర కథలు చెబుతున్న బాలగోపాల్' అంటూ గతంలో జనపథంలో ఒకసారి నేను వ్యాసం రాశాను. 'రాజకీయ ఖైదీలను బేషరతుగా విడుదల చేయాలి'

అనే డిమాండ్‌ను హక్కుల సంఘాలుగా మనం పెట్టకూడదు' అనేది బాలగోపాల్ వాదం. 'పెట్టొచ్చు' అనే వాదంతో ఏకీభవిస్తూ నేను రాశాను. ఆ అభిప్రాయం ఇప్పుడు నాకు లేదు. ఈ విషయం చెప్పడానికి ఆయన లేరు. ఉన్నప్పుడు చెప్పలేకపోయా.

'ఉద్యమాల హింస' మీద చాలా చర్చ జరిగింది. మంచి మంచి వాదాలెన్నిటినో చేశారాయన. కానీ 'మార్క్సిజంలో ఖాళీలు' అన్నారు కాబట్టి ఇక ఆయన ఏది చెప్పినా 'ఖాళీ'నే అనుకున్నాను. ఇలా ఏడ్చాయి నా తెలివితేటలు.

'అటా ఇటా' అనేదానిమీద గుంటూరులో ఓటింగ్ జరిగింది. 'మూడో అభిప్రాయం కూడా వుండవచ్చు' అంటూ నేనో వ్యాసం రాశా. (ఇంకెవరెవరు రాశారో నాకు తెలియదు) అప్పుడు బ్యాలెట్లో మూడో కాలమ్‌ని బాలగోపాల్‌గారు చేర్చారు. కొన్ని ఓట్లు దానికీ పడ్డాయి. 'ఆయన డెమొక్రాటిక్‌గా వుంటారు' అని చెప్పడానికి ఇది గుర్తు చేస్తున్నాను.

స్టాలిన్, సద్దాం, ప్రభాకరన్, పోల్‌పాట్ ఇలాంటి వాళ్ళ అప్రజాస్వామిక ధోరణులపై వ్యాఖ్యానాలను బాలగోపాల్ వ్యాసాల్లోనే చూస్తాం. మార్క్సిస్టు సాహిత్యంలో ఇవి దొరకవు. (దీనికి రంగనాయకమ్మగారు మినహాయింపు.) బాలగోపాల్ వ్యాసాల్లో కూడా హక్కుల కార్యకర్తగా బాగా ఎదిగిన తర్వాతే చూస్తాం. ఒంగోల్లో ఒక సమావేశంలో అనుకొంటాను – "ఒక మహాసభ జరిగి మళ్ళీ ఇంకో మహాసభ వచ్చేనాటికి మొదటి మహాసభ నాయకులెవ్వరూ వుండేవారు కారు" అని స్టాలిన్ గురించి వ్యాఖ్యానించారు. బోల్షివిక్ పార్టీలోని ప్రథమశ్రేణి నాయకుల్ని స్టాలిన్ చంపించారు కదా! దాని గురించన్నమాట ఈ కామెంటు. అధికారం కోసం అల్లుళ్ళను కూడా చంపిన సద్దాం హుస్సేన్ గురించి, తనకు ప్రత్యామ్నాయంగా ఎవ్వర్నీ ఎదగనివ్వని వేలుపిళ్ళై ప్రభాకరన్ గురించి కూడా ప్రజాస్వామిక వ్యాఖ్యలు చేయడం హక్కుల అవగాహనా విస్తృతిలో భాగంగానే బాలగోపాల్‌కి సాధ్యపడిందనడంలో అతిశయోక్తి వుండకపోవచ్చు.

పౌరహక్కుల సంఘంలో దీర్ఘకాలిక కార్యదర్శిగా ఉన్నాడు కాని మానవ హక్కుల వేదిక కాలం నాటికి ప్రారంభంలోనూ ఆయన కార్యదర్శిగా లేరు. చనిపోయే నాటికీ లేరు. నాయకత్వ పోజులు వెలగబెట్టని గొప్ప నాయకుడాయన. తనను తానెప్పుడూ సగటు కార్యకర్తగానే భావించాడు. ఆచరించాడు.

ఒకసారి అద్దంకిలో మీటింగు జరుగుతూ ఉంది. (మా జిల్లాలో నాకు తెలిసి ఆయన ఆలస్యంగా వచ్చిన మొదటి, చివరి మీటింగు అదే కావచ్చు.) మధ్యలో వచ్చారాయన. చాలామందిమి ఏం భావిస్తామంటే – 'మనల్ని స్టేజీ మీదకు ఘనంగా పిలవాలి! హర్షధ్వానాలు వినబడాలి' అని. వేదిక మీద వున్న అధ్యక్షుడు తను రావడం

చూసి మధ్యలో ఉపన్యాసం ఎక్కడ ఆపుతాడోనని మెరుపు వేగంతో వేదిక ఎక్కి కూర్చున్నారాయన. అయినా అధ్యక్షులవారు తన సాంప్రదాయాన్ని తాను పాటించారనుకోండి. అది వేరే విషయం.

## అనారోగ్య'శ్రీ'లకు దూరం

తిరోగామి శక్తులనుంచి దేశాన్నీ, కమ్యూనిస్టు పార్టీని రక్షించుకోవడానికి 'మావో వ్యక్తి పూజ' జరిగిందని ఆయన ఒకనాడు సమర్థించినా తర్వాత విమర్శించారు. తన విషయంలో అలాంటివి ఎన్నడూ కోరుకోలేదాయన. అన్ని రకాల పూజల నుంచి దూరంగా ఉండడానికి కూడా ప్రయత్నించాడు. తన పేరుకు ముందు 'డాక్టరు' పెట్టవద్దని చెప్పేవారు. 'శ్రీ' కూడా వాడవద్దని చెప్పారు. తన సంచి తనే మోసుకొనేవాడు. పుస్తకాల్ని అమ్మాడు. బ్యానర్లు కట్టాడు. వాల్‌పోస్టర్లు అంటించాడు. తన విజువల్స్ టి.విలో చూసుకోవడానికి సిగ్గుపడేవాడు. మనం చెబితే ఒక క్షణం అలా చూసి వెళ్ళిపోయేవాడు. వ్యక్తి పూజలో ఒక భాగం ముఠాను తయారు చేసుకోవడం. ఆ ముఠా చేత భజన చేయించుకోవడం. బుద్ధివుంటే బాలగోపాల్ ముఠా తయారవుద్దా? పలకరింపు చేతనవునా అతనికి? ఈ భూ మండలంలో అతనితో ఫోన్లో ఎవరైనా అరవై సెకన్లు మాట్లాడినవారు వున్నారా? 'మీ వ్యాసం బాగుందనో మీ ఉపన్యాసం బాగుందనో' బిడియపడకుండా ఎవరైనా ఏనాడైనా చెప్పారా? పోనీ మనం చెబుతుంటే బిడియపడకుండా ఒక్క ఘడియ ఆయన ఏనాడైనా ఆలకించాడా? 'ఇది అద్భుతంగా వుంది ఎలా సాధ్యపడింది?' అని గానీ, 'ఇంత సింపుల్‌గా ఎలా వుండగలుగుతారు?' అని గానీ, 'ఈ రోజు ఈ ఉపన్యాసం బాగుంది. చాలామంది ఇంప్రెస్ అయ్యారు' అని గానీ ఇంకా అలాంటి ఏదో ఒక పొగడ్త చెయ్యడం ఈ ఇరవై యేళ్ళలో ఒక్కసారికూడా నాకు సాధ్యపడలేదు. అంటే ఆ అవకాశం ఇవ్వరాయన. కాని విమర్శించిన సందర్భాలు చాలా వున్నాయి. 'మీతో నేను ఏకీభవించలేక పోతున్నాను' అని మనం అంటే 'మంచి ఫీలింగే' అంటాడు.

'శంకరాభరణం' సినిమా మీద ఇంగ్లీషు పత్రికలో వ్యాసం రాశారని ఆయన వ్యాసాల సేకరణలో భాగంగా ఎవరో చెబితే వసంతలక్ష్మి గారికి మొన్న తెలిసిందట. రాసిందే తడవు ఎవరెవరు పొగుడుతారా? అని ఎదురు చూసే లోకానికి బాలగోపాల్ ఎంత దూరం!

ఆయన రాసిన పుస్తకాలను ఆయన సంచిలో చూడం. సంస్థ పుస్తకాలే కనబడతాయి ఎప్పుడూ. 'ప్రాచీన భారతదేశ చరిత్ర' ఆయన సంచిలో చూశాను ఈ మధ్య ఒకసారి. నేను దాన్ని చూడడం గమనించి 'నెల్లూరు సుబ్రహ్మణ్యం (లేదా

సాంబశివరావో) వసంత నడిగాడట. తనకివ్వమని వసంత నాకిచ్చింది' అని ఇబ్బంది పడిపోతూ చెప్పాడు. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే 'స్వంతం' అనే దానికి ఎంత దూరంగా వుంటారో చెప్పడానికే. అలాంటి వ్యక్తికి వ్యక్తిపూజ వుంటుందా?

ఆర్భాటం లేని జీవితం, ప్రజాస్వామిక ప్రవర్తన అటుంచి గోరంతల్ని కొండంతలు చేయకపోవడం, ఎదుటివారికి ఇబ్బందిలేకుండా జీవించడం అనేది కూడా చిన్న విషయం కాదు.

ఆయన మరణించిన తర్వాత వారింట్లో ఒక సమావేశం జరిగింది. ఆయన గురించి అనేక విషయాలు చర్చకు వచ్చాయి. కొన్ని విషయాల గురించి విస్తుపోతూ 'ఆయన మార్క్సిస్టు అయ్యాక ఇలా అయ్యారా లేక అంతకు ముందే అలా వున్నారా?' అని బాలగోపాల్ చెల్లెలు మాధవిగార్ని అడిగాను. 'లేదు వాడు చిన్నప్పటినుంచీ అంతే' అని ఆమె అన్నారు.

ఇంకా ఎన్నో, ఎన్నెన్నో గుర్తుకొస్తున్నాయి. అన్నీ ఒకేసారి రాయలేను. ముగిస్తాను. ముగించే ముందు ఒక్కటి చెప్పి ముగిస్తాను. బాలగోపాల్ అంతిమ యాత్రలో నడుస్తున్నాం. చాలామంది ఏడుస్తున్నారు. సుధగారు కూడా ఏడుస్తున్నారు. 'వూరుకోండి' అన్నాను. 'ఏంటి వూరుకొనేది? ఈ మనిషి బ్రతికున్నడెప్పుడూ నాకు కోపం రాలేదు. ఇప్పుడు మాత్రం తిట్టాలనిపిస్తోంది. మనం వుంటే ఎంత, పోతే ఎంత? ఆయన ప్రాణం అలాంటిదా?' అన్నారు. 'ఆయన  ఆయన గురించి తప్పితే అందరి గురించీ ఆలోచించాడు' అని ఇంకో మిత్రుడన్నాడు. వీటన్నిటికన్నా – 'ఆయనింటికి ఆటోవాడొచ్చినా, ప్రధానమంత్రి వచ్చినా ఒక్కలాగే వుంటాడ'ని ఒక మీడియా మిత్రుడన్నాడు. 'అందరికీ ఒకే విలువ' కోసం జీవితాంతం తపించిన బాలగోపాల్ గురించే ఇదంతా.

# మన కర్తవ్యం కొత్త పుంతలు తొక్కించడమే

కె. మురళి*

ప్రధాన స్రవంతి రాజకీయాలలో ప్రజాతంత్ర విలువల విధ్వంసం విస్తృతంగా జరుగుతున్న కాలంలో ప్రజా జీవితంలో ప్రజాతంత్ర విలువలు పెంపొందించడానికి తీవ్రమైన కృషి చేశారు బాలగోపాల్. తాను నమ్మిన విలువలను ఎంత వ్యతిరేక పరిస్థితులలోనైనా బహిరంగంగా చెప్పడానికి వెనుకాడలేదు. సామాజిక రాజకీయ జీవితంలో ఏ అంశంపైనైనా ఒక అవగాహనను ప్రతిపాదించడానికి, అనుసరించడానికి ప్రజల సమస్యలను, వాళ్ళ కన్నీళ్ళను మాత్రమే పునాదిగా స్వీకరించారు. అమూర్తమైన భావనలకు, సిద్ధాంతాలకు కార్యరూపం ఇవ్వడానికి ఎన్నడూ ప్రయత్నించలేదు. సామాజిక వాస్తవికత తన రాజకీయ విశ్వాసాలకు భిన్నంగా వున్నప్పుడు తన అవగాహనను మార్చుకోడానికి వెరవలేదు. దాని వలన ఆయనకు అప్పటికే వున్న సామాజిక రాజకీయ గుర్తింపుకు ఎంత నష్టం కలిగే అవకాశం వున్నా సరే, తను చెప్పదల్చుకున్నది చెప్పారు. దాన్నే ఆచరించారు. పేరుకోసం, కీర్తికోసం ఎన్నడూ పనిచేయలేదు. కనుక వీటిని నిలబెట్టుకోడానికి ప్రయత్నించవలసిన అవసరమూ ఆయనకు కలగలేదు.

హక్కుల రంగంలో ఆయన దృష్టిని దాటిపోయిన అంశం లేదు. నిజానికి ఆయన దృష్టిలో పడిన తర్వాతే చాలా సామాజిక అంశాలకున్న హక్కుల కోణం చర్చకు వచ్చాయి. ఉద్యమాలుగా మారాయి. ఏ ఒక్క అంశం దగ్గరా ఆగిపోకుండా, సామాజిక జీవితంలో హక్కుల కోణం ఇమిడి వున్న అన్ని అంశాలను వెలికి తీస్తూనే వచ్చారు. సామాజిక ఆచరణలో, అవగాహనలో వీటికి ఆమోదం, సాధికారత సాధించిపెట్టే

* మానవహక్కుల వేదిక రాష్ట్ర కార్యదర్శి, హైదరాబాద్

కర్తవ్యం హక్కుల ఉద్యమానికి వుందని నమ్మారు. హక్కుల కార్యకర్తలు వినూత్నంగా ఆలోచించాలని, హక్కుల కృషిలో అది ప్రతిఫలించాలని ఆశించారు. ఈ విషయంలో ఆయనకు కొంత అసంతృప్తి వున్నట్టు అనిపించేది. ఇది చాలా కష్టతరమైన కర్తవ్యం. ఆయన మరణంతో ఇది మరింత కఠినమైన కర్తవ్యం కానుంది. ఆయన చూపిన ప్రజాతంత్ర కృషి మార్గాన్ని, అవగాహనను కొనసాగిస్తూ హక్కుల ఉద్యమాన్ని మరిన్ని కొత్తపుంతలు తొక్కించడం ఆయనకు నిజమైన నివాళి అవుతుంది.

1988లో త్రిపురనేని మధుసూదనరావు శిష్యుల ద్వారా మొదటిసారి బాలగోపాల్ గురించి విన్నాను. అప్పటికే నాగార్జున సాగర్‌లో డిగ్రీ చదువుతున్న నాకు ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ పత్రికలో వస్తున్న ఆయన రచనలు తెలుసు. సామాజిక రాజకీయ విశ్లేషణలపైన ప్రామాణిక స్థాయిలో వ్యాసాలు వచ్చే ఆ జర్నల్‌ను సామాజిక శాస్త్ర విద్యార్థులు తప్పక చదవాలనే ప్రోత్సాహం కాలేజీలో వుండేది. నక్సలైటు ఉద్యమంపై ఆయన రచనలు మాత్రం కొంత అర్థమయినట్టు అనిపించేది. కానీ ఆర్థిక శాస్త్రవేత్తల రచనలపై ఆయన స్పందనలు ఒక పట్టాన అర్థమయ్యేవి కావు. ఆయన తెలుగులో ఎక్కడ రాసినా తప్పకుండా దొరికించుకుని చదవడం, మిత్రులతోనూ, ఉపాధ్యాయులతోనూ చర్చలు చేయడం నాకొక ముఖ్యమైన కార్యక్రమంగా వుండేది.

నాగార్జున యూనివర్సిటీ లా లెక్చరర్ ఎ. సుబ్రహ్మణ్యంను యాజమాన్యం సస్పెండు చేసినపుడు దానికి వ్యతిరేకంగా 1988లో గుంటూరులో జరిగిన సభకు నేను, శ్రీనివాసబాబు (సత్తెనపల్లి), వెంకటేశు (ఎన్‌ఐఆర్‌డి), సాగర్ నుండి వచ్చామని తెలిసి సుబ్రమణ్యం ఆశ్చర్యపోయారు. ప్రధానంగా ఆ సభకు బాలగోపాల్ వస్తారని మేం వెళ్ళాం. ఎంతో వేగంగా ఆయన చేసిన ఆ ఉపన్యాసం నాకు ఎంత అర్థమయిందంటే చెప్పలేను. అయినా మా కాలేజికి ఉపన్యాసానికి రమ్మని పిలిచాము, కాలేజీ ప్రిన్సిపాల్ అనుమతి లేకుండానే. ఒక రోజు ఉదయం పదకొండు గంటలకు ఆయన వచ్చారు. తరగతులు ప్రారంభమై గంటకూడా అవకపోయినా వాటిని రద్దుచేసి ఆయన ఉపన్యాసం ఏర్పాటు చేశారు ప్రిన్సిపాల్ శ్రీనివాసరెడ్డి. ఆ తర్వాత మరి మూడుసార్లు ఆయనను ఆహ్వానించాను. ఆయన రాతలను చదువుతూ, ప్రసంగాలను వింటూ అప్పుడు నిర్ణయించుకున్నదే, హక్కుల సంఘంలో పని చేయడానికి సమయం, అవకాశం వున్న వృత్తిని ఎంచుకోవాలని.

1991లో హైదరాబాద్ యూనివర్సిటీలో చేరిన వెంటనే ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘంలో చేరాను. బాలగోపాల్ నారాయణగూడ మురికి కాలువ పక్కన వున్న గదిలో వుండేవారు. ఆ గదిలో ఏపిసియల్‌సి నగరశాఖ సమావేశాలు జరిగేవి. అక్కడ ఆయన ఎలా వుండేవారా అని ఆశ్చర్యపోయేవాణ్ణి. ఒకసారి ఆమాటే అడిగాను. పనుల మీద తిరిగి, తిరిగి అలసిపోయింతర్వాత గదికి వస్తే చక్కగా నిద్రపడుతుందని,

తనకేమీ సమస్య లేదన్నారు. ఆ తర్వాత కొన్నాళ్ళకు అర్థమయింది అలాంటివన్నీ ఆయన సమస్యలుగా ఎప్పుడు చూసినట్టు లేరని.

## చివరి స్వేచ్ఛాజీవిలా స్పందన

1995 వరకు బాలగోపాల్ భావాలూ, ఆయన జీవితం గురించి యూనివర్సిటీ మిత్రులతో చర్చించడం నాకొక ప్రధాన వ్యాపకంగా వుండేది. ఆయనతో ప్రయాణం చేసి వచ్చిన తర్వాత మరో ప్రయాణం వరకు మిత్రులతో ఆయన గురించిన చర్చలే. హైద్రాబాద్‌లో రాత్రి 9 గంటలకు తెలంగాణ జిల్లాలకు బస్సు ఎక్కితే ఒంటిగంట వరకు ప్రశ్నల మీద ప్రశ్నలు వేసేవాణ్ణి. అన్నిటికీ ఓపిగ్గా సమాధానాలు చెప్పేవారు. నా ప్రశ్నలన్నీ 'గుంజకు కట్టిన మేకకు ఎంత విస్తృతంగా తిరిగే అవకాశం వుంటుందో' ఆ పరిధిలోనే తిరిగేవి. విప్లవోద్యమం తీవ్రమైన అణచివేత ఎదుర్కొంటున్న ఆ కాలంలో, నక్సలైట్ల గురించిన ప్రశ్నలను లో గొంతుతో అడిగేవాణ్ణి. ఆయన మాత్రం చాలా పెద్ద గొంతుతో మధ్య మధ్యలో నవ్వుతూ సమాధానం చెప్పేవారు. బస్సులోని వారికి మా మాటలు వినిపిస్తాయేమోననే బెరుకు నాలో వుండేది. కానీ ఆయన మాత్రం ఆంధ్రప్రదేశ్‌లో మిగిలిన చివరి స్వేచ్ఛాజీవిలాగా స్పందించేవారు.

పౌరహక్కుల సంఘంలో హక్కుల అవగాహన ప్రాతిపదికతో సభ్యులైన వారికంటే రాజకీయ విశ్వాసాల వల్ల సభ్యులైనవారు ఎక్కువ. ఆ చట్రంనుండి సంస్థను బయటపడేయాలని బాలగోపాల్ చర్చ ప్రారంభించారు. పదిహేనేళ్ళ నిరంతర శారీరక, మేధోశ్రమతో ఆ సంస్థను దేశంలోనే హక్కుల పట్ల నిబద్ధతకు త్యాగానికి, అవగాహనకు చిహ్నంగా తీర్చిదిద్దారు. కానీ మెజారిటీ సభ్యులకు ఉన్న నిబద్ధత విప్లవ రాజకీయ విశ్వాసాల వల్ల వచ్చింది కానీ హక్కులు, ప్రజాస్వామ్యం అనేవి గతకాలపు పోరాటాల ఫలితంగా వచ్చిన నాగరికతా విలువలుగా గుర్తించడం వల్ల వచ్చినవి కాదని అర్థమయ్యాక, విప్లవోద్యమం పోతున్న పోకడలను హక్కుల కోణం నుండి విమర్శించక తప్పదని భావించారు. ఈ విషయంమీద సంస్థలోని సభ్యులందరినీ తమ అభిప్రాయాలు రాయమని ప్రోత్సహించారు. ఆయనతో తీవ్రంగా విభేదించిన వాళ్ళు, అంగీకరించిన వాళ్ళు, మూడో మార్గం విశ్వసించేవాళ్ళు అందరూ రాశారు. వాటి ప్రాతిపదికగా అన్ని జిల్లాలలో ఏడాదిపాటు చర్చలు జరిగాయి. తనతో విభేదించిన వాళ్ళు ఇతర జిల్లాల్లో జరిగే చర్చకు రానప్పుడు వారి తరపున వాళ్ళ వాదనను అత్యంత సత్యనిష్ఠతో ఆయన చర్చకు పెట్టేవారు. తమ వాదనను నెగ్గించుకోవాలనే కోరికతో, ఎవరి వాదననైనా స్వేచ్ఛగా అవసరాల మేరకు వక్రీకరించే రాజకీయ వాతావరణం వున్న పరిస్థితుల్లో, ఇతరుల వాదనలను ఎంతో నిష్పక్షపాతంగా వివరించే ఆయన నిబద్ధత చూసి నాకు మతిపోయింది. ఆలోచనలలో సైతం ప్రజాస్వామ్యం కోసం

నిలబడిన చివరి మనిషి అనిపించింది. ఇది అర్థమయ్యాక నాలో చాలా మార్పులు వచ్చాయి. ప్రజాస్వామికంగా ఆలోచించడమంటే స్వతంత్రంగా ఆలోచించడమని, ఆయనతో సహా ఎవరినీ గుడ్డిగా విశ్వసించడం కాదని, ఏ మేరకు వాస్తవం అర్థమయితే ఆ మేరకు ఆచరించడమని తెలుసుకున్నాను. చాలా రకాల పరిమితుల నుండి బయట పడడానికి అదొక మార్గమని అర్థమయింది.

బాలగోపాల్‌లోని మేధస్సును గుర్తించినంతగా, దాని వెనకనున్న కఠోరమైన శ్రమను చాలా మంది గుర్తించలేదేమోననిపిస్తుంది. 1992 నుండి ఆయనతో తెలంగాణ అంతా తిరిగాను. ఒక్కరోజులో 300 కి.మీలు మోటార్ సైకిల్‌పై తిరిగి వచ్చిన తర్వాత కూడా ఆయన రాత్రి పదిగంటలకల్లా నిద్రపోవడం నేను చూడలేదు. అప్పుడు కూడా ఏదో ఒకటి చదువుకుంటూనో, రాసుకుంటూనో రాత్రి 12 గంటల వరకు గడిపేవారు. నేను తొందరగా పడుకుంటే, 'ఎవరైనా రాత్రి పదికల్లా పడుకుంటారా?' అనేవారు నవ్వుతూ.. 'ప్రపంచమే నిద్రపోతుంది, మీరు తప్ప' అనేవాణ్ణి కొంతమంది గురించి 'రాసే అలవాటులేని మేధావులని' సరదాగా అనేవారు. శ్రమ పడడానికి ఇష్టంలేని వారనే విషయాన్ని అంత గౌరవంగా చెప్పేవారు. రోజంతా శ్రమపడేవాళ్ళంతా మేధావులవుతారా అంటే కాకపోవచ్చు గానీ, ఏ మాత్రం శ్రమలేకుండా మాత్రం ఎవరూ మేధావులు కాలేరు.

## స్వేచ్ఛను ప్రకటించి చావడమా? భయపడి చావడమా?

1994 అక్టోబరు చివరి వారంలో వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాలలో జరిగిన ఎన్‌కౌంటర్ ఘటనల మీద నిజనిర్ధారణకై బయలుదేరాం. వరంగల్‌లో ఎవరి దగ్గరో మోటార్ సైకిల్ తీసుకుని రఘునాథపల్లి, జనగాం, చేర్యాల మీదుగా కరీంనగర్ వెళ్ళాలనేది మా ఉద్దేశం. చేర్యాలకు సుమారు పది కిలోమీటర్ల దూరంలో స్టెన్‌గన్లు పట్టుకున్న పదిమంది పోలీసులు వర్షపు నీటికి తెగిన కాలువను బాగు చేయిస్తూ కనిపించారు. మేం కూడా దిగి మోటార్ సైకిల్ తోసుకుంటూ కాలువ దాటుతున్నాం. పోలీసులతోపాటు వున్న ఒక విలేకరి బాలగోపాల్‌ను గుర్తించి పలకరించాడు. అక్కడినుండి వెళ్ళిపోయిన పది నిమిషాలకు మా వెనక పోలీసు జీపు రావడం కనిపించింది. ఒక కానిస్టేబుల్ రివాల్వర్‌తో మా దగ్గరకు వచ్చి చేర్యాల స్టేషన్‌కు రండి అన్నాడు. ఎక్కడికెళ్తున్నారని ప్రశ్నించాడు సి.ఐ. టాడా కేసులున్నవారి వివరాలు సేకరిస్తున్నామని బదులిచ్చారు బాలగోపాల్. వరంగల్‌లో పి.వి. నరసింహారావు మీటింగుకు వెళ్తున్నవారి లారీల్ని కాల్చారు పీపుల్స్‌వార్ కార్యకర్తలు, మీరు వాటిని ఖండించరేం అన్నాడు సి.ఐ. నేను మాట్లాడబోతే బాలగోపాల్ వారించారు. ఒక ఐదు నిమిషాలు చర్చ జరిగింది. అంతలోనే రెండుసార్లు అసహనంగా వాచ్ చూసుకున్నారు

ఆయన. అప్పటికి మధ్యాహ్నం ఒంటిగంటవుతుంది. సి.ఐ. నా గురించి వివరాలు అడిగాడు. కొద్దిగా వివరాలు చెప్పి, సిద్ధిపేటలో ఒక లాయర్ని కలవాలి, మాకు టైమవుతుందని లేచిపోయారు బాలగోపాల్. ఆయన గొంతు స్థిరంగా, స్పష్టంగా పలికింది ఆ మాటల్ని. అందులో స్వేచ్ఛా ప్రకటన తప్ప బెరుకు, భయం లేదు. సి.ఐ. ఏం మాట్లాడాలో తెలియక చూస్తుండగానే మేము స్టేషన్ బయటికొచ్చి కాంపౌండ్ దాటుతున్నాం. ఇంతలో వెనక్కు రమ్మని మరలా పిలుపు వచ్చింది. 'రెండు నిమిషాలు, చాయ్ తాగిపోదురు' అన్నాడు సి.ఐ. నన్ను లోపలి గదిలో కూర్చోమని అంటే, లేదు ఇక్కడే నిలబడతాడు అన్నారు బాలగోపాల్. సి.ఐ. వరంగల్ ఎస్పీకి ఫోన్‌చేసి, మాగురించి చెప్పి ఎనీ ఇన్‌స్ట్రక్షన్స్ సాబ్ అని అడిగాడు. ఫోన్ పెట్టేసి, టాడా కేసులు డిజిపి ఆఫీసులో సేకరించుకోమంటున్నారు మా ఎస్పీ అన్నాడాయన. మా పద్ధతులు మాకుంటాయి లెండి' అని చెప్పి బయటపడ్డాం.

ఆ తర్వాత కరీంనగర్ హైవేలో ఎన్ని దాబాలు కనిపించినా బండి ఆపడం లేదు బాలగోపాల్. చాలా దూరం వచ్చిన తర్వాత అన్నారు, మమ్మల్ని ఒక కానిస్టేబుల్ ఫాలో అవుతూ వచ్చారని. అదేరోజు ఉదయం భీమదేవరపల్లి ఎస్సైని నక్సలైట్లు కాల్చి చంపారనే విషయం రెండోరోజు పేపర్లో చదువుకున్నాక మమ్మల్ని స్టేషన్‌కు ఎందుకు తీసుకుపోయారో అర్థమైంది. 1992, 93, 94 సంవత్సరాలలో తెలంగాణలో 650 మంది ఎన్‌కౌంటర్లలో మరణించారు. అప్పటికే పదేళ్లకు పైగా హక్కుల ఉద్యమంలో పనిచేసిన బాలగోపాల్‌కు పోలీసులంటే ఏం భయంఉంటుందిలే అని ఎవరైనా అనుకోవచ్చు కానీ కాశ్మీర్‌లోని బారముల్లాలో పాకిస్తాన్ సరిహద్దులో నిజనిర్ధారణ బృందాన్ని 2003లో సైనికాధికారులు ఆపినప్పుడు కూడా బాలగోపాల్‌లో అదే తొణకని స్వభావం. రాజ్యం చంపదల్చుకుంటే ఎక్కడైనా ఎప్పుడైనా చంపుతుంది. స్వేచ్ఛను ప్రకటించి చావడమా లేక భయపడి చావడమా అనేదే మనం తేల్చుకోవాల్సిందని బాలగోపాల్ అనుకునేవారు. అదొక్కటే కాదు అన్ని రకాల భయాలనుండి బయటపడడమే నిజమైన స్వేచ్ఛ అనిపించేలా బతికారు. తన విశ్వాసాలకు కట్టుబడడం తప్ప ఎటువంటి బంధనాలు పెంచుకోలేదు. ఆయన అవగాహన, విశ్వాసాలు, సామాజిక నిబద్ధత మాత్రమే ఆయనతో తోడున్నాయి, నడిపించాయి. సామాజిక జీవితమే వూపిరిగా వుంటూ కూడా ఒంటరిగా బతికిన మనిషి ఆయన.

ఏదైనా ఒక హక్కుల ఉల్లంఘన సంఘటనపై నిజనిర్ధారణకు వెళ్ళాలంటే మనలో చాలామంది అనుకున్న సమయానికి రాకపోవడం, వచ్చినా ఎందుకు వచ్చామో అనే స్పృహ లేకుండా ప్రవర్తించడం చేస్తుంటారు. ఆయనతోపాటు పాల్గొన్న చాలా

నిజనిర్ధారణలు సునాయాసంగా, వెంట వెంటనే సమాచారం దొరికినట్టుగా కనిపించేవి. కానీ వాస్తవం వేరు. జరిగిన సంఘటన గురించి, ఆ ప్రాంతం గురించి, అక్కడ నిష్పాక్షికమైన సమాచారం ఇచ్చేవారెవరో ముందుగానే ఆలోచించుకుని వచ్చినట్లు అనిపించేది. దాని వల్ల ఉత్త సమాచార సేకరణకు పరిమితం కాకుండా సంఘటనకు సంబంధించిన సమగ్ర దృశ్యం ఆవిష్కరించడానికి కావలసిన విషయాలు లభించేవి. వివరంగా బాధితులు, సాక్షులు ఇచ్చే విషయాల్ని రాసుకున్నా, వాటిని పూర్తి ముఖవిలువతో తీసుకునేవారు కాదు. బాధితులు ఇచ్చే సమాచారం వెనుక వున్న భయాలు, రాజీలు, ఆకాంక్షలు చూడడానికి ప్రయత్నించేవారు. మాట్లాడే వాళ్ళ తీరును బట్టి అణచివేతను ప్రజలు ఎంతవరకు సహిస్తున్నారు, ఎంత వ్యతిరేకిస్తున్నారు, ఎంత ఆమోదిస్తున్నారు, ఎంతవరకు వాళ్ళు దానిలో భాగస్తులుగా వున్నారు అని అంచనా వేయడానికి ప్రయత్నించేవారు. ఇవన్నీ నిజనిర్ధారణ నివేదికలో కనిపించవు కానీ, దీర్ఘమైన వ్యాసాల్లో చర్చల్లో కనిపించినప్పుడు నేను ఆయన పరిశీలనా శక్తి చూసి ఆశ్చర్యపోయేవాణ్ణి. నిజనిర్ధారణకు వెళ్ళడమనేది సమాజంతో సంభాషణకు ఒక అవకాశం. సమాజంలో తీవ్రమైన పగుళ్ళు ఏర్పడిన చోట కనిపించే కఠినమైన వాస్తవాలు సాధారణ పరిస్థితుల్లో కనిపించవు. అందుకే పేరుపొందిన సామాజిక శాస్త్రవేత్తల కంటే ఎక్కువగా సమాజం నాడిని ఆయన చాలాసార్లు పట్టుకోగలిగారు. సామాజిక వూరేగింపు మధ్యలో నడుస్తూనే వూరేగింపు ఎటువైపు కదులుతుందో చెప్పగలిగేవారు. నిజనిర్ధారణలకు, వాస్తవమైన ఆసక్తిలేకుండా వచ్చేవాళ్ళను కూడా, 'ఇది వాళ్ళకు జరిగిన పని, వాళ్ళు చేసిన పనికాదు' అని మెత్తగా మందలించేవారు తప్ప 'క్లాసులు' ఎప్పుడూ తీసుకోలేదు. ఎంత ఆసక్తి వుంటే అంతే పనిచేస్తారు, లేని ఆసక్తిని ప్రయత్నపూర్వకంగా కల్పించడం సాధ్యం కాదని భావించేవారు. అలాంటిది తీవ్రమైన స్వరంతో అనంతపురం సమావేశాల్లో కార్యకర్తలకు ఆయన సూచనలు, సలహాలు ఇవ్వడం నాకు ఆశ్చర్యాన్ని, సంతోషాన్ని కల్గించాయి. కానీ ఆ రోజు ఆయన అప్పగింతలు చేస్తున్నారనుకోలేదు.

## మనసుపెట్టి పనిచేయమని చెప్పడమే మాకు మందలింపు

తనకు ఇతరులు స్ఫూర్తి పొందేలా పనిచేయడమే తప్ప, వారిచేత పనిచేయించడం చేతకాదు అనేవారు బాలగోపాల్. కలిసి ఎంత ప్రయాణం చేసినా, అడిగితే తప్ప ఏ విషయాలు వివరించి చెప్పేవారు కారు. తగినంత నిబద్ధత వుంటే కార్యకర్తలకు ఎలా పనిచేయాలో వారికే తెలుస్తుందని భావించేవారు. మనసు పెట్టకుండా, ఆలోచించకుండా పనిచేయడం నేర్పిన మన వ్యవస్థలో ప్రయత్నపూర్వకంగా నేర్పితే కొంతమంది విలువైన కార్యకర్తలు తయారౌతారు కదా అనుకునేవాడ్ని. కొంత నిబద్ధత, అవగాహన, వ్యక్తిగత, సామాజిక జీవితంలో

సమన్వయం సాధించుకునే శక్తి వుంటే మంచి కార్యకర్తలు తయారు కాగలరనిపించేది. తోటి కార్యకర్తలపట్ల ఆయన చాలా అరుదుగా మాత్రమే తన అసంతృప్తిని వెలుబుచ్చేవారు. చేసే పని ఏదైనా మనసు పెట్టి చేయండి అనేదే ఆయన చేసే పెద్ద మందలింపు. కార్యకర్తలందరూ తమ సామర్థ్యాలను పెంచుకుని ఇంకా బాగా పనిచేయాలని ఆశించేవారు. అయినా తమ పరిధిలో ఎంతో కొంత నిరంతరం పనిచేసే కార్యకర్తలను ఎప్పుడూ తక్కువ అంచనా వేసేవారు కాదు. కొంతమంది తమ పరిధి దాటి పని చేయరనుకున్నప్పుడు అది వారి పరిమితిగా గుర్తించి సంస్థకు అన్నిరకాల కార్యకర్తలు అవసరం అనేవారు. తన పరిధులు, పరిమితులు దాటి పని చేయడానికి ఎంతగా ప్రయత్నించేవారో, అంతగా ఇతరుల పరిధిని, పరిమితుల్ని సహించారు. బహిరంగంగా ఎన్నడూ అసంతృప్తి వెలిబుచ్చలేదు. కానీ పరిమితుల్ని చాలా సహజమైన విషయంగా పరిగణించేవారి విషయంలో మాత్రం తన అభిప్రాయాల్ని స్పష్టంగా చెప్పేవారు.

బాలగోపాల్ వక్తగా ఒక సమావేశం నిర్వహించడం ఎంత సులభమో రాష్ట్రంలోనే కాదు, దేశంలోని ఏ సంస్థనడిగినా తెలుస్తుంది. ఫలానా రోజు, ఫలానా సమయానికి, ఫలానా అంశంమీద ప్రసంగించాలని ఆయన్ను కోరితే, ఇక ఆ తర్వాత ఆయన కోసం ఎటువంటి ఏర్పాట్లు చేయనక్కరలేదు. సమావేశ సమయానికి అక్కడ ప్రత్యక్షమౌతారు. ఒకసారి ప్రకాశం జిల్లా మారుమూల గ్రామంలో ఒక సమావేశానికి రావల్సిందిగా ఆహ్వానించిన పెద్దమనిషి, ఆ వూసే మరిచిపోయాడు. మాటవరసకు ఫలాన గ్రామంలో ఫలాన రోజు సమావేశం వుంటుంది మీరు రండని పిలుస్తారని ఎరుగని బాలగోపాల్ హైదరాబాద్ నుండి వెళ్ళి తిరిగివచ్చారు. ఆ తర్వాత ఎప్పుడో ఆ పెద్దమనిషిని కలిసినప్పుడు కూడా 'సమయం వృధా అయింది కదా!' అని మాత్రమే అన్నారు. ఆయన సహనానికో నమస్కారం.

నిజనిర్ధారణలకు, సమావేశాలకు వెళ్లిన ప్రాంతాలలోని ఆచార వ్యవహారాలు, భాషా ప్రయోగాలు, నదులు, వ్యవసాయ పద్ధతులు, ప్రయాణ సౌకర్యాలు, ఆహారపు అలవాట్లు అన్నీ చాలా బాగా అర్థం చేసుకునేవారు. ఇతర ప్రాంతాలతో పోల్చి తేడాలు తెలుసుకునేవారు. ఈ పరిశీలనలకు సంబంధించి ఆయనకుండిన లోతైన అవగాహన ప్రత్యేకంగా నమోదు చేయదగ్గది. 'ఈ విషయాలు మీరు వెంటనే రాయాలి' అన్నాను ఒకసారి. నవ్వి వూరుకున్నారు. ఈ అవగాహనా నేపథ్యమే ఆయన్ను హక్కుల ఉద్యమంలో, సామాజిక రచనా రంగంలో అన్ని ప్రాంతాల వారికి విస్తృతమైన ఆమోదంగల నాయకుడిగా నిలిపింది. గ్రామాలకు ఎన్నేళ్ళు తిరిగినా వాటిపట్ల ఆయనకు ఆసక్తి తగ్గలేదు. అన్ని ప్రాంతాల్ని చాలా ఓపెన్‌మైండ్‌తో పరిశీలించారు.

సామాజిక జీవితంలోని చాలా రకాల పరిమితుల్ని అధిగమించారు. కాబట్టే హక్కుల సంస్థల్ని నిర్మించగలిగారు.

బాలగోపాల్ తాను ప్రసంగించే సభలకు తప్ప వేరే వాటికి రారు కదా అని చాలామంది నన్ను అడుగుతూ వుండేవాళ్ళు. ఈ అపవాదు గురించి ఒకసారి ఆయనతో అన్నా. 'ప్రసంగాలు వినడానికి వచ్చేవాళ్ళు ఇష్టముంటే వింటారు, లేదంటే వెళ్ళిపోతారు. కానీ ప్రతి సభలో చివరి వక్తగా నన్ను నిర్ణయించిన తర్వాత నా ముందు మాట్లాడే డజను మంది వక్తలు మాట్లాడే మాటల్ని నేను వింటూనే వున్నాను కదా, ఇది విచిత్రమైన అపవాదు' అన్నారు నవ్వుతూ. మనకు ముందు మాట్లాడిన వారి అభిప్రాయాలతో ఎంతోకొంత ప్రభావితం కావడం చాలామందికి సహజం. కానీ తనముందు మాట్లాడిన వారి అభిప్రాయాలతో పేచి, వాదన, వాటి ప్రభావం కాని ఆయన ప్రసంగంలో ఎప్పుడూ కనిపించేది కాదు. రాజకీయాలపట్ల విధేయతలు, విద్వేషాలు తప్ప లోతైన ఆలోచనా దృష్టిలేని మన సమాజంలో బాలగోపాల్ దృష్టి అరుదైంది. పిడివాదం, స్వప్రయోజనాలు రాజకీయ అవగాహనను నిర్దేశిస్తున్న సమాజంలో ఇతరుల అభిప్రాయాల పట్ల ఆయనకు అభిప్రాయాలు లేక కాదు. కానీ వాటిని ఆయన ఎన్నడూ ప్రదర్శించలేదు. వాటిని వాదనలో పైచేయికోసం వాడలేదు. ఆయన విశ్లేషణల్లో నిజాయితీ, ఖచ్చితత్వం, ఆత్మవిశ్వాసం చాలా వుండేవి. ఇతరులు అంగీకరించిన పరిధిలోనే తన వ్యతిరేకతను, నిరసనను తెలపడానికి ఆయన వ్యతిరేకం. డొంకతిరుగుడు వాదనలతో, వ్యక్తిగత దూషణలతో, వెక్కిరింతలతో వాదనలో పైచేయి సాధించాలనే వైఖరిని ఆయన 'ఆలోచనలలో ప్రజాతంత్ర విలువల కొరత'గానే భావించారు.

పౌరహక్కుల సంఘంలో ఉన్నా, ఆ తర్వాత మానవ హక్కుల వేదిక ఏర్పాటు చేసినా నిరంతరం సంస్థ కార్యక్రమాల గురించే ఆరాటపడ్డారు. ఎంత పని ఉన్నా ఏదైనా సమస్యతో వెళితే తనకు సమయం లేదని మాత్రం ఎప్పుడూ అనేవారు కారు. పదినిమిషాలు మాట్లాడగానే తనకు విషయం అర్థమైందనుకుంటే తాను చెప్పాల్సింది చెప్పేసి, తన పని తాను చూసుకునేవారు. వచ్చిన వాళ్ళు అక్కడ లేనట్లే ప్రవర్తించేవారు. విశ్రాంతిగా కూర్చుని సరదాగా కబుర్లు చెప్పుకుంటూ వుండగా ఆయన్ను ఎవరూ చూసి వుండరు. అందుకే ఎంత పనికైనా ఆయనదగ్గర సమయముండేది. బతుకుతెరువు కోసం చేసే పనులకు కేటాయించే సమయం కాకుండా మిగిలినదంతా హక్కులు పెంపొందించడానికి మార్గాలు వెతకడంలో కార్యకర్తలందరూ వెచ్చించాలని ప్రతి మహాసభలప్పుడు గుర్తుచేసేవారు. కార్యకర్తలు తగిన స్థాయిలో పనిచేయనప్పుడు ఆ మొత్తం బరువంతా తానొక్కరే మోసి

మనల్నందర్నీ ఆయన గారాం (Pamper) చేసిన మాట వాస్తవం. ఉమ్మడి కుటుంబంలో తెలివి వుండీ బాధ్యతలు ఎరుగని పిల్లల తరపున, బాధ్యతలు ఎరిగినా శక్తిసామర్థ్యాలు లేని వారి తరపున, స్వంత కాళ్ళమీద నిలబడే పరిణితి లేనివారి తరపున ఒళ్ళు హూనం చేసుకుని పనిచేసే తండ్రిలాగ, తల్లిలాగ పనిచేసిన బాలగోపాల్ 57 ఏళ్ళు జీవించడమే ఆశ్చర్యం. మనుషులు నిండైన వ్యక్తిత్వంతో, పరిణతితో, స్వేచ్ఛగా, బాధ్యతతో ఎదగడానికి కావల్సిన సామాజిక పరిస్థితులను సాధించడానికి కృషి చేయడం హక్కుల ఉద్యమ కర్తవ్యమని చెప్పిన బాలగోపాల్ ఆశయాలను, ఆయన జీవించి చూపిన ప్రజాతంత్ర విలువలను ముందుకు తీసుకుపోవడం మనందరి కర్తవ్యం.

# సామాజిక ఉపాధ్యాయుడు

**కె. బక్కయ్య***

బాలగోపాల్‌సారు ఎప్పుడు ఏ పని చేసినా ఒక వ్యక్తిగా కాకుండా ఒక ఉద్యమంలాగా చేసేవారు. రాజకీయ పార్టీలు, ఉద్యమపార్టీలు ఏవైనాసరే ఎంతోకొంత జనబలం, ధనబలం లేందే అడుగు ముందుకేయవు. కాని బాలగోపాల్ సారుకు ఆ సమస్యలేదు. బాలగోపాల్ సార్ ఏ పనినైనా ఏ పరిస్థితులలోనైనా ఒక వ్యక్తిగాకాక ఒక సైన్యంలా పనిచేసే తీరును సామాజిక ఉద్యమాలతో సంబంధం ఉన్నవారెవరైనా అనుసరించి తీరాలి అనిపిస్తుంది.

'థింక్ హై, లివ్ లో' అనే దానికి ఒక గొప్ప ఉదాహరణ బాలగోపాల్ సారు. సామాజిక సమస్యల పరిష్కారానికి మార్గం సూచిస్తూ, చేపట్టిన ఉద్యమాలకు దిశా నిర్దేశం చేస్తూ కూడా ఉద్యమంలో ఒక సామాన్య కార్యకర్తలాగా పనిచేయడం ఒక్క బాలగోపాల్ సార్‌కే చెల్లు. బాలగోపాల్‌సార్ సామాన్యునిలా కనబడే అసాధారణ, బహుముఖ ప్రజ్ఞాశాలి. ప్రజలకోసం సారు ప్రయాణం చేసే తీరు, ఆ ప్రయాణంలోనే సారు చేసే నిద్ర, చివరికి ఆదివాసుల దగ్గర వారు రివాజుగా తినే ఆహారాన్ని సారు తీసుకుంటున్నపుడు ఇది మనకు ప్రస్ఫుటమవుతుంది. ఇప్పుడున్న పరిస్థితులలో ఏ ఉద్యమపార్టీ నాయకుడు కూడా ఈ సాహసానికి ఒడిగట్టడేమో. చెప్పడానికి సాహసమే అనిపించినా, ఒక విషయం చెప్పాలి. సారు మా అందరినీ మంచి మిత్రుడిలాగా చూసేవారు. మా చిన్న చిన్న ఆనందాల్ని కూడా పంచుకునేవారు. సారు అసహనంగా ఉండడం నేను ఎప్పుడూ చూడలేదు.

నా మటుకు నాకు బాలగోపాల్ సారు 'సోక్రటీస్'లాంటి ఒక తత్త్వవేత్తలాగా కనపడతాడు. ఎందుకంటే సారు ఏ విషయం చెప్పినా దానిని నిర్దిష్టంగా

---

* **మానవహక్కుల వేదిక ఆదిలాబాద్ జిల్లా అధ్యక్షుడు**

నిర్వచించినట్లుండేది. అప్పటి వరకు మాకున్న సందేహాలన్నీ పటాపంచలయ్యేవి. బాలగోపాల్ సారు ఒక అద్భుతమైన ఉపాధ్యాయుడు. చివరి శ్వాస వరకు కూడా అలాగే ఉన్నాడు. ఒక గొప్ప విద్యావేత్త, ఉపాధ్యాయుడు చేయవలసిన పని సమకాలీన పరిస్థితులను, సమస్యలను తన విద్యార్థులకు ముఖ్యంగా తనతో ఉన్నవారికి పరిశీలనాత్మకంగా వివరించి, పరిష్కార దిశానిర్దేశం చేయడమే. బాలగోపాల్ సారు తన వ్యాసాల ద్వారా, పుస్తకాలద్వారా, ప్రసంగాలద్వారా అంతకన్నా ఎక్కువే చేశారనిపిస్తుంది. సారు రాసిన డి.డి. కోశాంబి పరిచయం చదివి ప్రభావితంకాని విద్యార్థి ఉండడేమో. నేను ఉస్మానియా యూనివర్శిటీలో ఎంఫిల్ చేస్తున్నప్పుడు నన్ను భావజాలపు ఊగిసలాటనుండి బయటపడవేసి నా దృక్కోణాన్నే మార్చేసింది ఆ పుస్తకం. నా లాగా మరెందరో సమాజంలో సారు రచనలకు ప్రభావితులై ఉంటారు. అందుకే సారు నా దృష్టిలో సమాజం అనే పాఠశాలలో పాఠాలు బోధించే అద్భుతమైన ఉపాధ్యాయుడు.

ఆలోచిస్తే, సార్‌కు అసలు ప్రత్యామ్నాయమే లేదనిపిస్తుంది. ఎందుకంటే నక్సల్స్‌తో శాంతిచర్చలకై ఢిల్లీలో జరిగిన కాన్ఫరెన్స్‌లో సారు మొదటిసారి హాజరై, రెండవసారి హాజరయ్యే ముందే ఈ లోకాన్ని విడిచివెళ్లినపుడు, అక్కడి మేధావివర్గం అంతా అన్నమాట ఏమిటంటే "బాలగోపాల్ లేని లోటు ప్రస్ఫుటంగా కనిపిస్తుందని". అలాగే 1987 ప్రాంతంలో 'ఉదయం' దినపత్రికలో ప్రచురితమైన 'క్యాంపస్ క్యాంపస్' (రాడికల్ స్టూడెంట్స్ కథాంశంతో సాగిన) అనే డైలీ సీరియల్‌లో కూడా బాలగోపాల్ సార్‌ను బాలకన్నయ్యగా రాశారు. సారు పౌరహక్కుల సంఘంలో ఉన్నా, మానవహక్కుల వేదికలో ఉన్నా ఎంత నిబద్ధతతో పనిచేసేవారో అందరికీ తెలుసు. అంటే సారుకు పేరులోగాని, పనిలోగాని, అప్పుడుగాని, ఇప్పుడుగాని ఒక ప్రత్యామ్నాయమే లేదనిపిస్తుంది.

## ఎవరితోనూ పోల్చలేని వ్యక్తి

బాలగోపాల్ గారి స్మారక సభలో ప్రసంగిస్తూ హెచ్‌ఎంటివి ప్రధాన సంపాదకులు రామచంద్రమూర్తిగారు అన్నమాటలు మరువలేనివి. ఆయన మాటలనే ఈ క్రింద రాస్తున్నాను. "నేను స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత జన్మించాను. అప్పటి మహానుభావుల గురించి, స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న గొప్పవాళ్ల గురించి నేను చరిత్రలో చదవడం తప్ప చూడలేదు. కాని మన కళ్లముందు కనిపించిన అంతటి గొప్ప మహానుభావుడు మన బాలగోపాల్" అన్నారు. బాలగోపాల్ సార్‌ను ఎవరితో పోల్చలేము. ఎందుకంటే మనకు తెలిసి పలు రంగాలలో ప్రజ్ఞాపాఠవాలు కలిగిన ఒక సామాజిక కార్యకర్త, ఉద్యమకారుడు, నిగర్వి, నిరాడంబరుడు, పొగడ్తలను

ఆశించనివాడు, తెగడ్తలకు వెరవనివాడు, బడుగు వర్గాల క్షేమమే తన ఊపిరిగా బతికినవారు ఇంకెవరూ లేరు. తన ఆలోచనలకు, జీవితాచరణకు అడ్డుగీతల్ని చెరిపివేసి జీవితమే ఒక ఉద్యమంగా, ఉద్యమమే తన జీవితంగా ఆచరించి చూపిన మహావ్యక్తి, నిష్కామకర్మయోగి బాలగోపాల్‌సారు. బాలగోపాల్ సారు గురించి చెప్పాలంటే పదాలను, పదబంధాలను ఉపయోగించాల్సిందే తప్ప ఎలాంటి ఉపమానాలుండవు. ఎందుకంటే చరిత్రను పరికిస్తే ఎంతటి వ్యక్తులకైనా కొన్ని వ్యక్తిగత బలహీనతలు కనిపిస్తాయి. ఆలోచనకు ఆచరణకు మధ్య తేడాలుంటాయి. కాని బాలగోపాల్‌సారు వాటిని అధిగమించిన వ్యక్తి. అంతటి వ్యక్తిత్వం ఆయనది.

మిన్ను విరిగి మీదపడ్డా చలించకుండా సుఖదు:ఖాలను, లాభనష్టాలను, జయాపజయాలను సమానంగా భావించి తన పనిని తాను ఒక విధిగా చేసుకుంటూ పోయేవాడు. కర్మలనుండి లాభాన్ని కాని ప్రతిఫలాన్ని కాని ఆశించకుండా జీవించేవాడ్ని స్థితప్రజ్ఞుడు అంటారు కదా. బాలగోపాల్‌సారు అటువంటి యోగి. అన్ని లక్షణాలను కలిగిన మహానుభావుడు మనకు మన ఇతిహాసాల్లో కూడా దొరకడు. ఎందుకంటే వాటిలోని ప్రతిపాత్ర వెనుకా ఏదో ఒక స్వార్థం, ఒక బలహీనత ఉంటాయి. కాని ఆ లక్షణాలు ఏవీ లేని వ్యక్తి బాలగోపాల్‌సార్ అనిపిస్తుంది.

బాలగోపాల్‌సార్ ఆస్తికుడా, నాస్తికుడా అనే విషయాన్ని పక్కన ఉంచి సారు గురించి చెప్పాలనుకున్నవారు ఆస్తికులా, నాస్తికులా అని చూసినట్లయితే ఇద్దరికి కూడా సారు ఒక సమాన ఆదర్శంగా కనిపిస్తారు. ఒక కమ్యూనిస్టుకు ఉండాల్సిన లక్షణాలైన స్వంత ఆస్తిని పోగేసుకోకుండా ఉండడం, కుటుంబం అనే చక్రానికి అతీతంగా ఉండడం మొదలైనవీ సారులో ఉన్నాయి; అలాగే ఒక ఆధ్యాత్మిక వ్యక్తికి ఉండాల్సిన లక్షణాలైన సమాజహితం, తన పర భేదం లేకుండా జీవించడం, శాంతి, సత్యం, అహింసలను పాటించి నిష్కామకర్మలను ఆచరించడం మొదలైనవీ ఉన్నాయి. ఈ రెండు సిద్ధాంతాలను కూడా సంతృప్తిపరచగల ఉన్నత వ్యక్తిత్వం సారుది. అందుకే బాలగోపాల్ సారును వర్ణించడానికి ఉపమానం దొరకదు. నిజం చెప్పాలంటే చాలా సందర్భాలలో సారే ఒక గొప్ప ఉపమానం.

బాలగోపాల్‌సారు జీవితాచరణను గమనిస్తే అది ప్రతిమనిషి వ్యక్తిత్వ వికాసానికి పనికివచ్చే అంశంగా తోస్తుంది. 100 శాతం జీవించడం అనే నేటి వ్యక్తిత్వ వికాస సూత్రము సారు పఠనంలోగాని, లేఖనంలోగాని, ఉద్యమంలోగాని పూర్తిగా కనపడుతుంది. జీవితంలో నిర్భీతి, నిష్కపటం, సమయపాలన, విరామమెరుగక శ్రమించడం, అర్థవంతంగా జీవించడం అనే ఆర్ట్ ఆఫ్ లివింగ్‌ను సార్ నుండి ఎందరో నేర్చుకోవలసి ఉంది. అసత్యపు పునాదులమీద ఆడంబరాలతో, ఆలోచనలకు

ఆచరణకు పోలిక లేకుండా బ్రతికే నేటితరం నాయకులకు మరియు చాలామంది మేధావులకు బాలగోపాల్‌సార్ ఒక ప్రశ్న అయితే జీవితాన్ని అర్థవంతంగా చైతన్యవంతంగా జీవించాలనుకునే వారికి బాలగోపాల్‌సార్ ఒక గొప్ప సమాధానం. సార్ నుండి మన జీవితాలకు కావలసిన సమాధానాలను వెతుక్కోవడమే సారుకు మనమిచ్చే ఘననివాళి.

పోరాటం తప్పనిసరైన ఈ సమాజానికి కాలం బహూకరించిన ఒక మేధో ఆయుధం (వరం) బాలగోపాల్‌సార్. భావజాలపు చీకట్లలో తడుముకునే వారికి ఒక టార్చ్‌లైట్ బాలగోపాల్ సార్. పర్యావరణ విధ్వంసంపైనా, ఓపెన్‌కాస్ట్‌లకు, సెజ్‌లకు వ్యతిరేకంగానూ సారు చేపట్టిన ఉద్యమాలను ప్రజలెన్నడూ మరచిపోరు. సంపద మరియు భౌతిక వస్తువుల వ్యామోహంలో సామ్రాజ్యవాదులకు తొత్తులుగా ఉంటూ, ప్రపంచ బ్యాంకుకు అడుగులకు మడుగులొత్తే నాయకులకు సారు మాటలు, ఆలోచనలు కంటగింపుగా ఉండొచ్చు కాని భవిష్యత్తు తరాలకు మాత్రం అవే మార్గదర్శకాలౌతాయి. ఇది నిజం.

# పనిముట్లన్నీ ఇచ్చి వెళ్లారు

యు.జి. శ్రీనివాసులు*

**బా**లగోపాల్‌గారి మరణవార్త వినగానే దు:ఖం వెల్లువెత్తింది.

బాలగోపాల్ గారితో పరిచయం, ఆయన ఆలోచనలు, ఆచరణా చాలామందిని ప్రభావితం చేసాయి. వాళ్ళల్లో నేనూ ఒకణ్ణి. ఆయన సామాజిక జీవితం మార్క్సిస్టు మేధావిగా మొదలయ్యింది. మన రాష్ట్రంలో హక్కుల సంఘాలు నక్సలైటు ఉద్యమాల నేపథ్యంలో ఏర్పడడం వలన ఎపిసిఎల్‌సి కార్యదర్శిగా పోలీసుల బూటకపు ఎన్‌కౌంటర్లకు వ్యతిరేకంగా చాలా కార్యక్రమాలు జరిగేవి. ఎంతో ధైర్య సాహసాలతో ఆయన ఈ కర్తవ్యాన్ని నిర్వహించారు. ఆయన ధైర్యం సమాజంలో చాలామందిని ఉత్తేజితుల్ని చేసింది.

బాలగోపాల్ కడవరకు కూడా సమాజ అధ్యయనానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. చుండూరు, కారంచేడు వంటి సంఘటనలు సమాజాన్ని ఒక్క కుదుపు కుదిపినపుడు ప్రభుత్వం పాల్పడుతున్న రాజ్యహింసపైనే కాకుండా కుల, లైంగిక ఆధిపత్యాలవంటి వ్యవస్థీకృత హింసల్ని సైతం వ్యతిరేకిస్తూ పోరాడవలసిన అవసరం గురించి ఆయన నొక్కి చెప్పారు. ప్రాధాన్యతల విషయంపై పౌరహక్కుల సంఘంలో భిన్నాభిప్రాయాలు వచ్చినా అన్ని సామాజిక సమస్యలపైనా ఉమ్మడిగానే పనిచేసాము. ప్రజల హక్కులకు భంగం వాటిల్లే ప్రతి అంశాన్నీ స్పృశించాము.

కర్నూలు జిల్లాలో బాలగోపాల్‌గారు మాతో కలిసి పనిచేయని సమస్య లేదు. కర్నాటక రాష్ట్రాన్ని ఆనుకుని ఉన్న కర్నూలు జిల్లా పడమటి ప్రాంతంలో దళితులపై దళితేతరులైన బోయ, గొల్ల, కురువ, ముస్లిం మొదలైనవారు దాడులకు

* మానవహక్కుల వేదిక రాష్ట్ర కార్యదర్శి, ఆదోని

పాల్పడుతుండేవారు. వీరిమధ్య వైరుధ్యాలను వాడుకొని కమ్మ, రెడ్డి కులస్థులు రాజకీయంగా ప్రాబల్యం పెంచుకునేవారు. ఈ విషయం హక్కుల పరిధిలోకి వస్తుందని గ్రహించి మనం దృష్టి పెట్టాము. ఇలా బాలగోపాల్ గారు హక్కుల పరిధిని విస్తరిస్తూ పోయిన అనేక ప్రాముఖ్యం కలిగిన విషయాలపై పనిచేశాము. శ్రీశైలం ప్రాజెక్టు నిర్వాసితుల పునరావాస సమస్యపైనా, కర్నూలులో పేపరు మిల్లు, ఆదోనిలో కొఠారి స్పిన్నింగ్ మిల్లులు మూతపడి కార్మికులు రోడ్డున పడ్డప్పుడూ ఇదే ప్రాధాన్యం ఇచ్చాము. విస్తృతంగా కార్యక్రమాలు చేపట్టడం వలన కార్యకర్తలకు సమాజాన్ని అధ్యయనం చేసే అవకాశాలు పెరగడం ఒక ఎత్తయితే, బాధితులు సాంత్వన పొందడం మరో ప్రయోజనం. హక్కుల సంఘం అజెండా విశాలం కావడాన్ని అందరూ ఆమోదించారు, కాని రాజ్యహింసకు అధిక ప్రాధాన్యం ఇవ్వాలనే వారితోనే సమస్య మొదలయ్యింది. సంస్థ నిర్వహిస్తున్న కార్యక్రమాలకు వీరు 'సహాయ నిరాకరణ' ఆరంభించారు. ఆ క్రమంలో నేను నా జిల్లా బాధ్యతల నుంచి విరమించుకోవాలని నిర్ణయించుకున్నప్పుడు బాలగోపాల్‌గారు నాకు నైతిక ధైర్యాన్నిచ్చి ఆ నిర్ణయాన్ని వెనక్కి తీసుకునేలా చేశారు. హక్కుల సంఘం అటు ప్రభుత్వానికీ, ఇటు నక్సలైట్లకూ వాణిగా కాకుండా 'మూడో గొంతుక'గా వ్యవహరించాలని బాలగోపాల్ గారు వాదించేవారు. తన వాదనకు సామాజిక ఆమోదం ఉందనే విషయాన్ని ఆచరణ ద్వారా నిరూపించారు.

మానవ హక్కుల వేదిక ఏర్పడిన ఈ పదేళ్ళ కాలంలో రాష్ట్ర వ్యాపితంగా సంస్థ ఎదగడానికి ఎంతో కృషి చేశారు. ప్రతి మనిషికీ ఒకే విలువ ఉండే సమాజాన్ని బాలగోపాల్ ఆకాంక్షించారు. ఈ ఉదాత్తమైన ఆశయాన్ని నెరవేర్చడం అంత సులభం కాదు. అసమానతలు తీవ్రమవుతున్న వర్తమాన సమాజంలో గొంతులేని వారి తరఫున మాట్లాడటం ఎంతో అవసరం. అందుకు అవసరమైన పరికరాల్నీ, వనరుల్నీ, ఆలోచనలనూ, అనుభవాలనూ, ఆచరణనూ మనందరికోసం మిగిల్చి వెళ్ళారు. భౌతికంగా మనకు దూరమయినా ఆయన మనకు వారసత్వంగా ఇచ్చిన సాధన సంపత్తితో ప్రతి మనిషికీ ఒకే విలువని సాధ్యం చేద్దాం.

# ప్రవహించే నదీ ప్రవాహం

ఎ. చంద్రశేఖర్*

రెండు దశాబ్దాలుగా ఆంధ్రప్రదేశ్ ప్రజా ఉద్యమాలను తనదైన శైలిలో ప్రభావితం చేసిన వ్యక్తి బాలగోపాల్. ప్రజా ఉద్యమాలలో ఎదిగి, ప్రజా ఉద్యమాలలో భాగంగా వుంటూ, ప్రజా ఉద్యమాలకు మార్గదర్శకుడిగా ఎదిగిన వ్యక్తి. బాలగోపాల్ ఆలోచనలని, ఆచరణను విడివిడిగా చూడడం అసాధ్యం. తను ముందుగా ఎంచుకున్న ప్రణాళికతో ఉద్యమాలలోకి వచ్చినవాడు కాదు. అదే సమయంలో యాదృచ్ఛికంగా వచ్చినవాడూ కాదు. సంఘటనల పట్ల సామాజిక అణచివేతల పట్ల తీవ్రంగా ప్రభావితుడై ఆ సమయానికి సమస్య పరిష్కారానికి అతి చేరువగా వున్న ఉద్యమాలలో భాగమయ్యారు. బాలగోపాల్‌ను అర్థం చేసుకోవాలంటే ప్రవహించే నదీ ప్రవాహాన్ని అర్థం చేసుకోగలగాలి. నిరంతరం తనను తాను ప్రశ్నించుకుంటూ అతి తక్కువ అణిచివేత కలిగిన సమాజాన్ని చేరుకునే మార్గం కోసం నిరంతర అన్వేషణ చేసిన వ్యక్తి. బాలగోపాల్‌ను మూసపోసిన పాత్రలో వూహించి దానిలో ఆయన ఒదగలేదని నిందించడం మన హ్రస్వదృష్టే. ఏ జీవితమూ ఎప్పుడూ పోతపోసినట్లుగా వుండదు. ఒకవేళ వుంటే అది అత్యంత కృత్రిమ జీవితం అవుతుంది. అత్యంత సహజ జీవితాన్ని గడిపేందుకు ప్రయత్నం చేసిన వ్యక్తి ఆయన. కొన్ని సమయాల్లో బాలగోపాల్‌లోని 'మనిషి' ఇంత ఘర్షణకు లోనౌతూ కూడా సంయమనం కోల్పోకుండా ఉండటం అసాధ్యమనిపించి ఇతడు మనిషా? రాక్షసుడా? దేవుడా? అర్థమయ్యేదేకాదు. బాలగోపాల్ మానవహక్కుల, పౌరహక్కుల ఉద్యమాలకు చేసిన కృషిని వివిధ కోణాలలో ఇప్పటికే అనేకులు విశ్లేషించి వున్నారు. ఈ వ్యాసంలో రెండు విషయాలు మాత్రమే ప్రస్తావించే ప్రయత్నం చేస్తాను.

* **మానవహక్కుల వేదిక రాష్ట్ర కార్యవర్గ సభ్యుడు, గుంతకల్**

మొదటిది ప్రజాసంఘాలలో ఉత్పన్నమయ్యే విభేదాలను పరిష్కరించుకోవడానికి ఒక నాయకుడిగా ఆయన చేపట్టిన విధానం. 1980లలో బాలగోపాల్ పౌరహక్కుల సంఘంలో సభ్యత్వం తీసుకోవడానికి, ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలు తీసుకోవడానికి మధ్య ఎక్కువ వ్యవధి లేదు. ఒక లెక్చరర్‌గా ఉద్యమంలో ప్రవేశించి ఒక సామాన్య లాయర్‌గా (ఆదాయపరంగా) నిష్క్రమించిన వ్యక్తి. రాజకీయాలను (విప్లవ) ప్రగాఢంగా విశ్వసించే సంస్థలో ప్రధాన కార్యదర్శిగా హక్కుల జీవితాన్ని ప్రారంభించి క్రమేపీ తనను తాను సమన్వయ పరుచుకుంటూ మానవ హక్కుల వేదిక ఏర్పాటులో కీలక పాత్ర వహించారు.

### ఆయన నిబద్ధతే సంస్థకు బలం

ఈ పరిణామం అంత సులువుగా సరళంగా సాగినది కాదు. 1983 నుంచి 1998 వరకు ఎపిసిఎల్‌సి కొనసాగించిన ప్రతి ఉద్యమానికి ముందుండి నాయకత్వం వహించారు. సంస్థాగతంగా దాని నిర్మాణానికి అపారమైన కృషి చేశారు. ప్రజాసంఘాల సహాయ సహకారాలు వున్నప్పటికీ బాలగోపాల్ వ్యక్తిత్వం, జీవనశైలి అనేకుల్ని ఈ సంస్థలోకి ఆకర్షించాయి. ఇదే సమయంలో ఎపిసిఎల్‌సిలో నెలకొని వున్న రాజకీయ విభేదాలు నిర్మాణానికీ, పనివిధానానికీ ఆటంకంగా వుండటం బాలగోపాల్‌కి కొద్దిగా ఆశ్చర్యాన్నీ మరింత పట్టుదలనూ పెంచాయి అని చెప్పాలి. జిల్లాకమిటీల్లో వుండే విభేదాలను నిష్పక్షపాతంగా పరిష్కరించడం అనేక సందర్భాలలో ఆయా రాజకీయ అభిప్రాయాలు ఉన్నవారిని అసంతృప్తికి గురిచేసాయి. అయినా బాలగోపాల్ నిబద్ధత, పనితనం, నిజాయితీ కారణంగా ఆయా వర్గాలు ఆయన అభిప్రాయాలని ఆమోదించడం జరుగుతూ వచ్చింది. అయితే ఇది ఎంతోకాలం కొనసాగలేదు. క్రమేపీ పౌరహక్కుల ఉద్యమంలో రాజ్యహింసకే ప్రాధాన్యం కల్పించాలి అనే ఆలోచనా దృక్పథం మెజారిటీ దృక్పథంగా స్థిరపడుతున్న సమయంలో సమాజం నుంచి ప్రతినిత్యం ఎదురవుతున్న ప్రశ్నలకు జవాబుగా ఒక విశాల ప్రాతిపదికపైన పౌరహక్కుల ఉద్యమం నిర్మించబడాలనీ, అటువంటి ఉద్యమానికి ఆలోచనలలో మాత్రమే కాకుండా భౌతికంగా కూడా ఒక స్థానం వున్నదనీ దానికోసం కృషి చేయాలని బాలగోపాల్ ఒక నూతన ఆలోచనకు బీజం వేశాడు. ఈ ధోరణి నచ్చని మెజారిటీ సభ్యులు 1993 కర్నూలు మహాసభలలో ప్రధాన కార్యదర్శి నివేదికను తిరస్కరించడం జరిగింది. దాంతో బాలగోపాల్ నాయకత్వ బాధ్యతల నుంచి తప్పుకుంటానని చెప్పారు. అప్పుడు ఏ ప్రజాసంఘం తీసుకోని ఒక అసాధారణ నిర్ణయాన్ని ఎపిసిఎల్‌సి కార్యవర్గం తీసుకొంది. ప్రధానకార్యదర్శిగా బాలగోపాలే కొనసాగాలని పట్టుపట్టింది. అత్యంత ప్రజాస్వామిక విలువలు వున్న వ్యక్తిగా బాలగోపాల్ మెజారిటీ అభిప్రాయాన్ని గౌరవిస్తూనే సంస్థలో ఉత్పన్నమైన సంక్షోభాన్ని

రెండు సంవత్సరాలలో పరిష్కరించుకోవాలని చెప్పడమే కాక ఆ రెండు సంవత్సరాలు అన్ని జిల్లాల్లో 12 చర్చా పత్రాలపైన చర్చలు నిర్వహించి ప్రజాస్వామిక రాజకీయాలకి ఒక కొత్త నిర్వచనాన్ని ఇచ్చాడు. సాధారణంగా ఆంధ్రప్రదేశ్ ప్రజా సంఘాల రాజకీయాలలో గ్రూపులు కట్టడం, ఒకరిపైన ఒకరు పన్నాగాలు పన్నడం వేయడం సహజం. కానీ బాలగోపాల్ అత్యంత పారదర్శకంగా తాను నమ్మిన సిద్ధాంతాన్నీ చర్చకు పెట్టి తను మైనారిటీలో వున్న విషయం తెలిసినప్పటికీ ఓపికగా ఆ కార్యక్రమాన్ని చివరి వరకు కొనసాగించాడు. 1998 గుంటూరు సభలలో బాలగోపాల్ అభిప్రాయాలు మెజారిటీ సభ్యుల తిరస్కారానికి గురి అయినప్పటికీ హైదరాబాద్‌లో మహాసభలు జరిగేంత వరకు సంస్థ కార్యకలాపాలకు ఏ మాత్రం విఘాతం కలగకుండా పని చేశారు. ఆ తరువాత నెలకు మానవ హక్కుల వేదికను ఏ హంగూ ఆర్భాటమూ లేకుండా తన సహచరులతో ఏర్పాటు చేయడం జరిగింది.

ఆంధ్రప్రదేశ్ ప్రజాసంఘాల రాజకీయాలతో పరిచయం వున్న వారికి ఏదైనా ఒక సంస్థ చీలిపోతే ఒకరిపైన ఒకరు వ్యక్తిగత ఆరోపణలు చేసుకోవడం, దూషించుకోవడం ఒక సంస్కృతిగా ఉందనే విషయం తెలిసిందే. అయితే ఎపిసిఎల్‌సి, మానవహక్కుల వేదిక రెండు సంస్థలుగా విడిపోయినప్పటికీ రాతల, కరపత్రాల యుద్ధాలు లేకుండా విడిపోవడం బాలగోపాల్ కారణంగానే సాధ్యమయింది. వ్యక్తుల మధ్య, సంస్థల్లోనూ, సంఘాలలోనూ పరస్పర విభేదాలు సహజమైనవే కాని వాటిని పరిష్కరించుకోవడానికి బాలగోపాల్ ఒక నూతన మార్గాన్ని మనకు అందచేశాడు. ఈ మార్గంలో ప్రయాణించడానికి మనపట్ల మనకు విశ్వాసం, నిజాయితీ, పారదర్శకత అవసరం. ఇవన్నీ కూడా నిండుగా వున్న మనిషి బాలగోపాల్. రాజకీయ పార్టీల ప్రత్యక్ష లేక పరోక్ష అండ లేకుండా ఏ ప్రజాసంఘం సుదీర్ఘ కాలం పనిచేయడం సాధ్యం కాదని నాలాంటి DOUBTING THOMASES బాలగోపాల్‌తో విభేదించడం జరిగింది. అయితే ప్రతి రాజకీయ ఆలోచనా తప్పనిసరిగా రాజకీయ పార్టీతో ముడిపడి వుండవలసిన అవసరం లేదు, పైపెచ్చు బలమైన భావాలు, ఆలోచనలు చరిత్రలో రాజకీయ పార్టీల అండ లేకుండానే మనగలిగాయి అని చెప్పడమే కాదు, మానవహక్కుల వేదిక ఏర్పాటు ద్వారా దాన్ని ఆచరణలో చూపించే ప్రయత్నం చేసాడు. మానవ హక్కుల వేదిక రాష్ట్రంలోని దాదాపు అన్ని జిల్లాల్లో నిర్మాణం కలిగి వుండటమే కాక చాలా సందర్భాల్లో అర్థవంతమైన పాత్ర వహించడం బాలగోపాల్ ఆలోచనకు బలం చేకూర్చింది.

నిబద్ధత కలిగిన వ్యక్తిగత జీవితంతోపాటు ఎదుటి మనిషి బలాన్ని, బలహీనతలను గుర్తించే నేర్పు, బలహీనతలను విమర్శించకుండా వారిలో పాజిటివ్ అంశాలు స్వీకరించి, వారిని, సంస్థను కూడా ముందుకు తీసుకెళ్ళగలిగిన సహనశీలి

బాలగోపాల్. ప్రజాసంఘాలలో జీవితకాలం పదవులు కలిగివుండే సంస్కృతి ఆంధ్రప్రదేశ్‌లో చాలా సహజమైన విషయం. అయితే దీనికి భిన్నంగా సంస్థల్లో తప్పనిసరిగా అన్ని వర్గాలకు నాయకత్వ స్థానంలో అవకాశం కల్పించిన వ్యక్తి బాలగోపాల్. ఇది కేవలం ఒక ఆదర్శంగా కాక తానుగా కృషి చేసి, ఆచరణలోకి తెచ్చిన వ్యక్తి.

సమకాలీన ప్రాపంచిక పరిణామాలలో హక్కుల సంఘాల మనుగడ ప్రశ్నార్థకంగా మారినపుడు ప్రతి ఒక్కరిలో వుండే మానవీయ దృక్కోణమే మన సంస్థలకు బలం అని బాలగోపాల్ నమ్మడమే కాదు దానిపై పూర్తి విశ్వాసంతో ముందుకెళ్ళినవాడు. కాశ్మీర్‌లో, మణిపూర్‌లో, ఛత్తీస్‌గఢ్‌లో కొన్ని సందర్భాలలో ముందుకెళ్ళడం ప్రమాదకరమని భావిస్తున్న సమయాలలో కూడా చాలా ఓపికగా, ఒకింత సాహసంతో సత్యం పక్షాన మనం వున్నాము, మనం నిర్భయంగా ముందుకు వెళ్ళవచ్చునని వెన్నుతట్టి ముందుకు నడిపినవాడు. సంస్థల నిర్మాణంలో మనుషుల పట్ల నమ్మకం, నాయకత్వం పట్ల విశ్వాసం రెండూ అవసరమే. ఈ రెండింటి మేలు కలయికే బాలగోపాల్.

## రాయలసీమలో ఎన్నో కార్యక్రమాలు

నేను ప్రస్తావించదలచుకున్న రెండవ అంశం రాయలసీమతో బాలగోపాల్‌కి వుండే అనుబంధం. బాలగోపాల్ మరణించిన తరువాత అనంతపురంవారు, కడపవారు, తిరుపతివారు బాలగోపాల్ మావాడంటే మావాడు అన్నారు. బాలగోపాల్ రాయలసీమలోని అన్ని ప్రాంతాలకు చెందినవాడు. కర్నూలు జిల్లాలోని పత్తికొండ, ఆదోని, ఎమ్మిగనూరు, నంద్యాలలో బాలగోపాల్ పదులసార్లు పర్యటించారు. కర్నూలు దక్షిణ తాలూకాలలో కొనసాగుతున్న దళిత వివక్షకు వ్యతిరేకంగా అనేక కరపత్రాలను, పాదయాత్రలను, సభలను నిర్వహించారు. ఈ తాలూకాలలో దళిత చైతన్యానికి బాలగోపాలే ప్రధాన కారణమంటే ఆశ్చర్యం కాదు. అదేవిధంగా అనంతపురం కరువుపైన 1990లోనే 'కరువు యాత్ర' చేసి అనంతపురం కరువుపైన పుస్తకాన్ని తీసుకొని రావడంలో బాలగోపాల్ కీలకపాత్ర పోషించారు. చిత్తూరు జిల్లాలో నరేన్ సహకారంతో భూసంస్కరణలు, మిగులు భూమి పంపకాలు, దళిత చైతన్య యాత్రలు నిర్వహించారు. చిత్తూరు జిల్లా వ్యవసాయ ప్రాంతాలు బాగుపడాలి అంటే చెరువులు బాగుపడాలి అని చెరువు చెరువునూ సందర్శించి గ్రామీణ నీటి అవసరాలకై ఉద్యమ నిర్మాణానికి కృషి చేశారు. అడవి ఏనుగులు పంట పొలాలపై పడి దాడులు చేసి వందల ఎకరాల పంటలను ధ్వంసం చేస్తుంటే ప్రభుత్వం ఇది సహజ పరిణామమే అని భావిస్తున్న తరుణంలో ఏనుగుల బారి నుండి రైతాంగాన్ని రక్షించేదుకు

కరపత్రాలు, పుస్తకాలు, పాదయాత్రలు బాలగోపాల్ నాయకత్వంలో జరిగాయి. కడప జిల్లాలో సున్నపురాయి మైనింగ్ కారణంగా విచ్ఛిన్నమవుతున్న కార్మికుల జీవితాల, ప్రకృతి వనరుల రక్షణకూ పరిరక్షణకై చేపట్టాల్సిన చర్యలపై ఊరూరు తిరిగి ప్రచారం చేశారు. వై.ఎస్. రాజశేఖరరెడ్డి తండ్రి రాజారెడ్డి పులివెందులలో ఎరుకలవారి గుడిసెలకు నిప్పుపెట్టి వారి భూములను ఆక్రమించుకొన్నప్పుడు రాజారెడ్డి చర్యలపై కరపత్రం ప్రచురించి బాహ్యప్రపంచానికి వారి నిజ స్వరూపాన్ని బహిర్గతపరిచారు.

పంచాయితీ ఎన్నికలపుడూ, పార్లమెంటు ఎన్నికలపుడూ 1991 తర్వాత అన్ని ఎన్నికలపుడూ "బాంబులు వద్దు, తుపాకులు వద్దు, సాగునీరు కావాలి, తాగునీరు కావాలి" అని గ్రామగ్రామాన పాదయాత్రలు చేసాము. ఓటుహక్కు ప్రజాస్వామిక హక్కు, మన ఓట్లు మనమే వేసుకుందాము అని పెద్దఎత్తున ఎన్నికల ముందు ప్రచారాన్ని కొనసాగించాము. అంతే కాక, ఎన్నికల దినాలలో ఫ్యాక్షన్ గ్రామాలైన బనగానపల్లి, అవుకు, కోయలకుంట్ల, ఆళ్ళగడ్డ, వెంకటాపురం, ధర్మవరం ప్రాంతాలలో ఎలక్షన్ వాచ్ కూడా నిర్వహించి ఎన్నికలలో అక్రమాలను వెలుగులోకి తీసుకువచ్చాము. ఇవన్నీ బాలగోపాల్ నాయకత్వంలో అమలైన కార్యక్రమాలే. ఇవి నాకు గుర్తున్న కొన్ని సంఘటనలు, నిజనిర్ధారణలు మాత్రమే.

## ఫ్యాక్షన్ అధ్యయనానికి ఆద్యుడు

రాయలసీమ చరిత్రకు, రాయలసీమ ప్రజలకు బాలగోపాల్ చేసిన అపార సేవ ఆయన ఒంటి చేత్తో రాసిన మూడు పుస్తకాలు – కర్నూలు పాలెగాళ్ళు, కడపజిల్లాలో కొత్త పాలెగాళ్ళు, కరువు జిల్లాలో పాలెగాళ్ళు. ప్రజా ఉద్యమకారుడే కాక చరిత్ర రచయితగా బాలగోపాల్ ఒక కొత్త మార్గాన్ని ఈ పుస్తకాల ద్వారా నిర్దేశించాడు. చరిత్రను లిఖించేందుకు గ్రంథాలయాలు, వార్తాపత్రికలు, కొంత మంది వ్యక్తుల పరిచయాలు, ముఖాముఖీలు చాలనుకునే యుగంలో ప్రజల దగ్గరకు వెళ్ళి, ప్రజల చరిత్రను నిర్మించాలి అనే ప్రగాఢమైన విశ్వాసంతో ఈ మూడు జిల్లాల్లో వందలాది గ్రామాలను సందర్శించి కొన్ని సమయాలలో అత్యంత సాహసంతో (అనంతపురం జిల్లా విప్లవ పార్టీల రహస్య స్థావరాలలో అర్ధరాత్రులలో అడవులలో మోటారు బైకు ప్రయాణము) ప్రయాణాలు చేస్తూ కొన్ని వందలమంది సామాన్య ప్రజలని, ఇంచు మించుగా ఫ్యాక్షన్ నాయకులందరినీ కలిసి ఈ రచనలు చేసారు. ఈ రోజు చరిత్ర పరిశీలకులకు, పోలీసులకు, సినీ నిర్మాతలకు రాయలసీమ ఫ్యాక్షన్లను అర్థం చేసుకోవాలంటే ఇవే మూల గ్రంథాలు. ఫ్యాక్షన్‌కి కొత్త నిర్వచనాన్ని ఇవ్వడమే కాక ఫ్యాక్షన్ నాయకులను అసహ్యించుకునే చైతన్యాన్ని కల్పించడానికి కోసం ఏర్పడిన రాయలసీమ ప్రజా సమితిలో బాలగోపాల్ ఒక కీలక పాత్ర వహించాడు. రాయలసీమ

భూస్వామ్య సంస్కృతికి వ్యతిరేకంగా జరిగిన ప్రచార పోరాటంలో ముందు భాగాన వుండి రాయలసీమ సామాన్య ప్రజలకు కొత్త ఆశలు చిగురించడానికి కారణభూతుడు అయ్యాడు. మొట్టమొదటిసారిగా రాయలసీమ ప్రజాప్రతినిధులుగా కొనసాగుతున్న రాజకీయ నాయకుల నిజస్వరూపాన్ని అక్షరరూపంగా ప్రపంచానికి తెలియచేయడమే కాక రాయలసీమ ప్రజల పరాధీనతకు కారణాలు సహేతుకంగా ఎత్తి చూపాడు. 1980 నుండి 2005 వరకు సమకాలీన రాయలసీమ చరిత్రలో వచ్చిన రాజకీయ మార్పులు ఏమాత్రం ఫ్యాక్షన్ స్వరూపాన్ని మార్చలేదనీ పైపెచ్చు ఫ్యాక్షన్ సంస్కృతి పెరగడానికి, హింస పెచ్చరిల్లడానికీ దోహదం చేసిందనీ స్పష్టం చేసాడు.

బాలగోపాల్ గురించి సంక్షిప్తంగా రాయడం అసాధ్యమైన విషయం కానీ కొన్ని విషయాలైనా అందరితో పంచుకోవడం ఒక కనీస కర్తవ్యంగా భావించి ఇది రాశాను. వ్యక్తిని కించపరిచే ప్రయత్నాలకు బాలగోపాల్ ఏ రోజూ పాల్పడలేదు. విమర్శలకు జవాబు మన కార్యాచరణ మాత్రమే అని ప్రగాఢంగా విశ్వసించి ఆచరించిన వ్యక్తి బాలగోపాల్. ఆయనంతటి సమన్వయం, నమ్మిన విశ్వాసాలపట్ల నమ్మకం, నిజాయితీ కలిగి ఉండటం ఎవ్వరికీ సాధ్యం కానప్పటికీ బాలగోపాల్ మార్గమే ఆచరణీయం.

# అన్నకు మేమంటే ఎంత ప్రేమో

ఆత్రం భుజంగరావు*

అన్నకు ఆదిలాబాద్ ఏజెన్సీలో రెండు పేర్లున్నాయి. ఒకటి కిట్టనివారు అనేదీ, మరొకటి ఆదివాసులు ఆప్యాయంగా పిల్చుకునేదీ - ఎవరు ఎక్కడ చనిపోయినా వెంటనే ఎగురుకుంటూ వస్తాడని పోలీసులు, అధికారులు 'ఆదివాసీ గద్ద' అని పేరు పెట్టారాయనకు. అన్యాయం జరిగిన వెంటనే అక్కడ ప్రత్యక్షమవడాన్ని సహించలేని వాళ్లనుకునే మాటది. రెండోది 'దగూర్ ఏవుగునోర్ దైవతోర్ మాయినల్' (ఎంతో జ్ఞానం ఉన్న దైవాంశ సంభూతుడు) ఇది ఆదివాసులు గోండి భాషలో ఆయన్ని పిల్చుకునే పేరు.

ఇంద్రవెల్లి ఘటన 1981 ఏప్రిల్ 20న జరిగింది. ఆనాడు పోలీసులు ఎందరో గోండులను కాల్చి చంపారు. ఒక భయానక వాతావరణం నెలకొంది ఆదివాసీ ప్రాంతాలన్నిట్లో. మొదటిసారి అన్న మా జిల్లాకు వచ్చింది అప్పుడే అని విన్నాను. గిరిజన గూడాలన్నీ తిరిగి చనిపోయిన వారి కుటుంబాలకు మనోధైర్యాన్ని ఇచ్చారు. ఆ తర్వాత ఇంద్రవెల్లి సంస్మరణ సభలలో ఎన్నోసార్లు ప్రసంగించారు అన్న. నాటి నుంచి నేటి వరకూ ఆయన మా జిల్లా ఆదివాసుల అన్ని సమస్యలపై నిరంతరం పని చేస్తూనే ఉన్నారు.

కొమురం భీం స్ఫూర్తితో జల్, జంగిల్, జమీన్‌ల కోసం పోరాడుతున్న ఆదివాసులకు అవాంతరాలు ఎదురైన ప్రతిసారీ ఆయన మా చెయ్యి పట్టుకుని ఆ అవాంతరాన్ని దాటిస్తూ వచ్చారు. అటవీ భూములకు పట్టాలు ఇవ్వాలని మేము పోరాటం చేస్తుంటే, ఆ భూములు మాకు చెందకుండా చేయడం కోసం ప్రభుత్వం

* **మానవహక్కుల వేదిక ఆదిలాబాద్ జిల్లా కార్యదర్శి**

ఎన్నో కుంటిసాకులు చెబుతూ వస్తున్న తరుణంలో అటవీ హక్కుల పరిరక్షణ చట్టం వచ్చిందని చెప్పి భూములు మాకు ఇప్పించడానికి అన్న ఎంతో ప్రయత్నం చేసిండు. పర్యావరణ విధ్వంసాన్ని సాకుగా చూపించి ఈ ప్రయత్నానికి కొంతమంది గండికొట్టబోతే వెనువెంటనే అన్న హైకోర్టులో ఆదివాసుల వాణిని వినిపించి అటవీ భూములను ఆదివాసులకు చెందేలా ఆర్డర్ సాధించగలిగారు. పట్టాల పంపిణీకి అడ్డంకుల్ని తొలగించారు. అయినా అటవీ హక్కులు కల్పించినట్లే కల్పించి ప్రభుత్వం మళ్లీ దాన్ని నిలిపివేసింది. ఇప్పుడు దీనిని ప్రశ్నించేందుకు ఎవరూ లేరు. అన్న లేకపోవడంతో ఆదివాసుల గొంతు మూగబోయినట్లు భావిస్తున్నాం.

ఏజెన్సీ ప్రాంతాల రక్షణ చట్టాలను పరిరక్షించవలసిన ఆవశ్యకత గురించి అన్నకు ఉన్న ఆసక్తి మరొకరికి లేదు. ఏజెన్సీ చట్టాల సవరణకు ఎక్కడ ఎటువంటి ప్రయత్నం జరిగినా దానిని నిలువరించడానికి శాయశక్తులా ప్రయత్నించేవారు. చట్ట సవరణలు జరిగితే ఆదివాసుల జీవితాలు పరాధీనమవుతాయనే స్పృహ ఆయనకు ఎల్లప్పుడూ ఉండేది. ఒకసారి ఏజెన్సీ ప్రాంతంలోని స్థానిక సంస్థల ఎన్నికల్లో గిరిజనేతరులు కూడా పోటీ చేసే అవకాశాన్నిచ్చే రోస్టర్ పద్ధతిని ప్రవేశపెడితే దాన్ని నిలిపివేయాలని కోరుతూ హైకోర్టులో కేసు వేసి గెలిచారు. అప్పట్నుంచి స్థానిక సంస్థలలో గిరిజనులు ప్రతినిధులుగా ఉండటం సాధ్యమయ్యింది.

## మాకు జబ్బు వస్తే ముందొచ్చేది ఆయనే

ఆదిలాబాద్ నుంచి పాడేరు, చింతపల్లి వరకూ ఉన్న ఆదివాసీ ప్రాంతాల్లో వైద్య సౌకర్యాలు కనీసస్థాయిలో కూడా లేవనేది అందరికీ తెలిసిందే. ఆదిలాబాద్, విశాఖ ఏజెన్సీ ప్రాంతాల్లో ప్రతి సీజన్‌లోనూ మలేరియా, అతిసార వ్యాధులతో ఆదివాసులు దుర్మరణం పాలవుతున్నారు. ఆదిలాబాద్‌లో 1998లో అతిసార వ్యాధితో ఆదివాసులు పిట్టల్లా రాలిపోయారు. వెంటనే అన్న ఈ ప్రాంతాన్ని పర్యటించి వాస్తవాలను ప్రభుత్వానికి ఒక నివేదిక ద్వారా అంజేశారు. దీనితో ప్రభుత్వం అత్యవసర సేవలకోసం డాక్టర్ల బృందాలను అక్కడకి పంపింది.

ఆయన కృషితోనే ఏజన్సీలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు (పిహెచ్‌సి) మళ్లీ పనిచేయడం మొదలుపెట్టాయి. ప్రత్యేకంగా అంబులెన్స్‌లు వచ్చాయి. పారామెడికల్ కాంపుల నిర్వహణ మొదలయ్యింది. వీటన్నింటి నిర్వహణనీ ఐటిడిఏ చూసుకునేది. అయితే కొన్నేళ్లకు వీటిని ప్రయివేటుపరం చేసే కార్యక్రమంలో భాగంగా గాదిగూడ, లింగాపూర్ పిహెచ్‌సిలను 'కరుణ ట్రస్టు' (తమిళనాడు)కు అప్పజెప్పి ప్రభుత్వం

చేతులు దులుపుకుంది. వెంటనే అన్న స్పందించి ఐటిడిఏ, వైద్యశాఖ అధికారులతో చర్చించారు. దీనిపై హైకోర్టులో పిటిషన్ కూడా దాఖలు చేశారు.

మంచినీరు లభ్యంకాక ఆదిలాబాద్ ఆదివాసుల గొంతెండిపోతుంటే 2004లో అన్న పెద్ద టీంతో వచ్చి ఆ ప్రాంతాలన్నీ పర్యటించారు. మంచినీరు అందించడంలో ప్రభుత్వ అధికారుల నిర్లక్ష్యాన్ని ఎత్తి చూపారు. నీటి నిలువకోసం ఎక్కడెక్కడ మిని చెక్‌డ్యాంలు, కుంటలు, వాటర్ ట్యాంకులు నిర్మించవచ్చో అధికారులకు సూచించారు. నీరు దొరకకపోవడం ఒక సమస్యయితే దొరికిన నీరు కలుషితమైనది కావడం మరో సమస్య. దీని వల్లనే వ్యాధులు ప్రబలుతున్న సంగతిని గుర్తించి ఐదు నుంచి పది గ్రామాలకు నీటిని సరఫరా చేయగలిగే మినరల్ వాటర్ ప్లాంట్లను ఏర్పాటు చేయమని ప్రభుత్వానికి సూచించారు. ఆదివాసీ కమిటీలకు ఒక ట్రాలీ మంజూరు చేసి ఇద్దరు ఉద్యోగులను నియమించి ఆ మంచినీటిని గ్రామాలకు సరఫరా చేసే పద్ధతిని అభివృద్ధి చేయమని సూచించారు. ఆ సూచన మేరకు ప్లాంట్లను ఏర్పాటు చేసారు కానీ వాటి నిర్వహణా లోపాలవల్ల అవి ఇప్పుడు వృధాగా పడి ఉన్నాయి.

మరోసారి 2006లో ఆదివాసులు సుమారు 300 మంది విషజ్వరాలు సోకి మరణించారు. అన్న ఒక్కొక్క గూడెమూ తిరిగి వాస్తవాలను సేకరించి ప్రభుత్వానికి నివేదిక ఇచ్చారు. ప్రభుత్వ నిర్లక్ష్యాన్ని నిరసించారు. యుద్ధప్రాతిపదికపై వైద్య సేవలకోసం డిమాండ్ చేశారు. దీనితో తృప్తి చెందక మిత్రులైన కొంతమంది వైద్యులను తీసుకువచ్చి రక్త నమూనాలను తీయించారు. ఏదో ఒక రకంగా తన ఆదివాసీ మిత్రులను రక్షించుకోవాలని తపన పడ్డారు. పౌష్టికాహారం అందక పిల్లలు, రక్తహీనతవల్ల గర్భిణీ స్త్రీలు మరణిస్తున్నారని ఆ డాక్టర్ల బృందం తెలిపింది. పిల్లల వైద్యుడు డాక్టర్ తిరుపతయ్య (జమ్మికుంట) గారి సహకారంతో అన్న ఒక రిపోర్టును ప్రభుత్వానికి ఇచ్చారు. వెంటనే చర్యలు చేపట్టకపోతే మానవహక్కుల ఉల్లంఘన కింద కోర్టులో దోషులుగా నిలబెడతామని ప్రభుత్వాధికారులందరినీ హెచ్చరించారు. నిమ్మకు నీరెత్తినట్లు కూర్చున్న ప్రభుత్వం ఈ హెచ్చరికతో దిగివచ్చి ఆదివాసీ ప్రాంతాల్లో పౌష్టికాహార కేంద్రాల్ని ఏర్పాటు చేసి డాక్టర్ల పర్యవేక్షణలో దానిని నడుపుతున్నారు.

వ్యాధి నిరోధక శక్తి లేనందువల్లే ఆదివాసులు వ్యాధులపాలవుతున్నారని తేల్చుకున్న తరువాత ఆయన జిల్లా కలెక్టర్, ఐటిడిఏ ప్రాజెక్టు అధికారులతో చర్చించి కొన్ని సూచనలు చేశారు. ఉపాధి హామీ పథకానికి ఇచ్చే నగదును నేరుగా ఇవ్వకుండా నాణ్యమైన నిత్యావసర వస్తువులను ఆదివాసులకు అడ్వాన్సుగా సరఫరా చేయాలన్న అన్న సూచన యిప్పుడు అమలవుతోంది.

## బేర్‌ఫుట్ డాక్టర్ల ఆలోచన సార్‌దే

నివారించతగ్గ వ్యాధుల కారణంగా ఆదివాసులు మరణించడం అన్నను చాలా కలచివేసేది. ఆయన సలహాపై డా. తిరుపతి, ఆయన డాక్టరు మిత్రులు గత ఏడాది ఆదివాసీ విద్యావంతులకు ప్రథమ చికిత్సలో శిక్షణ ఇచ్చారు. మూడు నెలలు థియరీ, రెండు నెలలు ప్రాక్టికల్ శిక్షణను పొందిన 40 మంది 'ఆదివాసీ బేర్‌ఫుట్ డాక్టర్లు' ఇప్పుడు స్థానిక ఆదివాసులకు వైద్యసేవలు అందిస్తున్నారు. మరో 15 మంది శిక్షణలో ఉన్నారు. 'బాలగోపాల్ స్మారక వైద్య శిక్షణ తరగతుల' పేరుతోనే ఈ శిక్షణని ఇచ్చారు. సమాజం కొరకు ఏం చేయమంటారని ఎవరైనా అన్నను సలహా అడిగితే ఆయన వెంటనే ఆదివాసీ సమాజం వైపుకే తనవేలు చూపించారు. తన దగ్గరికి వచ్చిన ఎంతో మందికి ఆయన ఈ సలహానే ఇచ్చినట్లు తెలిసింది.

ఏజెన్సీ ప్రాంతంలో స్థానిక ఉద్యోగాలను ఇతర అభివృద్ధి చెందిన గిరిజనేతరులు హస్తగతం చేసుకోవడం వలన ఆదివాసీ విద్యావంతులు నష్టపోతుండడం చూసి కోర్టు ద్వారా పాత జివోలను సవరింపజేసి 2000లో జి.ఓ. 3ను విడుదల చేయించి ఆదివాసీ ప్రాంత ఉద్యోగాలను ఆదివాసీలకే కేటాయింపచేశారు బాలగోపాల్‌సారు. ఎంతోమంది ఆదివాసీ యువకులు దీని ఫలితంగా ఉద్యోగాలు పొందారు.

ఆదివాసులు నిరంతరం దోపిడీ మోసాలకు గురవుతున్నారనే బాధతో అన్న ఆదివాసీ విద్యావంతులను చేరదీసి చట్టాలపై శిక్షణను ఇప్పించే పనికి పూనుకున్నారు. పల్లా త్రినాథ్‌గారి సహకారంతో ఒక ఏడాదిపాటు ఉట్నూరులో భూములు, ఆదివాసుల హక్కులు, చట్టాలపై శిక్షణా తరగతులు జరిగాయి. ఒకసారి శిక్షణ పొందుతున్న విద్యార్థులను ఉద్దేశించి ప్రసంగిస్తూ మీ చట్టాలనూ, భూములనూ, అడవులనూ మీరే రక్షించుకోవాలి, భావితరాలను మీరే కాపాడుకోవాలని వారికి సూచించారు.

షెడ్యూల్డ్ కులాల వారు ఎస్టీలమీద దాడిచేస్తే అది ఎస్‌సిఎస్‌టీ అత్యాచారాల నిరోధక చట్టంకింద నేరం అవుతుందని నాకు తెలియదు. మా ప్రాంత పోలీసు అధికార్లకీ తెలియదు. ఇలాంటి సంఘటన ఒకటి మా ప్రాంతంలో జరిగినపుడు ఏం చేయాలో తెలియక అన్నను సంప్రదించాను. ఎస్.సిలు ఎస్.టిలపై దాడిచేసినా ఆ చట్టం వర్తిస్తుందని వివరంగా పోలీసు ఉన్నతాధికారులకి ఉత్తరం రాసిచ్చారు. అది చూసిన అధికారులు వెంటనే కేసు నమోదు చేశారు. ఆదివాసుల రక్షణ కోసం రాజ్యాంగంలో ఉన్న అన్ని అంశాలు, చట్టాలు ఆయనకి తెల్సినంతగా మరెవ్వరికీ తెలియవేమో అనిపిస్తుంది.

ఆదిలాబాద్ జిల్లాలో నకిలీ బాబాలను అరికట్టే కార్యక్రమాన్ని 2005లో పోలీసులు చేపట్టారు. ఏజెన్సీ ప్రాంతమైన కడెం మండలం గోడిస్యారల గ్రామానికి

చెందిన గోండు తెగ పూజారి ఒకరిని ఇందులో భాగంగా అరెస్టు చేసి కేసు పెట్టారు. నిజానికి ఆయన నకిలీ బాబాకాదు. ఒక వకీలు ఆయన వద్ద ముందస్తు బెయిల్‌కోసం 90 వేల రూపాయలు గుంజుకొని హైద్రాబాద్‌లో మరో వకీలు వద్దకు పంపాడు. ఆయన మరో లక్షా నలభైవేలు కావాలన్నాడు. ఆదివాసీ పూజారికి అంత డబ్బు ఎక్కడిది? ఆరు రోజులు అటూ ఇటూ తిరిగి ఎవరి సలహాపైనో నాదగ్గరకు వచ్చారు. బాలగోపాల్‌గారి వద్దకు పంపించాను. ఆయన కేవలం 360 రూపాయలకే మూడు రోజుల్లో ముందస్తు బెయిలు ఇప్పించారని ఆ పూజారి నాకు ఆ తర్వాత సంతోషంగా చెప్పాడు. అన్న ఫీజు విషయం చెప్పినపుడు పూజారి తండ్రి, ఆయనెంబడి వెళ్లిన వాళ్లు బయటికి వచ్చి గుండెల మీద చెయ్యేసుకుని 'ఏందిరా ఇది, నిజమా అబద్ధమా? 90 వేలు తీసుకున్న వకీలు పని చేయలేదు. ఒక లక్షా 40 వేలు తీసుకుంటానన్న వకీలు ఇంత మాట్లాడలేదు. ఈయన 360 రూపాయలకే బెయిలు తీస్తానన్నాడు. ఏందిరా ఇది' అని ఆశ్చర్యపోయారట. ఆదివాసీ సాంస్కృతిక సాంప్రదాయాలకు ఆటంకం కలిగించడం చట్టరీత్యా నేరమని వివరిస్తూ జిల్లా అధికారులకు ఆయన ఒక లేఖ కూడా రాశారు. అప్పటినుండి ఆదివాసీ పూజారుల జోలికి పోలీసులు ఎప్పుడూ రాలేదు.

ఒకటి కాదు రెండు కాదు, వేల ఆదివాసీ సమస్యలపై ఆయన పనిచేశారు. న్యాయవాదిగా, హక్కుల కార్యకర్తగా ఆయన తొలి ప్రాధాన్యం ఆదివాసులే, మేమే.

మా ఆత్మబంధువూ, మా 'డగూర్ ఏవుగునోర్ దైవతోర్ మాయినల్' మాకంటె దుర్బలులైన ఎవరి రక్షణ కోసమో మరోచోటికి ఎగిరి వెళ్లిపోయాడా? మా కొమురం భీం జోడెఘాట్‌లో వనవాసిగా పుట్టడానికి తొందరపడి నిష్క్రమించాడా? అన్నా... అక్కడ పుట్టిన ప్రతి శిశువులోనూ నీ పోలిక కోసం వెతుక్కుంటాం.

# రిటర్న్ టికెట్ నేను తీసుకోలే... ఆయనే వెళ్ళిపోయాడు

కె. జయశ్రీ*

**రా**యడమే రాని నాకు సార్ గురించి రాయాలంటే బ్రహ్మప్రళయంగా వుంది. 1988 జనవరిలో కడపలో ఎ.పి.సి.యల్.సి ఏర్పడింది. సార్ ఎవరో ఎపిసియల్సి అంటే ఏమిటో నాకు తెలియదు. కేవలం అన్నలకు లాయర్గా వున్న పరిచయం వల్లనే నేను కమిటీలోకి రావడం జరిగింది. పోలీసుల వేధింపులపై కోర్టులోపలా బయటా ప్రశ్నించడం లాంటి పనులు చేయగలిగిన లాయర్ ప్రెసిడెంట్గా వుంటే బాగుంటుందని సార్ అన్నారు. ఇద్దరమే లాయర్లం ఉన్నాం. రెండో అతను ముందుకు రాకపోవడంతో సార్ నన్ను అడిగారు. నా గుండె జబ్బు, ఎక్కడికీ తిరగలేని పరిస్థితి, ఎం.వి. రమణారెడ్డికి అడ్వకేటుగా పనిచేయడము.... సకల సుగుణాలు చెప్పినాను. అయినా ఎవ్వరూ లేనందున నన్నే తీసుకున్నారు.

ఆ తర్వాత సార్ మాతో పనిచేయించడానికి పడిన కష్టం అంతా ఇంతా కాదు. ఉదయాన్నే వచ్చి నేను నిద్ర లేచి రెడీ అయ్యేంతవరకు అంటే దాదాపు 9 గంటల వరకు వెయిట్ చేసేవారు. ఆ తర్వాత విషయం చెప్పి, నాకు అర్థము చేయించి, అందుబాటులో వున్న వాళ్లను పిలుచుకొనిపోయి నిజనిర్ధారణ చేసి పత్రికా ప్రకటనలు ఇచ్చి నన్ను ఇంట్లో దిగబెట్టి తన ప్రయాణం చూసుకొనేవారు. మొదట్లో ఆయన రాకపోకల గురించి ముందుగా తెలిసేది కాదు. పత్రికలవల్లనో ఎవరిద్వారానో తెలిసిందనో తనంతకుతాను వచ్చి మా నిద్రకు భంగం కాకూడదని తెల్లవారే వరకు బయటనే వుండి పూర్తి తెల్లవారాక వచ్చేవాడు. మాకు ఈ విషయాలు అర్థమైన

---

* **మానవహక్కుల వేదిక కడప జిల్లా కన్వీనర్, ప్రొద్దుటూరు**

తరువాత చాలా నిష్ఠూరం పడినాకనే ఆయన ఏ సమయంలోనైనా ఇంటికి నేరుగా రావడం మొదలుపెట్టాడు.

ఒకసారి తాడిపత్రి బస్టాండులో అర్థరాత్రి ఉండిపోవాల్సి వచ్చింది. న్యూస్‌పేపర్ ఇచ్చి బెంచిమీద పడుకోమంటే నేను ఏంది సార్ ఇక్కడ పడుకోమంటారా అంటే సరే కూర్చో నా బ్యాగ్ చూడు అని అన్నాడు. ఏముంది ఆ బ్యాగులో పాత బట్టలు తప్ప అని నేనంటే భలేదానివే నా పుస్తకాలూ, డైరీ పోతే ఎలా అని ఆయన అమూల్యమైన ఆస్తి గురించి బాధపడినాడు. సంస్థ ఏర్పాటు చేసిన కొత్తల్లోనే స్థానిక సమస్యలపై తన కొరకు ఎదురు చూడకుండా స్వతంత్రంగా పనిచేయమని చెప్పేవాడు. అప్పటికి ఫోన్‌లు లేవు. ఉత్తరాలు రావడం చాలా ఆలస్యం.

## ధర్నా ధర్మాన..

ప్రొద్దుటూరులో మహిళల వేధింపులు, వరకట్న చావులకు వ్యతిరేకంగా పని చేయడం మొదలుపెట్టిన వెంటనే ఏపిసియల్‌సికి సభ్యుల సంఖ్య పెరిగింది. స్థానికంగా ఉన్న పేదల ఇళ్ల పట్టాల సమస్యపై ధర్నా చేయాలని ఒకసారి నిర్ణయించుకున్నాం. అప్పటికి నాకు ధర్నా అంటే ఏంటో తెలీదు. కలెక్టరేట్ ఎదుట ఓ షామియానా టెంట్ వేసి, బాధితులతో కలిసి కొంతసేపు నినాదాలు, ఆ తర్వాత ఉపన్యాసాలు... చివరగా కలెక్టరుకు వినతిపత్రం ఇవ్వడంతో ఆ కార్యక్రమం ముగియడం చూశాను. ఓ టెంటు... నినాదాలు, ఉపన్యాసాలు, వినతిపత్రం ఓస్... ఇంతేనా ధర్నా అంటే అని అనుకున్నాను. ఆ తర్వాత జిల్లాలో రాడికల్ సభలకు పోలీసులు అనుమతి నిరాకరించినపుడు వెంటనే ధర్నా గుర్తుకొచ్చింది. చకచకా ఏర్పాట్లు చేసుకున్నాం. జిల్లా యస్.పి. కార్యాలయం ఎదుట ధర్నాకు టెంటు వేశాం. ధర్నా మొదలయ్యీ కాకముందే పోలీసు పటాలం వచ్చింది. మమ్మల్నందరినీ వ్యాన్‌లో పడేసి పోలీస్‌స్టేషన్‌కు తరలించారు. పట్టణంలో వెంటనే పోలీస్ కవాతు జరిగింది. కేసులు పెట్టారు. మాలో చాలామందిని పోలీసులు బెదిరించారు. దీంతో ఏపిసియల్‌సి సభ్యత్వం టపాటపా పడిపోయింది. చాలామంది రాజీనామాలు చేశారు. అప్పుడుగానీ దేనికి ధర్నా చేయాలో దేనికి చేయకూడదో బోధపడలేదు.

ఆరోజు నుంచి యస్.పి.కి, ఏపిసియల్‌సికి మధ్య స్టేట్‌మెంట్ వార్ జరిగింది. అప్పటికే అన్నలు పనిచేస్తున్న రాయచోటి, లక్కిరెడ్డిపల్లె ప్రాంత ప్రజలపై పోలీసుల దాడుల గురించి బాలగోపాల్ అప్పటి కడప ఎస్పీ కెప్టెన్ కె.వి. రెడ్డిని ప్రశ్నించారు. నక్సలైట్ల రాజకీయాలపై ఎస్పీ రాజకీయ వ్యాఖ్యానాలు చేయడంతో బాలగోపాల్ చాలా సీరియస్ అయ్యారు. యూనిఫాంలో ఉన్నంతవరకూ నీ డ్యూటీ శాంతి భద్రతలను పరిరక్షించడమే. రాజకీయాలు చర్చించాలనుకుంటే యూనిఫాం తీసేసి బయటకు

వచ్చి మాట్లాడు అంటూ చాలా తీవ్రంగా అన్నారు. ఆయనలో అంత తీవ్రత ఉంటుందని అంతవరకూ ఊహించనైనా లేదు. 1990 ఫిబ్రవరిలో పులివెందులలో వై.యస్. రాజారెడ్డి ఎరుకలవారి ఇండ్లను తగలపెట్టి డైనమెట్లతో కూల్చివేసిన ఘటనపై బాలగోపాల్‌సార్ రాకముందే మేము నిజనిర్ధారణ చేసాము. రాజారెడ్డి చర్యలను నిరసిస్తూ పులివెందులలో బహిరంగ సభ పెట్టాలని నిర్ణయించుకున్నాము. సార్ మీటింగుకు వచ్చాడు. మైకు, బ్యాటరీ, షామియానా, గుంజలు అన్నీ ప్రొద్దుటూరులో తీసుకొని జీపులో పులివెందులకు బయలుదేరాము. గుంజలు పాతి, షామియానాకట్టి, మైకుపెట్టి, లైబ్రరీ అరుగుపై మీటింగు పెట్టాము. మీటింగు ప్రాంగణమంతా పోలీసులతో నిండిపోయింది.

వైయస్ అకృత్యాలతోపాటు పోలీసుల దురాగతాలను విమర్శిస్తూ సభ జరిగింది. మీటింగ్ అయిన తర్వాతరోజు కడప పోలీసు సంఘం ప్రెసిడెంటు 'బాలగోపాల్! మేము రక్షణ కల్పించకపోతే పులివెందుల పొలిమేరలు దాటేవాడివా! ఆ కృతజ్ఞత కూడా లేకుండా మమ్మల్నే విమర్శిస్తావా అని ప్రకటన ఇచ్చాడు. మీ సాయం లేకుండా మీటింగు జరుపుకోలేని పరిస్థితి ఉందంటే మీ అసమర్ధతే కదా. ఒక్క ఏ.పి.సి.యల్.సి. రక్షణే కాదు మొత్తం పౌరులందరి శాంతి భద్రతలు కాపాడడం మీ కర్తవ్యం. మీ కర్తవ్యం మీరు నిర్వహించినందుకు కూడా కృతజ్ఞతలు పొందాలనుకోవడం మీ దౌర్భాగ్యం అని జవాబు ఇచ్చాడు సార్. ఏ.పి.సి.యల్.సి. కోసం ఎవరు ఎంత చిన్న పని చేసినా ఆయన సంతోషించేవాడు. తనకోసం ఎదురు చూడకుండా మా అంతకు మేము చొరవ తీసుకొని పనిచేసినపుడు ఆయన సంతోషం మరింత ఎక్కువయ్యేది. పులివెందుల సమస్య తర్వాత నేను హైదరాబాద్ పోయినప్పుడు ప్రత్యేకంగా సెక్రటేరియట్ వద్ద ఉన్న ఫిష్ క్యాంటిన్‌లో బిర్యాని తినిపించాడు. అరుదైన ఆయన మెచ్చుకోలు ఎప్పటికీ గుర్తుండే జ్ఞాపకం.

## ఆధిక్యం మచ్చుకైనా చూపేవాడు కాదు

అవగాహన రీత్యాగానీ, కష్టనష్టాలకు ఓర్చుకొనే విషయంలో గానీ బాలగోపాల్‌కూ మాకూ మధ్య చాలా తేడా వుండేది. అయితే ఆ దూరాన్ని ఎప్పుడూ కనపడనిచ్చేవాడు కాదు. పనిలోనేకాదు, వ్యవహార సరళిలోనూ ఎక్కడా తన ఆధిపత్యం మచ్చుకైనా కనపడేదికాదు. బాలగోపాల్ పరిచయం అయ్యాక చాలాకాలం ఆయన్ని బాలగోపాల్ అనే పిలిచేదాన్ని. అనంతపురం శేషయ్యను మాత్రం సార్ అని పిలిచేదాన్ని. ఒకసారి బాలగోపాల్ ఈ విషయం అడిగాడు. ఆయన పెద్దాయన కాబట్టి సార్ అని పిలుస్తున్నాను అని నేను చెప్పిన సమాధానానికి బాలగోపాల్ చాలాసేపు నవ్వాడు. అతను నాకన్నా చాలా చిన్నవాడు అని చెప్పాడు. అలాగే స్థానిక లారీ వర్కర్

యూనియన్ సభ్యులు సార్ కంటే నేనే ఎక్కువ అనుకునేవారు. మీ డ్రెస్‌వల్ల వాళ్ళు మిమ్మల్ని అలా అనుకుంటున్నారు, మంచివి వేసుకోవచ్చు కదా అంటే డ్రస్సుతో వచ్చే గుర్తింపు నాకు అక్కర్లేదు అనేవాడు. అంతకు మించి వారితో కలిసి పోవడాన్ని ఎంజాయ్ చేసేవాడు. మామూలు జనం దగ్గర, కార్యకర్తల దగ్గర ఎంత సాధారణంగా ఉన్నా అవసరమొచ్చిన చోట అవసరమైనప్పుడు అంతఅసాధారణంగా స్పందిస్తాడు. ఈ రెండు పనులు అత్యంత సహజంగా చేయడమే ఆయన గొప్పతనం. అన్నలతో నాకున్న పరిచయం ఏ.పి.సి.యల్.సి. పనికి ఇబ్బంది కాకుండా చూసుకోమంటూ తరచూ చెప్పేవాడు. అప్పట్లో నాకదేమీ అర్థమయ్యేది కాదు. "ప్రజలకు ఉపయోగపడాలంటే ఏ.పి.సి.యల్.సి.ని స్వతంత్రంగా వుండనివ్వండి. అన్నల పరిచయాలను ప్రదర్శించుకోవడానికి ఏ.పి.సి.యల్.సి. వేదిక కాదని" అప్పటికీ చెప్పేవాడు. అన్నల మీద పోలీసులు ఏ స్థాయిలో హింస జరిగినా వస్తావు కానీ అన్నల పరిచయం వద్దంటావేం అని నా సణుగుడు. చాలాకాలం తర్వాత చాలా అనుభవాలు అయ్యాక కాని నాకు తత్వం బోధపడలేదు. తుపాకిగొట్టం ద్వారా రాజ్యాధికారం అన్న స్లోగన్ చూసి అన్నలు కూడా ఎన్నికల్లో నిలబడి మా లీడర్ల మాదిరిగా రిగ్గింగ్ చేసుకోవచ్చుకదా అని అడిగాను ఒకసారి. సార్‌కు మొదట నా ప్రశ్న అర్థం కాలేదు. ఆశ్చర్యపోయి చాలాసేపు నవ్వి రాజ్యాధికారం ప్రజలకు కావాలి గాని అన్నలకు కాదు అన్నాడు.

కడప జిల్లాకు సంబంధించి మేము చేసిన ముఖ్యమైన పనుల్లో ఫ్యాక్షనిజంపై పరిశీలన ఒకటి. నా దగ్గరకు వచ్చే అన్ని కేసుల్లో బాధితులకు వ్యతిరేకంగా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఫ్యాక్షనిస్టులు వుండేవారు. ప్రొద్దుటూరు ప్రక్కన మాచనపల్లెలో భార్య ఎదుటే భర్తను కొట్టి, ట్రాక్టరుతో తొక్కించి చంపి శవాన్ని కాల్చేసినా ఆ భార్య మాత్రం నా భర్త బతికే ఉన్నాడంటూ వాంగ్మూలం ఇచ్చింది. దానికి కారణం ఏమిటంటే ఆమె ఇద్దరు కొడుకుల్లో ఒకరిని స్థానిక ఎమ్మెల్యే మనుషులు కిడ్నాప్ చేసి అలా చెప్పించారు. ఈ కేసులో బాధితులతో మాట్లాడాక సార్ చాలా కదిలిపోయాడు. అలాగే ఎపుడో ఆస్తిలో భాగం పంచుకుపోయిన అన్న కొడుకు చిన్నాన్నను, అత్తలను స్థంభానికి కట్టేసి వారి వాటా ఆస్తిని కూడా బలవంతంగా రాయించుకొన్న కేసులో స్థానిక ముఠా రాజకీయ నాయకుల వైఖరికి ఆశ్చర్యపోయాడు. వీటన్నింటినీ ఎండగడుతూ సార్ రాసిన కరపత్రాలు అప్పట్లో అక్కడ పెద్ద సంచలనం. ఇలాంటి కేసుల్లో పనిచేస్తున్న క్రమంలోనే రాయలసీమ ప్రాంత అభివృద్ధికి, ఇది ఆటంకంగా ఉందని, ముఠానాయకుల హింసను వ్యతిరేకించడం కూడా పౌరహక్కుల ఉద్యమ కర్తవ్యమేననే అవగాహన ఏర్పడింది. కర్నూలు జిల్లా

పాలెగాళ్ళ సమస్యను తీసుకున్నపుడు 'ఫ్యాక్షన్ హింసను వ్యతిరేకించడం హక్కుల సంఘాల అజెండాలో చేరడానికి కారణమైన మీరు కూడా కర్నూలు జిల్లా ఫ్యాక్షనిస్టులపై చేస్తున్న నిజనిర్ధారణకు హాజరైతే బాగుంటుంది' అంటూ బాలగోపాల్ రాసిన ఉత్తరం ఏ.పి.సి.యల్.సి. పనిలో నాకు చాలా తృప్తినిచ్చిన జ్ఞాపకం.

## 'కండక్టర్'సార్

కర్నూలు జిల్లా పాలెగాళ్ళ పుస్తకం వచ్చాక కడపజిల్లా ఫ్యాక్షన్లపై చాలా విస్తృతంగా తిరగాల్సి వచ్చింది. అన్నలనుంచి బయటికి వచ్చి పునరావాసం క్రింద జీపు నడుపుకొనే ఓ మిత్రుడు ఉండేవాడు. జీపు ఓనర్ కమ్ డ్రైవర్. సార్ వచ్చిన ప్రతిసారీ అద్దె లేకుండా జీపు ఇచ్చేవాడు. డీజల్ మాత్రం మేము పోయించేవాళ్ళం. మేము మహా అయితే ముగ్గురు నలుగురం ఉండేవాళ్ళం. ఆ జీపు టెన్ సీటర్. ఖాళీగా పోవడం ఎందుకూ, ఎవరినైనా ప్యాసింజర్లను ఎక్కించుకుంటే ఆ డబ్బు డీజిల్‌కైనా వస్తుంది కదా అనేవాడు ఆ జీపు మిత్రుడు. అలా అతను జీపు నడుపుతుంటే, సార్ ప్యాసింజర్లను ఎక్కించుకుని వారినుంచి డబ్బులు వసూలు చేసే కండక్టర్ అయ్యేవాడు. దానిమీద ఎన్ని జోకులో. ఎపిసియల్‌సికి ప్రయోజనకరమనుకున్న ఏ పని చేసేందుకయినా బాలగోపాల్ సంశయించేవాడు కాదు. అది కండక్టరు పని అయినా, కరపత్రాలు పంచడం అయినా, పోస్టర్లు అంటించడమైనా... ఏదీ ఆయనకు తక్కువ పనులు కావు. చిన్నవీ కావు. కాశ్మీర్‌పై నివేదికను ఎంత శ్రద్ధగా రాసేవారో – ఓ వరకట్న బాధితురాలి కరపత్రాన్నీ అంతే శ్రద్ధగా రాసేవారు.

## వై.ఎస్‌ను కలిసినపుడు

పాలెగాళ్ళ నివేదిక రూపొందించే క్రమంలో మేం చాలా విస్తృతంగా తిరిగాం. దాదాపు అందరు ఫ్యాక్షనిస్టులను కలిశాం. నాయకులుగా చలామణిలో ఉన్న ఫ్యాక్షనిస్టులతో మాట్లాడేటప్పుడు బాలగోపాల్ చాలా షార్ప్‌గా రియాక్టు అయ్యేవారు. ఆయన మాటల్లో ఎదుటివారి నోరు టక్కున మూయించే పదునే కాదు తెగువా కనిపించేది. మనం ఏమి మాట్లాడుతున్నాం అన్న అంశం తప్ప ఎవరితో మాట్లాడుతున్నాం అన్న అంశాన్ని పట్టించుకున్న దాఖలాలు ఎప్పుడూ కనిపించలేదు. అందర్నీ కలిసినట్టే పులివెందులలో వై.యస్. రాజశేఖరరెడ్డిని కలిశాం. జిల్లాలో ఫ్యాక్షన్ రాజకీయాలను కొత్త పుంతలు తొక్కించిన రాజశేఖరరెడ్డి తన వాదనను చెపుతున్నాడు. మేం మధ్య మధ్యలో ప్రశ్నలు అడుగుతూ వున్నాం. ఆయన తండ్రి రాజారెడ్డి స్థానిక ఎరుకలవారి ఇళ్ళను కూల్చేసిన అంశం ప్రస్తావనకు వచ్చింది. దానికి "అవును, మా నాన్న బాగా ఆవేశపరుడు. కళ్లెదుట అన్యాయం జరుగుతుంటే

సహించలేదు. ప్రత్యక్ష చర్యలకు పూనుకుంటాడు. అదే నక్సలైట్లలాగా అన్నమాట..." అంటూ తన తండ్రి చర్యను సమర్థించుకున్నాడు వై.యస్. ఆ సమయంలోనే రాజశేఖరరెడ్డి కొడుకు జగన్ సింహాద్రిపురం పోలీసుస్టేషన్‌పై దాడిచేసి తన మిత్రులను విడిపించుకుపోయాడన్న వార్త పేపర్లో రిపోర్టు అయ్యింది. ఈ విషయం ప్రస్తావనకు వచ్చినప్పుడు "అవును, అక్కడ పోలీసులు కొందరిని అక్రమంగా నిర్బంధించారు. మావాడు వెళ్ళి వారిని విడిపించుకొచ్చాడు. పౌరహక్కుల సంఘాలలో మీరు చేసే పనినే మా అబ్బాయి చేసాడు" అని సమర్థించుకున్నాడు. "ప్రభుత్వం, పోలీసులు కలిసి నక్సలైట్లను కాల్చి చంపుతారు. హక్కుల సంఘాలవారిపై తప్పుడు కేసులు పెడతారు. కాని మీ ఇంట్లో వాళ్లపై ఈ రెండూ జరగలేదు కదా" అంటూ బాలగోపాల్ బదులిచ్చారు. అటువైపు నుంచి జవాబు లేదు. మేం బయటకు వచ్చేటప్పుడు వై.యస్. రాజశేఖరరెడ్డి హరగోపాల్‌ను మాత్రం అక్కడ ఉన్న వారికి "ఈయన పెద్దమనిషి, గౌరవస్తుడు" అని పరిచయం చేస్తూ బాలగోపాల్ గురించి ఏం మాట్లాడలేదు. "వై.యస్. పార్లమెంటేరియన్, ఆయన తండ్రి నక్సలైటు, కొడుకు పౌరహక్కుల సంఘం. వై.యస్. ఇంట్లోనే అన్ని సంఘాలు వున్నాయి. మనకు ఏమీ మిగల్లేదు" అంటూ హరగోపాల్ వేసిన జోక్‌కు నవ్వుకుంటూ తిరుగు ప్రయాణం అయ్యాం.

తర్వాత ప్రొద్దుటూరులో ఎం.వి. రమణారెడ్డిని కలిశాం. ఆయన కవి, రచయిత. ట్రేడ్‌యూనియనిస్ట్. వామపక్ష రాజకీయాలనుంచి పార్లమెంటు రాజకీయాల్లోకి వచ్చిన నాయకుడు. ఒక ఫ్యాక్షనిస్టుకు ఇన్ని అదనపు అర్హతలు ఉంటే పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించుకోవచ్చు. తన రాజకీయ ప్రస్థానాన్ని ఆయన తనదైన శైలిలో చెప్పుకుంటూ వచ్చాడు. నిజంగా రమణారెడ్డి ఫ్యాక్షనిస్టు కాదేమో అని మనకు అనిపించేంత చాతుర్యంతో మేధోఅహంభావం తొణికిసలాడుతుండగా వాదనలు చెప్పుకుంటూ వచ్చాడు. అంతా విన్నాక చివర్న బాలగోపాల్ చాలా నెమ్మదిగా కుటుంబ ఖర్చులకు మీ ఆదాయ వనరు ఏమిటి అని అడిగాడు. అప్పుడాయన ఎంత విలవిలలాడాడో ఇప్పటికీ నాకు బాగా గుర్తు. కనీసం చెప్పుకునేందుకు రాజశేఖరరెడ్డికి ముగ్గురాయి గనులూ, వరదరాజుల రెడ్డి, గుండ్లకుంట శివారెడ్డి లాంటి వారికి వ్యవసాయ భూములూ ఉన్నాయి. ఆదాయ వనరుగా చెప్పుకునేందుకు ఏమీలేని వ్యక్తి ఎం.వి. రమణారెడ్డి. బాలగోపాల్ అడిన చిన్న ప్రశ్న అంతవరకు ఆయన ఒలకబోసిన మేధోతనాన్ని వెలవెలబోయేటట్లు చేసింది.

మొన్నటి 2009 ఎన్నికలప్పుడు ఎమ్మెల్యే డి.యల్ రవీంద్రారెడ్డిని కలిశాం. రవీంద్రారెడ్డి మాతో మాట్లాడుతూ "నక్సలైట్లు రావాలి. అప్పుడు కానీ ఈ ప్రాంతం బాగుపడదు. అయినా ఇప్పుడు వాళ్లు కూడా చెడిపోయారంట కదా" అన్నాడు.

రవీంద్రారెడ్డి మాట పూర్తయ్యీ కాకముందే "అది మీ అదృష్టం" అన్న మాటలు బాలగోపాల్ నుంచి దూసుకొచ్చాయి. ఒక్క మాటలో ఎన్ని జవాబులో! ఎదుటి వ్యక్తి ఎంతటి వాడైనా అవసరమైనప్పుడు చాలా షార్పుగా రియాక్టు అయ్యేవాడు బాలగోపాల్.

## హక్కులనేత నోట నిషేధం మాట!

కడప జిల్లా ఫ్యాక్షన్లపై చాలా పల్లెలు తిరిగాము. చనిపోయిన కుటుంబాల వారినీ, కేసుల్లో యావజ్జీవ కారాగార శిక్ష అనుభవిస్తున్న ఖైదీల కుటుంబాలవారినీ, తగలబడిపోయి మొండి గోడలతో మిగిలిన గ్రామాలనూ ఇలా ఫ్యాక్షన్ మిగిల్చిన విషాదాలను చాలా చూశాం. ఈ క్రమంలో బాలగోపాల్ ఒకమాట అన్నాడు. సివిలైజేషన్ ఇన్ బీహార్ అన్న పుస్తకం తెలుగులో రాకుండా చూడాలి. తెలుగులోనైనా, ఇంగ్లీషులోనైనా రాయలసీమలో ఆ పుస్తకాన్ని నిషేధించాలి అని అన్నారు. ఒక హక్కుల నేత ఒక పుస్తకాన్ని నిషేధించాలి అనడం అక్కడున్న కొందరికి ఆశ్చర్యం అనిపించింది. "రాయలసీమ ముఠాకక్షల్లో ఇప్పటికే అంతులేని హింస వుంది. దానికి తోడు బీహార్‌లో ఉన్న క్రొత్త క్రొత్త పద్ధతులను ఇక్కడివారు తెలుసుకుంటే పౌర సమాజానికి జరిగే నష్టం మరింత ఎక్కువగా ఉంటుంది". అంటూ వివరణ ఇచ్చారు. బీహార్ పద్ధతులు ఇక్కడ పరిచయం కాకపోయినా, నక్సలైట్ల పద్ధతులు ఫ్యాక్షన్‌లోకి ప్రవహించడం, టి.వి. బాంబులు, కారుబాంబులు వగైరా కొత్త పోకడలతో ముఠా ఘర్షణలు మరింత రక్తసిక్తం కావడం మనం అనంతపురం జిల్లాలో చూశాం. ముఠా సంస్కృతి, ప్రభావాల కారణంగా స్థానిక ప్రజా సమస్యలపై వివిధ సంఘాల ఫోకస్ తగ్గిపోవడాన్ని కూడా ఆయన గమనించారు.

ప్రొద్దుటూరు సమీపంలోని మాలెపాడు గ్రామంలో కలుషిత నీటివల్ల 30 మంది చనిపోతే జిల్లా వ్యాపితంగా ఒక్క ఆందోళనా లేకపోవడం ఆయన్ను చాలా బాధించింది. సమీపంలోని ఆర్‌టిపిపి (రాయలసీమ థర్మల్ పవర్ ప్లాంటు) నుంచి వచ్చే కలుషిత నీరు మాలెపాడు తాగునీటి కాల్వలో చేరడం ఈ మరణాలకు కారణం. ఒకే గ్రామంలో 30 మంది చనిపోతే ఆ వార్తను పత్రికలు కూడా జిల్లా పేజీలకే పరిమితం చేయడం మరింత దుర్మార్గం అని అన్నాడు. ఇక్కడ నుంచి విజయవాడ వెళ్ళి అక్కడ ప్రెస్‌మీట్‌లో మాలెపాడు సంఘటనను వివరించి ఆ వార్తను జిల్లాకే పరిమితం చేసిన పత్రికల వైఖరిని ఎండగట్టారు. దీంతో ఆ తర్వాత ఆ సంఘటనపై 'ఈనాడు' స్టేట్ పేజీలో వార్త ఇచ్చింది. ఈ సమస్యపై బాలగోపాల్ హైకోర్టులో వేసిన పిటిషన్ ఫలితంగా ఆర్‌టిపిపి కలుషిత నీరు గ్రామ తాగునీటి వనరుల్లో కలవకుండా చూశారు.

మిగతా జిల్లాల పరిస్థితికి కడప జిల్లా పరిస్థితికి చాలా తేడా వుంది. ఇక్కడ ముఠా రాజకీయాల చుట్టూనే అందరూ తిరుగుతూ ఉంటారు. ప్రజా సమస్యలపై సీరియస్‌గా పనిచేసేవారు తక్కువ. కాబట్టి కడప జిల్లాలో మనం మరింత ఎక్కువగా పనిచేయాలి, ఏ.పి.సి.యల్.సి.ని సంస్థాగతంగా మరింత బలోపేతం చేయాలి అన్న బాలగోపాల్ మాటలు ఇప్పటికీ గుర్తున్నాయి.

ఊకదంపుడు ఉపన్యాసాలు, సిద్ధాంత రాద్ధాంతాలు ఏమీ లేకుండానే, మనచుట్టూ జరిగే సంఘటనల నేపథ్యంలోనే క్లిష్టమైన విషయాలను విపులీకరించడం, ఆచరణకు సంబంధించి ఒక స్పష్టత ఇవ్వడం నిరంతరం జరిగేది. నేను కమ్యూనిజం గురించి చదవలేదు. చదివినా అర్థంకాదు. రాయడం అలవాటు లేదు. సభల్లో పెద్దగా మాట్లాడలేను ఇవన్నీ లేకుండా ఆర్గనైజేషన్ పని ఏం చేయగలనని మథనపడేదాన్ని. దానికి బాలగోపాల్ అవన్నీ మరచిపో, మనకు ఎంత పాండిత్యం ఉందన్నది ముఖ్యం కాదు. ప్రజలకు ఏమేరకు ఉపయోగపడుతున్నాం. ఎంత నిజాయితీగా ఉన్నాం అన్న విషయాలే ప్రధానం అంటుండేవాడు.

అన్నల నుంచి బయటకు వచ్చిన వారి ఆచరణ చూసి బాలగోపాల్ ఆశ్చర్యపోయేవాడు. "వీళ్ళు పార్టీలో ఏమి నేర్చుకుంటున్నారు? బయటకు వచ్చీ రావడంతోనే పార్టీ విధానాలకు పూర్తి భిన్నంగానేకాదు, సాంఘిక వ్యతిరేక శక్తులుగా ఎలా మారుతున్నారు? డబ్బు సంపాదన యావ మామూలు వారిలో కన్నా 'పార్టీ' నుంచి బయటకు వచ్చిన వారిలో ఎందుకు ఎక్కువ ఉంటోంది?" అంటూ ఆశ్చర్యపోయేవాడు. ప్రజలకోసం పనిచేసేవారు నిజాయితీగా విమర్శ, ఆత్మవిమర్శ చేసుకోవాలని చెప్పేవాడు. అలాకాకుండా విమర్శకే పరిమితమైనవారినీ, ఇతరులు అడుగుతున్నారు కాబట్టి ఒప్పుకుంటామనే వారినీ ఎద్దేవా చేసేవాడు.

చంద్రబాబుపై అలిపిరి వద్ద జరిగిన దాడి తర్వాత ప్రభుత్వం విపరీతమైన నిర్బంధాన్ని అమలు చేసింది. అప్పుడు బాలగోపాల్‌తో కలిసి నిజనిర్ధారణకు వెళ్లాం. పోలీస్ అత్యాచారాలను వ్యతిరేకించకపోతే పోనీ, కనీసం మమ్మల్ని కలిసి విషయాలు చెప్పేందుకు కూడా అక్కడున్న ప్రజాసంఘాల బాధ్యులు ముందుకు రాలేదు. ఈ సంఘటన బాలగోపాల్‌ను కలవరపరచింది. పోరాటాలు, త్యాగాలు అంటూ ఉపన్యాసాలు ఇచ్చేవారు ఇబ్బందికర పరిస్థితులు వచ్చినపుడు ఎవరి పాటికి వారు భద్రత చూసుకుంటూ మిగిలిన వారిని పట్టించుకోకుండా వుండటాన్ని దురదృష్టకరంగా భావించాడు.

## కుటుంబ సభ్యుడిలాగే ఉండేవాడు

నా కొడుకు నాలుగేళ్ల వయస్సున్నప్పటి నుంచి బాలగోపాల్ మా ఇంటికి వచ్చేవాడు. వాడు అడిగే ప్రశ్నలకు ఓపికగా జవాబు చెప్పేవాడు. చిన్నప్పుడు మావాడు

'ఎప్పుడూ మాటలు.. మాటలు... నువ్వు వద్దుపో' అనేవాడు సార్‌తో. ఒక్కరోజే కదరా అంటూ సంజాయిషీ ఇచ్చుకునే ధోరణిలో వాడిని కన్విన్స్ చేసే ప్రయత్నం చేసేవాడు. బాలగోపాల్ వచ్చినపుడు మావాడి స్కూలు ఫంక్షన్ ఉంటే మాతోపాటు ఆయనా వచ్చేవారు. ఫంక్షన్‌లో నా కొడుకు మాట్లాడుతుంటే, 'నీకన్నా నీ కొడుకే నయం జయశ్రీ' అంటూ జోక్ చేసేవాడు. నన్నే కాదు, గడియ గడియకూ కాఫీ ఇచ్చే అక్తాబ్‌నూ, నిమిషానికో డౌట్ అడిగే నా కొడుకునూ భరించేవాడు. ఒక్క మాటలో చెప్పాలంటే బాలగోపాల్ మా కుటుంబంలో ఒక సభ్యుడిలాగే ఉండేవాడు కుటుంబంలోని కష్టసుఖాలూ, ఇబ్బందులూ అన్నీ ఆయనకు చెప్పుకునే వాళ్లం. అన్నీ వినేవాడు. అయితే ఎప్పుడూ నేరుగా సలహా చెప్పడు. జోక్యం చేసుకోడు. అయినా కుటుంబ విషయాలన్నీ బాలగోపాల్‌కు చెపితే, కాస్త తేలికపడేవాళ్ళం.

ఓ మోరల్ సపోర్టులా భావించే వాళ్లం. కాని ఆర్గనైజేషన్ పనిలో లేకపోతే ఆయనకు మనతో మాట్లాడేందుకు మాటలేమీ ఉండవు. పదేళ్లపాటు జిల్లాలో పనిచేసిన నేను మధ్యలో మా అబ్బాయి చదువుకోసం మూడేళ్లు హైదరాబాద్‌లో ఉండాల్సి వచ్చింది. ఆ మూడేళ్ల కాలంలో బాలగోపాల్ మాట్లాడడం కానీ కలవడం కానీ చాలా తక్కువే. కలిసిన ఒకటి రెండుసార్లు ఆయన నన్ను 'మేధోమాత' అంటూ ఎగతాళి చేసేవారు. ఎపిసియల్‌సి నుంచి ఒక దశలో వెళ్లిపోవాలనుకున్న నాతో 'పని చేయి మీ జిల్లాలో మాట్లాడేవాళ్లే లేరు. నీ పనే విమర్శలకు జవాబు' అని ఎంతో ఆత్మస్థైర్యం నిలిపాడు. ఆర్గనైజేషన్ ఇంకా విస్తరించాలి, పనిచేయాలి, ఇంకా కొత్త సమస్యలపై పని చేయాలి. ప్రజలకు చేరువగా వుండాలని ఆయన గోడు. ఎప్పుడు నేను అలసిపోయి పడుకున్నా 'శరీరానికి ఏది అలవాటు చేస్తే శరీరం అదే అలవాటు చేసుకుంటుంది' అని చెప్పేవాడు. నా కాలుగోరు పూర్తిగా పోతే కూడా నేను విచిత్రం చేస్తానని ఆయన వెక్కిరింపు. 'నాకు ఎప్పుడూ పోతూనే వుంటాయి, ప్లాస్టర్ వేసుకుంటే చాలు' అని ఆయనా, 'నీ కాలు కాదు సార్ నా కాలు' అని నేనూ. మంచి ఎండల్లో కూడా మోటార్ బైక్‌మీద 100-150 కిలోమీటర్లు తిప్పేవాడు. సార్ సన్‌స్ట్రోక్ వస్తుందని చెప్తే కూడా సన్ మంచివాడు సన్ (కొడుకు) తోనే ప్రమాదం అనేవాడు.

రాయలసీమ కరువు, వెనుకబాటుతనం, ఫ్యాక్షన్స్‌కు వ్యతిరేకంగా 1996లో రాయలసీమ ప్రజాసమితి ఏర్పాటైంది. గౌరవాధ్యక్షుడిగా బాలగోపాల్, అధ్యక్షుడిగా సి.హెచ్. చంద్రశేఖరరెడ్డి, కార్యదర్శిగా సంధ్య తదితరులతో కమిటీ ఏర్పాటైంది. రాయలసీమ జిల్లాల్లో ఎన్నో సభలు, సమావేశాలు జరిపాం. రాయలసీమ ప్రాంతానికి అన్ని రంగాలలో జరిగిన అన్యాయాన్ని తెలియజేయడానికి నవంబర్ ఒకటిన 'విద్రోహదినం' అన్ని పార్టీలతో కలిసి జరపాలనుకున్నాం. అయితే సభావేదిక మొత్తం

వై.యస్. రాజశేఖరరెడ్డి, ఇతర కాంగ్రెసు నాయకులతో నిండిపోయింది. వేరే ఎవరూ లేరు. దీంతో బాలగోపాల్, హరగోపాల్ ఇద్దరూ వేదిక ఎక్కలేదు. ప్రజల్లోనే కూర్చున్నారు. ఆ తర్వాత కొన్నాళ్లకు బాలగోపాల్‌ను, సి.హెచ్. చంద్రశేఖరరెడ్డిని రాయలసీమ ప్రజాసమితి నుంచి తొలగించారని తెలిసింది. రాయలసీమ ప్రజాసమితిలో మేము ఏమి సాధించామో చెప్పలేము కానీ "విద్రోహదినం నా రాజకీయ జీవితంలో పెద్ద టర్నింగ్ పాయింట్" అని పదవి చేపట్టిన తర్వాత వై.యస్. అనడం మాత్రం చాలా బాధ కలిగించింది.

## 'మీకు చెబితే రాష్ట్రానికి చెప్పినట్లే'

మానవహక్కుల వేదిక ద్వారా 2002 నుంచి కడప జిల్లాలో కార్యకలాపాలను చేపట్టాం. పని మొదలుపెట్టిన కొత్తలో మా సభ్యుడు ఒకరు ఎపిసియల్‌సికి ఉన్నంత గుర్తింపు మనకు లేదు అన్నప్పుడు పనిచెయ్యి గుర్తింపు అదే వస్తుంది అన్నాడు బాలగోపాల్. ఒకసారి మా జిల్లాలో చికెన్‌గునియా వ్యాధి తీవ్రంగా ప్రబలినప్పుడు బాలగోపాల్ సార్‌ను రాయచోటికి రమ్మని పిలిచాము. చిన్న చిన్న సమస్యలకు కూడా సార్ ఎందుకూ అని నేను అన్నాను. కానీ సార్ వచ్చిన తర్వాత అక్కడ పి.హెచ్.సి. డాక్టర్ ప్రభుదాసు చికెన్‌గునియా రోగాన్ని గురించి, దాని నివారణ, చికిత్స గురించి వివరంగా చెప్పాడు. పారాసిటమాల్, బ్రూఫెన్ టాబ్లెట్స్‌తో నయమయే జబ్బుకు ప్రైవేటు డాక్టర్లు వేలకు వేలు దోచుకుంటున్న సంగతులన్నీ సార్ దృష్టికి తీసుకొచ్చాడు. చివర్లో 'మీకు చెబితే రాష్ట్రానికి చెప్పినట్లే సార్' అని ముగించాడు.

ప్రతిపక్షంలో వున్నప్పుడు నల్గొండలో యురేనియం ప్లాంట్‌ను వ్యతిరేకిస్తూ ఉద్యమాల్లో పాల్గొన్న రాజశేఖరరెడ్డి ముఖ్యమంత్రి అయ్యాక అభివృద్ధిలో భాగమంటూ పులివెందులలో యురేనియం ప్లాంట్ ఏర్పాటుకు ప్రయత్నాలు మొదలు పెట్టినాడు. రేడియేషన్‌తో ప్రజలకు రాబోయే ఇబ్బందుల గురించి కరపత్రం వేశాం. చుట్టుప్రక్కల గ్రామాల్లో సభలు సమావేశాలు జరిపాం. వై.యస్. కంచుకోటగా వున్న ఈ ప్రాంతంలో వాళ్ళకు వ్యతిరేకంగా స్థానిక ప్రజలు ముందుకు వచ్చి ఎం.ఆర్.ఓ. ఆఫీసు దగ్గర ప్లాంట్‌ను నిరసిస్తూ ధర్నా జరపడమంటే ఆలోచించండి. ఇలా జరగడం జిల్లా వాసులందరినీ ఆశ్చర్యపరిచింది. దాదాపు 500 మంది ప్లాంట్ నిర్మాణాన్ని వ్యతిరేకిస్తూ పబ్లిక్ హియరింగులో కూడా పాల్గొన్నారు. అయితే మహా సౌమ్యుడైన ఎం.ఎల్.ఎ. వై.యస్. వివేకానందరెడ్డి నూరు మంది గూండాలతో ముందుగానే సభను ఆక్రమించి బాధిత రైతులను మాట్లాడనివ్వలేదు. పైగా మనల్ని బాగా తిట్టాడు. అక్కడ హెచ్.ఆర్.ఎఫ్.ను తరిమికొట్టండని నినాదాలు రాసారు. ప్లాంట్‌కు అనుకూలంగా మాట్లాడే వారిని తప్పించి వేరే ఎవర్నీ సభలో మాట్లాడనివ్వలేదు.

చివరకు బాలగోపాల్ సార్ పబ్లిక్ హియరింగ్ బాయ్‌కాట్ చేస్తున్నామని వేదిక ఎక్కి చెప్పాడు. ప్లాంట్ ఏర్పాటువల్ల మీకు కష్టాలు ఎదురైనపుడు తప్పకుండా మీరే మమ్మల్ని వెతుక్కుంటూ వస్తారని చెప్పాడు. ఆ తరువాత పబ్లిక్ హియరింగ్‌లో మాట్లాడనివ్వలేదని, తమ కష్టాలను వినలేదని నాలుగు గ్రామాల ప్రజలు సభను ముగించుకొని వస్తున్న వై.యస్. వివేకానందరెడ్డినీ, కలెక్టరునూ మొబ్బచింతలపల్లెలో అడ్డగించి బాగా తిట్టారు. తిట్లు ఎంతకూ ఆపకపోవడంతో ఏమిచేయాలో దిక్కు తోచక కూర్చోని మాట్లాడుదాం అని నమ్మకంగా చెప్పి నాలుగు అడుగులు ముందుకేసి పరుగెత్తి కారెక్కి పారిపోయారు వాళ్లు. ఆ తరువాత కలెక్టరుగారు పబ్లిక్ హియరింగ్ సజావుగా జరిగిందని రిపోర్టు పంపారు.

హెచ్ఆర్ఎఫ్ ప్రారంభం అయిన ఐదేళ్ళలోనే జిల్లాలో మంచి గుర్తింపు పొందింది. పదముగ్గురుతో జిల్లా కార్యవర్గం ఏర్పాటైన రోజు బాలగోపాల్‌లో ఎంతో సంతోషాన్ని చూశాం. వివిధ జిల్లాల్లో నిర్మాణాలు ఏర్పడి సంఘం బలపడుతున్న ఆనందాన్ని అనంతపురం సభల్లో మేం బాగా గమనించాం. రాష్ట్ర మహాసభలు దిగ్విజయంగా జరిగాయి. ఎవరి ఊళ్ళకు వాళ్ళం నిష్క్రమించాం.

'జయశ్రీ, నేను బాలగోపాల్‌ను, 10వ తేదీన వస్తున్నా. కడప జిల్లాకు వై.ఎస్.ఆర్. పేరు పెట్టడాన్ని వ్యతిరేకిస్తూ కలెక్టరుకు అబ్జక్షన్ ఫైల్ చేద్దాం. అలాగే నేలనూతన గ్రామంలో గాలేరు-నగరి సొరంగం తవ్వకం వల్ల ఇబ్బంది పడుతున్న లంబాడాలను కలుద్దాం. వాళ్ళకు వీళ్ళకు సీటు పెట్టమని చెప్పకుండా నా రిటర్న్ టికెట్టు నువ్వే కొను". ఇది సార్ చివరి ఫోన్. ప్రొద్దుటూరుకు వచ్చేందుకు బాలగోపాల్ తీసుకున్న టికెట్ ఆయన వద్దే ఉండిపోయింది. నేను ఇప్పటికీ రిటర్న్ టికెట్ తీసుకోలేదు.

# లేడూ మన బాలగోపాల్ శాపగ్రస్తుల గుండెల్లో!

వి. బాలరాజ్*

**నా** గురించే నాలుగు ముక్కలు
సార్ గురించి ప్రపంచానికి తెలుసు
బాలగోపాల్ సారూ, నేనూ మహాక్లోజ్
రంగారెడ్డిలో ఆయనకో ఎకరం భూమి ఇమ్మనేవాడు
కొంపలు కూల్చేవాణ్ణేకాని, వేసే వాణ్ణి కాదనే ఈ ఎగతాళి
నన్ను తాసీల్దారూ! అనేవాడు
కొన్నాళ్ళకి ప్రమోషన్ ఇచ్చేశాడు, ఆర్డీఓ అన్నాడు
చివరాఖర్కి కలెక్టరునీ చేసేశాడు
తాసీల్దారునీ, ఆర్డీవోనీ, కలెక్టరునీ కదా...
అందుకే నాకున్న డొక్కు స్కూటరును అమ్మేసి హీరోహోండా కొన్నాను
ఎన్‌కౌంటర్ నిజనిర్ధారణకు రామాయంపేటకు ఒకసారి సారు
నా హీరోహోండా మీదే పోయాడు
వంటమామిడ్లో బండి ఇంజన్ కాల్పులకు గురయ్యింది
హత్యకాదు... ఆత్మహత్యే... ఇగ్నిషన్ ప్రాబ్లం... ఇంజన్లో మంటలు
నా బండి నాకు తెచ్చి ఇచ్చేసాడు
కాళ్లీడ్చుకుంటూనే కాదు... బండిని మోసుకుంటూ కూడా...
ముప్పయి రెండు కిలోమీటర్లు....
మధు చెప్తేనే తెలిసింది,
సార్‌కి నాతో బాగా చనువు

---

* మానవహక్కుల వేదిక రాష్ట్ర కార్యవర్గ సభ్యుడు, హైదరాబాద్

ఆ చనువు ఇందిరాపార్క్‌లో మొదలయ్యింది
సెప్టెంబర్ 17, 1985
నలుగురికీ నన్ను పరిచయం చేసిన రోజు
అప్పుడు నేను ఒత్తి బాలరాజుని కాను...
ఓ ఎమ్మెల్ గ్రూపుకి ప్రతినిదిని
నా బండినే కాదు, నన్నూ అక్కణ్ణుంచి
చాలా దూరమే లాక్కొచ్చిందు సారు.
హక్కుకి రాజ్యాన్నే కాదు బాలరాజునీ చూపెట్టాడు
బాలరాజుకి రవిగాంచని చీకటి కోణాల్నీ చూపెట్టాడు
సార్‌తో నా హక్కుల పయనం చాన్నాళ్ళే
1988... 90... 92... 94... 2004... 200-
నావల్లకాదు చివరి అంకె నేను వేయలేను
హక్కుల నావ మునిగింది
బహుశా నిజం కాదేమో
నర్సిమ్మా నువ్వు చెప్పింది నిజమేనా
నిజం కాదు... నిజం కాదు
లేదూ మన బాలగోపాల్
శాపగ్రస్తుల గుండెల్లో
నిర్వాసితుల పోరాటాల్లో
నమ్మకాన్ని వమ్ము చేయకురా నర్సిమ్మా
ఇంతకంటే రాయడం నాకు చాతకాదు

# ఒక్క మనిషి కోసం ఎంత దూరమైనా రాగలడు

జి. మాధవరావు*

**బా**లగోపాల్ ఓరోజు ఫోన్ చేసి బోకర్ పోదాం రెడీగా ఉండమన్నాడు. బోకర్ మహారాష్ట్రలోని నాందేడ్ జిల్లాలో ఒక తాలూకా కేంద్రం. (మహారాష్ట్ర ముఖ్యమంత్రి అశోక్ చవాన్ నియోజకవర్గం కూడా అదే.) బోకర్ ఎందుకూ అని అడిగా. ఆదిలాబాద్ జిల్లా మామడ పోలీసుస్టేషన్లో ఒక లాకప్ మరణం జరిగిందనీ, మృతుడిది బోకర్ అని తెలిసిందనీ అన్నాడు. పైగా ఏదో ఎన్‌కౌంటర్ విషయమై అక్కడికి పోతే ఈ లాకప్ మరణం గురించి తెలిసిందన్నాడు. తను వచ్చేలోపు మరిన్ని వివరాలు సేకరిద్దామనే ఉద్దేశంతో మృతుడి వివరాలేమైనా ఉంటే ఇవ్వమన్నాను. మృతుడు బోకర్‌వాడు, అంతే అన్నాడు. మన భాష మాట్లాడని ప్రాంతంలో, మన రాష్ట్రంలో భాగంకాని ప్రాంతంలో సత్యాన్వేషణకు పోవాలి. పైగా మృతుడి గురించి ఏమీ తెలీదు... కనీసం పేరు కూడా. చూద్దాం సత్యాన్వేషణ ఎలా చేస్తాడో.

రాత్రి పొద్దుపోయాక వచ్చాడు. మా ఇద్దరికీ మరాఠీ రాదు. బోధన్‌నుంచి సంగంను పిలుస్తానన్నాను. సంగం అక్కడ లాయరు. ఎపిసిఎల్‌సి జిల్లా కార్యదర్శి. పొద్దున్నే బయలుదేరి బోకర్ వెళ్లాం. పది పదిహేనుమందిని అడిగాం. తెలీదు అనే జవాబే. ఎవరన్నా విలేకరి దొరికితే బాగుండునన్నాడు. విలేకరి గురించి వాకబు చేయగా ఎవరో అటుపొమ్మని చెయ్యి చూపించారు. 'సామ్నా' అన్న బోర్డు. దానికింద ఇంకేమో రాసిఉంది గాని మాకు రాదు! సంగం చదివాడు 'అన్నా విలేకరి' అన్నాడు. తలుపుకొడితే బయటికి వచ్చిన వ్యక్తిని పరిచయం చేసుకున్నాం. మామడ పోలీసుస్టేషన్ లాకప్ మృతుడి గురించి అడిగాం. రెండునెలలు అయిపోయిందిగదా

* **మానవహక్కుల వేదిక నిజామాబాద్ జిల్లా కన్వీనర్**

అన్నాడు. అయితే ఇతగాడికి తెలుసన్నమాట అనుకుని వివరాలు చెప్పమన్నాం. అతని భార్యవచ్చి ఇప్పుడు బోకర్‌లో లేరనీ ఆంధ్రాలోనే ఉన్నారనీ చెప్పింది. అతని వృత్తి ఏంటో అడగమన్నాడు బాలగోపాల్. గిసాడీ అని జవాబు. ఊరిపేరు తెలీదుగానీ లోహె(స్రా (ప్రస్తుతం – లోకేశ్వరం) పోయే రోడ్డుకు అభిముఖంగా ఉండే రోడ్డులో చివరి ఊరు అన్నాడు. పీచేముడ్.

'ఎట్లా బాలగోపాల్' అంటే పదండి పోదాం అన్నాడు. లోహె(స్రా అడ్డరోడ్డు వరకూ బస్సు, అక్కడినుండి లారీ. బాలగోపాల్‌ను కేబిన్‌లో కూర్చోబెట్టి నేనూ, సంగమూ లారీ ఎక్కాం. దిగి వెతుక్కుంటూపోతే ఆమె ఆ ఊరు ఖాళీ చేసి వెళ్లిపోయిందనీ, ప్రస్తుతం 'తానూర్'లో ఉంటోందనీ చెప్పారు. గోటు తానూర్... సాయంత్రమైంది తానూర్ పోయేప్పటికి. మృతుడు గిసాడీ (కుమ్మరి) వృత్తి చేసేవాడని బోకర్‌లో 'సామ్నా' విలేకరి చెప్పాడుగదా. ఆ విషయం కనుక్కుందాం ముందు అన్నాడు. గిసాడీ ఒక వృత్తి... ఒక కులం కూడా. ఇనుప మూకుళ్లు, కడాయిలు తయారు చేస్తారు. నేరుగా ఆ కులం వాళ్ళు నివసించే గుడిసెల వద్దకు తీసుకుపోయారు.

మమ్మల్ని పరిచయం చేసుకోగానే బాలగోపాల్ కాళ్లమీద పడిపోయింది మృతుడి భార్య. పోలీసుల వేధింపులు భరించలేక బోకర్‌కు పోయామనీ, బోకర్‌లో బతుకుతున్నా పోలీసులు వదలకుండా తన భర్తను తీసుకుపోయి చంపేసారనీ చెప్పింది. ఎందుకు పట్టుకుపోయారంటే మూడు కిలోల ఇనుప ముక్కను తన మొగుడు కొన్నాడనీ, కొంటున్నది దొంగసరుకని తెలీదనీ చెప్పింది. ఆ ఇనుప ముక్కను ఇమ్మని పోలీసులు వేధించారు. ఆ ముక్క అప్పటికే కడాయి (చిన్న మూడుకు)గా మారిపోయి ఎప్పుడో అమ్ముడయిపోయింది. సమాచారం మొత్తం సేకరించగలిగాం. బాలగోపాల్ తేల్చిందేమిటి? మూడు కిలోల ఇనుపముక్క ఖరీదు ఓ కళాకారుడి, ఓ కార్మికుడి, ఓ కుటుంబ పోషకుడి ప్రాణం. ఇదేమి ఈక్వేషన్. ఇది మన రాష్ట్ర పోలీసుల గణితం. 'బాలగోపాల్ నువ్వుకాబట్టి ఈ పరిశోధన చేయగలిగావ్. మేమింతదూరం రాకపోయి ఉండేవాళ్లం' అన్నా మౌనమే... ఈ ఉక్కు సంకల్పమేగదా బాలగోపాల్‌ను విశిష్ట వ్యక్తిగా నిలబెట్టింది.

ఇదంతా ఒక ఎత్తైతే ఆ తర్వాతది మరింత ఆసక్తికరం. తానూర్‌నుంచి మళ్లీ నిజామాబాద్ రావాలి. తానూర్‌లో ఎక్కిన బస్సు భైంసాలో కాసేపు ఆగింది. బహుశా డ్రైవరూ కండక్టరూ చాయ్‌కోసం దిగారేమో. సంగం కూడా దిగాడు నేనూ బాలగోపాలూ బస్సులోనే కూర్చున్నాం. ఇంకా మందికూడా ఉన్నారు. హఠాత్తుగా బస్సు గేర్‌బాక్స్‌లోంచి మంటలు లేసాయి. బస్సంతా గందరగోళం. డోర్‌వైపు

తోసుకొచ్చేస్తున్నారు. నేను కిటికీలోంచి దూకేసా... 'బాలగోపాల్ దూకెయ్యి' అని అరుస్తూ. ఊహూ... అక్కడే కూర్చున్నాడు. రెండు మూడు నిమిషాల్లో మంటలు ఆగిపోయాయి. ఎటువైపూ విస్తరించకుండానే. దిగలేదేం బాలగోపాల్ అంటే 'పెట్రోలు టాంకుకు ఏమీ కాలేదుగా' అని జవాబు. ఇది మొండితనం కాదు. జగమొండితనం.

బాలగోపాల్‌తో ఒక్కో పర్యటనలో ఒక్కొక్క కొత్త విషయం నేర్చుకునేవాళ్ళం. ఒక్కో కొత్త కోణం తనలో కనపడేది. బాధితుల్ని ఎలా ఇంటర్వ్యూ చేయాలోననే దగ్గర్నుంచీ పత్రికా ప్రకటన వరకూ బాలగోపాల్‌ది ప్రత్యేక పద్ధతి. మూస పద్ధతి వద్దనేవాడు. వైవిధ్యం ఉండాలనేవాడు. బాలగోపాల్‌ది ప్రత్యేక శైలి అంటున్నానంటే అది ఆయన ఆలోచనలోని స్పష్టతకు ప్రతిబింబం అని. రిపోర్టు రాయడానికి ముందే అన్ని కోణాల నుంచీ ఆలోచించాలి అనేవాడు. అంటే మేధోమధనం ముందే జరగాలి. అందుకే కార్యకర్తల సమావేశాలకు ఎంతో ముందే ఎజెండా పంపేవాడు. చర్చ సులువయ్యేది. కాలహరణం జరిగేది కాదు.

బాలగోపాల్ చదవడంలోనూ చాలాస్పీడు. అంతే స్పీడుతో చదివిందాన్ని బుర్రలో భద్రపరిచేవాడు. ఒకసారి ఆర్మూర్ ప్రాంతంలో ఒక ఎన్‌కౌంటర్‌లో వాస్తవసేకరణకు వచ్చాడు. నాకు పని ఉండి లేటుగా వచ్చాను. నేను ఇంటికి వచ్చేసరికి వరండాలో తిరుగుతూ గ్రాంసీని తినేస్తున్నాడు. ఆర్మూర్‌కి మనం బస్సులో పోవడం లేదు... స్కూటర్ మీద పోదాం... ఈలోగా స్టేట్ అండ్ సివిల్ సొసైటీ గురించి నువ్వు చెప్పాలి అన్నా. దారి పొడవుగా గ్రాంసీ మాట్లాడిన మట్టి కోటలు, అగడ్తలు అంటే ఏమిటో మహాద్భుతంగా చెప్పాడు.

ఒకసారి హైదరాబాద్ ఎస్వీహాలులో ఏదో మీటింగు అయిపోయాక ఎదురుగా ఉన్న హోటల్లో ఇరానీ చాయ్ తాగుతూ కూర్చున్నాం. డి.డి. కోశాంబిని తెలుగువాళ్లకు పరిచయం చేసిందే బాలగోపాల్. కోశాంబి రాసిన వ్యాస సంపుటి 'ఎక్జాస్పరేటింగ్ ఎస్సేస్'లోవి కొన్నిటిని నేను తెలుగు చేసా. 'ఆచరణలో గతితర్కం' పేరుతో నిజామాబాద్ జంపాల చంద్రశేఖర ప్రసాద్ మెమోరియల్ ట్రస్టు ప్రచురించింది. ఒక కాపీని 'బాలగోపాల్‌కి ప్రేమతో' అని రాసిచ్చా. 'అన్ని వ్యాసాలూ చేసావా' అన్నాడు. ఇంకా రెండు మిగిలాయి అన్నా. రెండో ఎడిషన్‌నాటికి వాటిని కూడా చెయ్యి అన్నాడు. ఆ అవకాశం ఇంకా రాలే. కానీ... కానీ... బాలగోపాల్ రాసిన ఇంగ్లీషు వ్యాసాలకు తర్జుమా చేసే అవసరం నాకు పడుతుందని ఎప్పుడూ నేను అనుకోలే... ఒకవేళ పడ్డా ఇంత తొందరగా ఆ అవసరం కల్పిస్తాడనుకోలే...

# పెద్ద దిక్కును కోల్పోయాం

డి. జర్మియ*

మానవ హక్కుల నిర్విరామ పోరాట యోధుడు బాలగోపాల్‌గారి గురించి నాకు తెలిసిన నాలుగైదు మాటలు అందరితోనూ పంచుకోవాలని ఉంది. 'ప్రార్థనలు ప్రభువుకు, ప్రసాదం పాలెగాళ్ళకు' అనే నివేదికను మీరంతా చదివే ఉంటారు. కర్నూలు జిల్లా ఆదోని ప్రాంతంలో తెలుగు బాప్టిస్ట్ క్రైస్తవ ఆస్తులు దురాక్రమణకు గురైన సందర్భంలో బాలగోపాల్‌గారి నేతృత్వంలో ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం వెలువరించిన నివేదిక అది. దళితుల మీద, మైనారిటీల మీద ఏ రకమైన దాడులు దురాక్రమణలు జరిగినా స్పందించేటువంటి నాయకుడు ఇక లేరన్న వార్తను నేనిప్పటికీ జీర్ణించుకోలేకపోతున్నాను.

బాలగోపాల్‌గారు నాకు ఒక్కోసారి దూతగా, ఒక్కోసారి గొప్ప పోరాటయోధుడిగా దర్శనమిస్తారు. హక్కుల ఉల్లంఘన జరిగినప్పుడు బాధితుల పక్షాన ఒక రాయబారిగా అధికారులతో చర్చించి తక్షణ ఉపశమన చర్యలను అమలు చేయించడానికి ఎంత ప్రాధాన్యతనిస్తారో, అంతే నిక్కచ్చిగా వారి నిర్లక్ష్యాన్ని ప్రశ్నిస్తారు.

ప్రతిఫలాపేక్ష లేకుండా ఎంతమంది పేద ప్రజల కేసులను ఆయన న్యాయస్థానాల్లో వాదించారో చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. తిమ్మిని బమ్మి, బమ్మిని తిమ్మి చేసి అబద్ధాలమీద నాలుగంతస్థులు లేపుకుందామనే న్యాయవాదులు వర్ధిల్లుతున్న రోజుల్లో బాలగోపాల్‌గారు నిజంగా అరుదైన వ్యక్తి. న్యాయవాద వృత్తిలో ప్రవేశించేటప్పుడు న్యాయానికి న్యాయం చేస్తానని ప్రమాణం చేస్తారట న్యాయవాదులు.

* మానవహక్కుల వేదిక కర్నూలు జిల్లా అధ్యక్షుడు

ఆ ప్రమాణానికి కట్టుబడి బతికిన న్యాయవాది బాలగోపాల్ గారు. ఏ కేసు వాదించినా ఆయన బాధితుని పట్ల ప్రేమతోనూ, బాధ్యతతోనూ చేశారు.

బాలగోపాల్ గారికి తెలియని విషయమంటూ ఏమీలేదనిపిస్తుంది. పండితునికీ, పామరునికీ కూడా విషయం అర్థం చేయించగల శక్తి సామర్థ్యాలేవో ఆయనలో దాగి ఉన్నాయి. వారి అబ్బాయికి జీర్ణ వ్యవస్థ గురించి పాఠం చెప్పినా, దళితుల, ఆదివాసుల హక్కుల గురించి సంస్థ సమావేశాల్లో అనర్గళంగా ప్రసంగించినా, అణు పరిహార బిల్లు గురించి మాట్లాడినా... ఆయన విషయంపై ఎంత కేంద్రీకరణతో ఉంటారో స్వయంగా మనమంతా ఎరుగుదుం.

ఆయన ఎంతటి సాదాసీదా జీవితాన్ని ఎంచుకున్నారో ఆయన వస్త్రాలూ, చెప్పులూ, స్కూటరూ, బస్సులపై ప్రయాణాలూ మనకు సూచిస్తాయి. విలాసవంతమైన జీవితానికి ఆయన దూరంగా బతికారు. ఎక్కడికి వెళితే అక్కడి ఆహారాన్ని, అది ఉగ్గాని బజ్జీ అయినా కూడా తిన్నారు తప్పితే ఎవరినీ ఇబ్బంది పెట్టేవారు కారు.

ఒక సాహసి, ఒక నిస్వార్థ జీవి, ఒక హక్కుల పోరాట యోధుడు, ఒక సాదాసీదా మనిషి, ఒక ప్రజా న్యాయవాది, ఒక బోధకుడు, ఒక తేజోమూర్తి మనల్ని వదలి వెళ్ళిపోయాడు. మనకి మనమే దిక్కయ్యాం. ఆ వెలితి మనల్ని వెంటాడుతున్నా ఆయన చూపిన మార్గంలో కలిసి అడుగేద్దాం.

# మా గోపీకి నా నివాళి

పి. మాధవి*

**1975** ఎమర్జెన్సీకి కొన్ని నెలల ముందు నేను బి.కాం చివరి సంవత్సరం చదువుతున్నాను. వివిధ కళాశాలల్లో జరిగే వక్తృత్వ పోటీలలో, విద్యార్థి కార్యకలాపాలలో చురుకుగా పాల్గొనే దాన్ని. ఈ క్రమంలో కొందరు విద్యార్థినులం కలసి కొంత వేడి చర్చ తరువాత, ప్రగతిశీల మహిళా సంఘం (POW) ను స్థాపించాము. నేను వ్యవస్థాపక సభ్యురాలిగా, జాయింట్ సెక్రెటరీగా ఎన్నుకోబడ్డాను. కె. లలిత, గీతారామస్వామి, రుక్మిణి మోహన్, సుమిత్ సిద్దు ఇంకా చాలామంది ఉన్నాము. పిఓడబ్ల్యూ తొలి రోజులలో వరకట్నానికి వ్యతిరేకంగా రకరకాల కార్యక్రమాలు చేపట్టాము. ధరల పెరుగుదలకు వ్యతిరేకంగా ర్యాలీ తీసాము. బాలగోపాల్ అప్పుడు ఆర్ఇసి లో చదువుతూ ఉండేవాడు. ఒకసారి సెలవులకు వచ్చినప్పుడు పిఓడబ్ల్యూ గురించి చెప్పి, మా ఆశయాలు, చేపట్టిన కార్యక్రమాలు వివరించాను. అప్పుడు తన కళ్ళల్లో కనిపించిన అప్రూవల్ నేను ఎప్పటికీ మరచిపోలేను. కొండంత ధైర్యం. నేను సరైన మార్గంలో వెడుతున్నాను అనే విశ్వాసం, భవిష్యత్తుపైన నమ్మకం కలిగాయి. ఎమర్జెన్సీ ప్రకటించాక పిఓడబ్ల్యూ నిషేధించబడింది. మాలో కొందరు అరెస్ట్ అయ్యారు.

ఆ విధంగా నా ఏక్టివిస్ట్ కెరియర్‌కు పెద్ద బ్రేక్ పడింది. అయితే, ప్రజాస్వామ్య ఉద్యమంలో ఉండాలనే నా ఆకాంక్ష మాత్రం బెదరలేదు. ఈ కోరికే కాలక్రమేణా బాలగోపాల్‌తో కలిసి పనిచేయాలి అనే బలమైన కోరికగా మాత్రమే మారింది. 1975లో ఉన్నది ఆవేశం, ఏదో చేయాలనే తపన, చేయగలమనే నమ్మకం, ఒక సిద్ధాంతంగానీ, తాత్త్విక అవగాహనా బలంగానీ లేవు. అవసరమని కూడ

---

* మానవహక్కుల వేదిక హైదరాబాద్ జిల్లా అధ్యక్షురాలు

అనిపించలేదు. ఈ పరిస్థితినుంచి వ్యక్తిగత జీవితంలో చాలా దూరం వెళ్ళిపోయాను. పూర్తి విరుద్ధమైన ప్రపంచంలోకి వెళ్ళిపోయానని చెప్పక తప్పదు. బాలగోపాల్ నా అంతరాత్మ ప్రబోధకుడు కాకపోయి ఉంటే, బహుశా నేను నేనుగా మిగిలి ఉండేదాన్ని కాదేమో. ఆ సమయంలో అడపాదడపా తనతో మాట్లాడటం, తను మాట్లాడే సభలకు వెళ్ళటం, రాసింది చదవడం వలన, తను ఏ మార్గంలో వెళ్తున్నాడో కొద్దో గొప్పో తెలుస్తుండేది. పూర్తిగా అర్థం కాకపోయినా నేను అనుసరించదగ్గ మార్గమేననే నమ్మకం ఉండేది.

ఎపిసిఎల్‌సిలో ఉన్నప్పుడు తనని గురించి చాలా ఆందోళన చెందిన సందర్భాలున్నాయి. తన క్షేమం గురించిన ఆందోళనే తప్ప, తను ఎంపిక చేసుకున్న మార్గంపైన అవిశ్వాసం లేదు. ఎపిసిఎల్‌సిలో అభిప్రాయ భేదాలు వచ్చి బాలగోపాల్, మరికొందరు బయటికి వచ్చారని తెలిసిన రోజు నేను చాలా దు:ఖించాను. ఎందుకో తెలుసా? తనకు ఆ ప్రక్రియ ఎంత బాధ కలిగించి ఉంటుందో అని. తన ఆత్మ విశ్వాసానికి, సిద్ధాంతం పట్ల ఉన్న స్పష్టతకు జోహార్లు అనుకోకుండ ఉండలేకపోయాను. అయినా ఎన్నో సంవత్సరాలపాటు ఈ విషయాన్ని తన దగ్గర ఎప్పుడూ ప్రస్తావించలేదు. రెండేళ్ళ క్రితం మేమిద్దరం పోలవరం ప్రాజెక్టు వ్యతిరేక సభలో పాల్గొనడానికి బస్సులో వెళుతున్నప్పుడు సందేహిస్తూనే అడిగాను “మీరందరూ ఎపిసిఎల్‌సి నుంచి ఎందుకు బయటకు వచ్చారు? ఏ విషయం మీద మీకు బేధాభిప్రాయాలు వచ్చాయి అని”? తాను ఎపిసిఎల్‌సిలో చేరటం దగ్గర మొదలుపెట్టి మానవ హక్కుల వేదిక పెట్టుకునే వరకు జరిగిన పరిణామాలు, ఎపిసిఎల్‌సిలో తన పాత్ర, తనలో తలయెత్తిన ప్రశ్నలకు మార్క్సిజంలో సంతృప్తికరమైన సమాధానాలు దొరకక పోవటం, హింస పట్ల తన వ్యతిరేకత, పౌరహక్కుల పరిధినుంచి మానవహక్కుల అవగాహనకు తన ప్రయాణం లాంటి ఎన్నో విషయాలు చెప్పుకుంటూ పోయాడు. ఎన్నో సత్యాలు ఇందులో ఆవిష్కరించబడ్డాయి అనిపించింది. నా జీవితంలో బాలగోపాల్‌తో ఇంత లోతైన సంభాషణ ఎప్పుడూ చేయలేదు, ఇక చేసే అవకాశమూ లేదు. ఇవి తెలుసుకోదగినంత ఎదిగానని బాలగోపాల్ భావించినందుకు గర్వపడ్డాను. ఆ నమ్మకం ఎప్పటికీ నిలబెట్టే ప్రయత్నం చేస్తాను.

2003 మేలో హెచ్‌ఆర్‌ఎఫ్ మరికొన్ని హక్కుల సంఘాల సభ్యులతో కలిసి చేసిన కాశ్మీర్ పర్యటనలో నేనూ ఉన్నాను. మానవ హక్కుల వేదిక పనితీరు, నిజనిర్ధారణ చేయడంలో పరిగణనలోకి తీసుకునే విషయాలు, కాశ్మీరు గురించి బాలగోపాల్‌కు ఉన్న లోతైన అవగాహన, ఇలా చాలా విషయాలు తెలిసాయి. ఆ తరువాత క్రమ క్రమంగా హెచ్‌ఆర్‌ఎఫ్ కార్యకలాపాలలో పాల్గొంటూ మానవహక్కులు అనే అంశాన్ని ఎంత విస్తృతమైన అర్థంలో చూడవచ్చో తెలుసుకున్నాను.

## ఆదివాసులకు చేయమనేవాడు

'నీకు ఏవర్గం కోసమైనా పనిచేయాలి అనిపిస్తే, ఆదివాసుల కోసం పనిచేయి. వాళ్ళకు ఎంత చేసినా ఇంకా చాలా సమస్యలుంటాయి... అన్నాడు బాలగోపాల్ ఒకసారి. ఆ స్ఫూర్తితోనే ఆదివాసీ మహిళల గురించి ఒక ప్రాజెక్టు చేసే అవకాశం వచ్చినప్పుడు వదులుకోలేకపోయాను. ఆదివాసుల పట్ల అప్పుడు మొదలైన ఆసక్తి కొనసాగుతూ, వచ్చిన అవకాశాలను వాడుకుంటూ, అవగాహన పెంచుకుంటూ నేను కూడ హక్కుల కార్యకర్త కాగలను అనే నమ్మకం నాపైన నాకు కలగడానికి ఇంత కాలం పట్టింది. ఎప్పుడు ఏ సందేహం వచ్చినా ఏ విషయంలో స్పష్టత అవసరమైనా ఒక ఫోన్‌కాల్ చేస్తే, నిమషాలమీద ఆ సందేహాన్ని తీర్చేవాడు బాలగోపాల్. ఇటీవలి కాలంలో మా మధ్య అన్నా చెల్లెళ్ళ సంబంధం కంటే హక్కుల ఉద్యమంలో భాగస్వాములు, సహచరులుగా ఉండే సంబంధమే ఎక్కువగా ఉండేది.

కలిసి పనిచేస్తున్న క్రమంలో ఎప్పటికప్పుడు ఆశ్చర్యపోయే పరిస్థితి వచ్చేది. ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాలలో ఓపెన్‌కాస్ట్ గనులను వ్యతిరేకిస్తూ 2008 నవంబర్ నెలలో వరసగా చేపట్టిన పాద యాత్రలు, ప్రచార యాత్రలు నాకు చాలా నేర్పాయి. గ్రామాలలో బాలగోపాల్ మైక్ పట్టుకుని, చెప్పిన స్లోగన్ చెప్పకుండా, గొంతెత్తి పిలుపునిస్తూ, ఓపెన్‌కాస్ట్ వలన వచ్చే ప్రమాదాలివి అని చెప్తూ, "మీతో మేము కలిసి వస్తాం, వీటిని ప్రతిఘటిద్దాము" అని గ్రామ గ్రామంలో కాలినడకన తిరుగుతూ, గ్రామస్తులను పోగేసి వాళ్ళతో మాట్లాడుతూ, గ్రామ కమిటీలు వేస్తూ, ముందుకు పోతూ... అది ఎప్పటికీ మరువలేని అనుభవం. గ్రామస్తులతో పాటు మేము కూడా, తను మాతో ఉంటాడనే అనుకున్నాము. ఆ అనుభవంతోనే ఇప్పుడు నేను మిగిలిన హెచ్‌ఆర్ఎఫ్ కార్యకర్తలతో కలిసి ఓపెన్‌కాస్ట్ ప్రజాభిప్రాయ సేకరణలలో పాల్గొనగలుగుతున్నాను. ఏ విషయాన్నైనా హక్కుల దృక్కోణంలో అవగాహన చేసుకుని, అందులో నా కర్తవ్యాన్ని నిర్దేశించుకోగలుగుతున్నాను. గ్రామాలలోకి వెళ్ళినప్పుడు మీ సమస్య మాకర్థమైంది, మేము మీతో ఉంటాము అనే విశ్వాసాన్ని వాళ్లలో కలిగించగలుగుతున్నాను.

సాంప్రదాయకమైన కుటుంబంలో బతుకుతూ చాలాకాలం పరిమితమైన పరిధిలోనే ఉన్నా ఆలోచన ఎప్పుడూ ఇరుకులో మగ్గలేదు. ఇంతకంటే అర్థవంతమైన ప్రయోజనం జీవితానికి ఉంది. అది ఏదో ఒక రోజు ఆవిష్కరించుకోగలుగుతాను అనే నమ్మకం ఉండేది. హక్కుల కార్యకర్త కాకముందు, నిరంతరం సంఘర్షణకు లోనయ్యాను. దాని నుంచి నన్ను బయటపడేసి నాకు కర్తవ్యం నిర్దేశించింది బాలగోపాల్. 'మనం మన పని చేసుకుంటూ పోదాం. ఎవరి సంస్కారాన్ని బట్టి,

అవగాహనను బట్టి, రాజకీయ భావజాలాలను బట్టి, పక్షపాతాలను బట్టి వాళ్లు అర్థం చేసుకుంటారు. ఎప్పుడూ సంజాయిషీలతో కాలం వ్యర్థం చేసుకోకూడదు' అనే తన రూలు హెచ్ఆర్ఎఫ్‌కు ఏవిధంగా వర్తిస్తుందో వ్యక్తిగతంగా నాకు కూడ అదే విధంగా వర్తిస్తుందనుకున్నాను.

ఏమీ తెలియని అమాయకత్వంలో, ఆవేశంలో పిఓడబ్ల్యూతో ప్రారంభమైన ఈ కర్తవ్యం కొంత దూరం ప్రయాణం చేసి, ఆగిపోయి, నిర్జీవమై మళ్ళీ సజీవమై కొనసాగే ప్రయత్నంలో ఉందంటే దానికి తనే కారణం. 1999లో మా అబ్బాయికి ఉపనయనం చేస్తూ బాలగోపాల్‌ను ఆహ్వానించినప్పుడు 'నువ్వు బుద్ధిలేక చేస్తున్న పనికి నన్ను కూడ ఎందుకు రమ్మంటున్నావు' అనే తన వ్యాఖ్య నన్ను ఉలిక్కిపడేటట్లు చేసింది. జీవితంలో ఏ స్థాయి హిపోక్రసీకి నేను బలైపోతున్నానో అర్థమైంది.

బాలగోపాల్ నుంచి ఎంత తెలుసుకున్నానో, ఎంత తెలుసుకోవాల్సి ఉందో, ఎంత తెలియటానికి అవకాశం లేదో, అంచనా కూడ లేదు. మిగిలింది తను ఇచ్చిన స్ఫూర్తి. ఆ స్ఫూర్తితో తన బాటలో ప్రయాణించటం కంటే నేను చేయగలిగింది కానీ, ఇవ్వగలిగిన నివాళిగానీ ఏమీ లేదు.

# ఎలియాస్ కరపత్రం బాలగోపాల్

టి. దేవదానం*

కదిలేదీ కదిలించేదీ పెనునిద్దర వదిలించేదీ ఏదైనా ఉందంటే అది బాలగోపాల్‌గారి కరపత్రమే. కందాళ బాలగోపాల్ అని ఆయన మనల్ని విడిచివెళ్లినపుడు పత్రికలలో వచ్చింది గానీ అది డాక్యుమెంట్లలోనే ఉండిపోయిన పేరు. మా మనసుల్లో మాత్రం 'ఎలియాస్ కరపత్రం బాలగోపాల్'గా ఇంకిపోయింది.

చరిత్ర ఎక్కడ దొరుకుతుంది? కదులుతున్న చరిత్రయినా, రగులుతున్న చరిత్రయినా... నమోదు కాని చరిత్రా, ఆమోదం పొందని చరిత్రా ఎక్కడ దొరుకుతుంది? సుబ్రహ్మణం గార్ని అడిగితే 'సారు కరపత్రాలు ఉళ్లే...' అన్నాడు. వర్తమాన చరిత్రను లిఖిస్తున్నామనుకుంటున్న పత్రికల సంపాదక పుటలు వెలవెలబోయేలా చేస్తాయి బాలగోపాల్‌సారు రాసిన కరపత్రాలు. ఆదిలాబాద్ నుంచి మా కృష్ణపట్నం వరకూ ఆయన తిరగని ప్రాంతం లేదు, పరిశీలించని, పరిశోధించని ప్రాంతమూ, అంశమూ లేదు అనిపిస్తుంది నాకు. ఎత్తుకోని సమస్యలేదు. హక్కులేక, హక్కు రాక దిక్కులేని స్థితిలో బిక్కుబిక్కుమని బతుకుతున్న సామాన్య ప్రజానీకమే ఆయన కరపత్రాల నిండా కనిపిస్తారు. ఆయన కరపత్రాలలో విషయం సామాన్యులది. శైలి అనన్య సామాన్యమైనది. అవలీలగా రాసెయ్యడమేకాదు ఎంతో ఆకట్టుకునే విశ్లేషణా, శైలీ కూడా ఉంటుంది అందులో. ఒక్క మాటలో చెప్పాలంటే బాలగోపాల్‌సారు కరపత్రాన్ని సంధిస్తారు. వాటిని బతిమిలాడి ఎవరి చేతిలోనూ పెట్టక్కరలేదు, ఎరగేసుకు పోతారు ఆయన కరపత్రాలను ఎవరయినా. చదివిన ప్రతిసారీ ఇంకొన్ని కొత్త విషయాలు తెలిసినట్టుంటాయి.

* మానవహక్కుల వేదిక నెల్లూరు జిల్లా కార్యదర్శి, సూళ్లూరుపేట

ఆయన తరచూ ఒకమాట చెబుతుండేవారు. కరపత్రాలు, బులెటిన్లతోసహా మన సాహిత్యాన్ని అందరికీ చేరువచేసే పనిని ఏమాత్రం తక్కువచేసి చూడకూడదని. మన సంస్థలో దానికి తగిన ప్రాముఖ్యం సభ్యులు ఇంకా ఇవ్వడం లేదనేవారు. ఆయన మాటని అనుసరించే నెల్లూరు జిల్లా హెచ్.ఆర్.ఎఫ్ కార్యకర్తలమయిన మేము జిల్లాలోని తడ, సూళ్లూరుపేట, కోట, నాయుడుపేట, గూడూరులలో శిబిరాలు ఏర్పాటుచేసి వేల కరపత్రాలను అచ్చొత్తించి లేదా జెరాక్స్ చేసి ప్రజలకు పంచాము.

మీడియాలో రాయడం, మాట్లాడడం కంటె బాలగోపాల్‌గారు కరపత్రాలకీ, బులెటన్లకే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చేవారు. మన వాణిని సంపూర్ణంగా చేరవేసేవి ఇవేనని ఆయన విశ్వాసం. మీడియా ప్రాధాన్యాన్ని ఆయన గుర్తించలేదని కాదు గానీ దాని ద్వారా వచ్చే గుర్తింపు తహతహల దుర్లక్షణానికి తానుగానీ, సభ్యులుగానీ గురవకూడదని భావించేవారు.

ఆయనవని తెలిసిన రచనలు కొన్నయితే తెలియనివి ఎన్నో. రాయలసీమ పాలెగాళ్లమీద రాసిన పుస్తకాలలో ఆయన పేరే కనపడదు. మానవ హక్కుల వేదిక బులెటిన్లలో కూడా పేరు లేకుండా ఆయన రాసిన వ్యాసాలెన్నో. ఆయన రాతల ద్వారా భారతదేశం మొత్తం దర్శించవచ్చు. ఎంతో మేధోశక్తితో, విశ్లేషణతో ఇన్ని రచనలు చేస్తున్నా ఎప్పుడూ ఒక అణకువతో మాట్లాడతారు. డి.డి. కోశాంబి పరిచయాన్ని ఆయన ఎంతో అద్భుతంగా చేసినా 'నాకర్థమైన డి.డి. కోశాంబి' అని మాత్రమే ఎంతో నమ్రతతో చెప్తారు. బహుశా మరొక అభిప్రాయానికీ, చేర్పుకూ అవకాశం ఇచ్చే ప్రజాస్వామిక ధోరణిలోంచి వచ్చిన మాటలు కావచ్చును అవి.

నెల్లూరు జిల్లాకు చివరిసారి వచ్చింది జిల్లా మానవహక్కుల వేదిక మహాసభలకు. రాత్రి మూడు గంటలకు వచ్చి బస్టాండ్‌లోనే నిద్రపోయారు తప్ప ఎవరి తలుపూ తట్టలేదు. ఉదయం 7 గంటలకు సుబ్రహ్మణ్యం సారును కలుసుకున్నపుడు 'మీ ఊర్లో దోమలు బాగా కుడతాయయ్యా' అని సరదాగా మాటల సందర్భంలో అంటే తప్ప ఆ విషయం మాకెవరికీ తెలియలేదు. ఇటువంటి అనుభవాలే ఇతర జిల్లాల సభ్యులకి కూడా ఉన్నాయని నాకు తరువాత తెలిసింది.

## పాదయాత్రనే జీవనయాత్ర చేసుకున్నారు

శిథిలమవుతున్న ఆదివాసీ, దళిత జీవితాల పునరుజ్జీవం కోసం జీర్ణమయిపోయిన చెప్పులతోనే ఆయన ఈ నేలంతా తిరుగాడారు. పాదయాత్రలూ, ప్రచార యాత్రలూ, కొండలూ గుట్టలలో నిజనిర్ధారణలూ అన్నీ ఆ అరిగిపోయిన చెప్పులతోనే. బహుశా పాదయాత్రనే జీవనయాత్రగా మార్చుకున్నాడేమో.

ఎస్ఇజెడ్‌లపై ప్రసంగించడానికి ఒకసారాయన నెల్లూరు జిల్లాలోని తడకు వచ్చారు. సభ నిర్వాహకులు ఆయన మీద మక్కువతో భోజనాలకు ఏం చేయమంటారని అడిగారు. 'తినదగినదేదైనా సరే' అని చెప్పారాయన. ఆకలి తీర్చగల ఆహారం చాలునన్నది ఆయన అభిప్రాయం. టీ దగ్గర మాత్రం కాంప్రమైజ్ లేదు.

ఆయన చావుకు భయపడని వ్యక్తి. భయం చుట్టూ తిరుగుతున్న రాష్ట్ర పరిణామాల్ని ఆయన తన చివరి ప్రసంగంలో నిశితంగా విమర్శించారు. అనంతపురంలో జరిగిన 3వ రాష్ట్ర మహాసభలలో ఆయన చేసిన 16 నిమిషాల 47 సెకన్ల ప్రసంగాన్ని గనుక విస్తరిస్తే 30 ఏళ్ల ఆయన హక్కుల ఉద్యమ అనుభవం అవుతుంది. 'ఈ రాష్ట్రాన్ని భయం ఏలుతోంది, మేధావులూ, ప్రగతిశీలవాదులూ, విశ్లేషణా చాతుర్యం ఉన్నవాళ్లూ అందరూ భయంతో బ్రతుకుతున్నారు. వాస్తవాలు తెలిసినా స్పందించలేని స్థితికి చేరుకున్నారు' అని ఆరోజు ఆయన పడిన ఆవేదన నా సెల్‌లో ఇప్పటికీ భద్రంగా ఉంది. 'మనకు భద్రత కల్పించేది మన స్వేచ్ఛే; స్వేచ్ఛ కంటే ఎక్కువగా భద్రత కల్పించేది మరొకటి లేదు' అని కార్ల్‌పాపర్ అనే ఆయన అన్నట్టు ఎక్కడో చదివాను. అది సారుకు కరెక్టుగా సరిపోతుందనిపిస్తుంది.

ఎన్నో తలపులు. నావీ, నాకు ఇతరులు చెప్పినవీ రాసుకు పోవాలనే ఉంది. కాని ఎక్కడో అక్కడ ముగించాలి కదా. ఆలోచననీ, ఆచరణనీ విడదీసి చూస్తే బాలగోపాల్ లేరు. భావాలను ఆచరణలో పెట్టడంలోనూ, ఆచరణ నుండి భావాలను వృద్ధి చేయడంలోనూ ఆయనకు సాటి ఎవరూ లేరు. ఆయన తన ఆచరణ ద్వారానే అందరికీ జవాబు చెప్పారనిపిస్తుంది. అందుకే ఆయన ఆచరణల మనిషి.

# పనితోనే సార్‌కు దగ్గరవగలం

**ఎండి. అన్వర్***

**తే**ది. 12.1.2010 ఉదయం కృష్ణ ఫోన్ చేసాడు. "మన సార్ (బాలగోపాల్)పై ప్రత్యేక సంచిక ఇప్పటికే రావాల్సి ఉన్నది. ఆలస్యం చేయకుండా ఏమైనా రాయండి అన్వర్‌గారు" అన్నాడు. కృష్ణ ఎప్పుడు ఫోన్ చేసినా ఎక్కువగా మాట్లాడుకుంటాం. ఎక్కువగా నవ్వుకుంటాం కూడా... కాని సార్ గురించి రాయమని గుర్తుచేసినప్పుడల్లా నాకు మాటలు ముందుకు సాగేవి కావు. "సరే" అంటూ ముగించేవాణ్ని. సార్ మా మధ్య లేనితనాన్ని గుర్తుకు తెచ్చుకుంటేనే ఒక్కసారిగా శరీరం చల్లబడిపోయినట్లు అనిపిస్తుంది నాకు. మా సార్ మా మధ్యలేని సందర్భం రావడమే మా జీవితాల్లో అత్యంత విషాదకరమైనది. ఇటువంటి దినాలు వస్తాయని ఎవరం ఊహించి ఉండము. సార్ మాకు ఏమిచ్చాడో చెప్పడం రాదు కాని... సార్ ఇవ్వనిది ఏమీ లేదనిపిస్తది. మా బ్రతుకు ప్రతి మలుపులో మాకు సార్ ఉన్నాడనే ధీమానే మమ్మల్ని నిలబెట్టింది. మాతో ఎందరు ఉన్నా... సార్‌లాగా మమ్మల్ని ప్రభావితం చేయగలిగేవారు లేరు. రారేమో కూడా. నా వరకైతే నేనిప్పుడు అనాథను.

నిండు దుఖంలో ఉన్నాను. వదలని శోకపుగూడు ఇది. ఈ దు:ఖం సార్ జ్ఞాపకాలు కదిలిన కొద్దీ నా కళ్ళ నుండి పొంగుకొస్తూనే ఉంటది. సార్... జ్ఞాపకాలు రాని సందర్భం అంటూ నాకు ఉంటుందా...? నా నిత్య జీవితంలో సార్‌ను తలవని ఘడియలకు చోటెక్కడది? ప్రతి దినము, ప్రతి సందర్భములో సార్ పడిన సామాజిక ఘర్షణ ఎంత అనంతమైనది! నిత్యం పెరుగుతున్న అన్ని రకాల అణచివేతలను, వాటిని అధిగమించేందుకు జనం చూపిన ఆరాటాలను క్షణక్షణానికి గుప్పిట పట్టిన మా సార్ ఎన్నడైనా విశ్రాంతిని కోరుకున్నాడా..? ఏ విషయాన్నైనా వదిలివేసాడా...? అసలు

---

* **మానవహక్కుల వేదిక రాష్ట్ర కార్యదర్శి, గోదావరిఖని**

సార్ స్పృశించనిది ఏదైనా ఉందా? చాలాసార్లు అస్పష్టత, తేల్చుకోలేని స్థితి ఎదురైన ఎందరికో "దారులను" ఎరుక పరిచింది సార్ మేధావితనమే. సార్ చెప్పాక... అందరూ తమ నిర్ధారణలను సవరించుకునేవారు. లేకపోతే మళ్లీ మళ్లీ సమీక్షించుకునేవారు. సార్‌కు ఇటువంటి 'అనుచరులు' వాళ్లు దేశవ్యాప్తంగా ఎందరో ఉన్నారు. వాళ్లలో నేనూ ఒకడ్ని... సార్ చెప్పేది వాస్తవం అనే భావనకు అందరం దగ్గరవడానికి కారణం సార్ 'ఆచరణే'. ఆలోచన, ఆచరణకు మధ్య సరిహద్దులు లేని చోటంటూ ఏదైనా ఉంటే అది బాలగోపాల్ సారే...

## మా జిల్లాల్లో సార్ రాకే ఓదార్పు

అటువంటి సార్ గురించి నేను రాయడమా. ఆ అర్హతను కలిగి ఉన్న వాణ్నేనా? సార్ గురించి రాయాలనుకున్నప్పుడల్లా... నా ముందు నిలబడే మరో ప్రశ్న సార్‌ను గురించి ఎవరికీ తెలియనిది... ఏం చెప్పదలుచుకున్నావు..? అని. దాంతో పెన్నుకు ముందుకు కదిలేది కాదు. చాలా సందర్భాల్లో నాకు ఆశ్చర్యంగా ఉండేది – సార్‌తో ఎంత మారుమూల ప్రాంతానికి వెళ్లినా "మాది మానవహక్కుల వేదిక అండి.. నా పేరు బాలగోపాల్" అని సార్ అన్నప్పుడు సార్‌ను తెలిసినట్లే, ఆత్మీయుడిగా భావిస్తూ గుర్తుపట్టే ప్రజలు... వాళ్ళ కళ్లలో ఆరాధనా... ఆదరణ భావం ఎంత స్పష్టంగా కనబడేదో... "సార్... మన కోసం వచ్చిండు..." అనేవారు. పోలీసుల కాఠిన్యాన్ని తెలిసిన ప్రజలు ఎవరితో మాట్లాడితే ఏమౌతుందో అనే భయాన్ని సార్ ముందు వదిలి అన్ని విషయాలు చెప్పుకునేవారు. ఎన్‌కౌంటర్లతో, పోలీసుల జులుంతో సతమతమైన తెలంగాణలోని ఉద్యమ ప్రాంతాల ప్రజలు సార్ వచ్చి వెళితేనే ఎంతో ఓదార్పును పొందేవారు. అటువంటి సార్ గురించి నేను ఏం రాసినా సాహసమే కదా...?

సార్... ఒక్క తెలంగాణ పల్లెలకు మాత్రమే పరిచయమా? ఆంధ్ర, రాయలసీమలకు వెళ్లినా సార్‌ను ఇలాగే గుర్తుపడతారు. అయితే... ఆంధ్రప్రదేశ్‌కు మాత్రమే పరిమితమా? కాశ్మీర్, అస్సాం, తమిళనాడు, మణిపూర్, ఢిల్లీ, మహారాష్ట్ర, కర్ణాటక, బీహార్, బెంగాల్, గుజరాత్, ఒరిస్సా... ఒక్క మాటలో చెప్పాల్సి వస్తే దేశంలో ఎన్ని ప్రాంతాల్లో, ఎన్ని రూపాల్లో ప్రజలు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు, ప్రజాస్వామిక, సమానత్వపు హక్కుల కోసం పోరాడుతున్నారో... అన్ని ప్రాంతాల ప్రజా ఉద్యమాలూ సార్‌ను గుర్తుపడతాయి. గుర్తుంచుకునే స్థాయిలో ఆయా ఉద్యమాలలో సార్ మమేకం అయినాడు. అయినా ఒక్క మన దేశానికి చెందిన పరిధిలోనే సార్‌ను ఇమడ్చలేము. అమెరికావారి బహుళజాతి సంస్థలు ఏ దేశాలపై ఎటువంటి అణచివేతను ప్రయోగిస్తున్నాయో... వారి ఆర్థిక నమూనాల అమలు వల్ల ఏ దేశ ప్రజల జీవన ప్రమాణాలు, హక్కులు ఎంతగా దిగజారగలవో... ముఖ్యంగా వారు

చేస్తున్న మానవ హక్కుల ఉల్లంఘనలను రుజువులతో సహా నిర్ధారించి ఉపన్యాసాల ద్వారా, వ్యాసాల ద్వారా... సమాజం ముందు ఉంచేవాడు. అంటే సార్ విశ్వమానవుడు... విశ్వవ్యాప్త ప్రజాహితం కోరి... అందుకు తన పాత్రను నిజాయితీగా, బాధ్యతగా, అవిశ్రాంతంగా ఆచరించినవాడు.

తెలంగాణ ఉద్యమానికి సంబంధించిన సభల్లో "సార్‌ను వక్తగా పిలుద్దాం..." అంటే "సార్ ఆంధ్ర కదా..." అని అడ్డు చెప్పిన నాయకులు ఉన్నారు. విచిత్రంగా వాళ్లంతా సార్‌తో ఏదో స్థాయిల్లో పనిచేసినవారే... సార్ వస్తే వారి ప్రాధాన్యం తగ్గుతుందని వాళ్ల భయం. ఈ విషయం సార్‌కు కూడా తెలిసింది. "ప్రజల దగ్గరకు వెళదాం... వారికి చాలా సమస్యలు ఉన్నాయి. అక్కడే పని చేసుకుందాం..." అని సార్ మమ్మల్ని సమాధానపరిచాడు. తెలంగాణ ఏర్పాటు గురించి ఆంధ్ర ప్రాంతంలో కూడా ఎంతో ప్రచారం చేసిన వాడాయన. అక్కడి వాళ్ల ప్రశ్నలకు జవాబులు చెప్పినవాడు. నదీ జలాల పంపిణీలో అసమానతలను వాళ్లకూ వివరించినవాడు. అంతేకాదు... తెలంగాణ ప్రాంతంలో జరుగుతున్న ఓపెన్‌కాస్ట్ విధ్వంసానికి, అసమాన నదీజలాల పంపిణీకి, పరిశ్రమల కాలుష్య సమస్యలకు, సింగరేణి కార్మికుల సమ్మెలపై నిర్బంధానికి, గని ప్రమాదాలకు, ఎన్‌కౌంటర్, లాకప్ మరణాలకు వ్యతిరేకంగా పోరాట కమిటీలను నిర్మిస్తూ పనిచేసాడు. తెలంగాణ ఉద్యమాన్ని సమస్యల ప్రాతిపదికన నిర్మించాలని, ప్రజాస్వామిక ఉద్యమాలు, డిమాండ్లతో తెలంగాణ ఉద్యమం నిర్మితమైతేనే తెలంగాణ ప్రజలకు మేలు జరుగుతుందని నమ్మి ఆచరించిన సార్... బాలగోపాల్‌గారు.

* * *

## ఆరోజు మేమే సార్ దగ్గరికి వెళ్లాం

ఆ రోజు జీవన్‌సార్ నుండి నాకు ఫోన్ రాంగానే వసంత మేడంకు ఫోన్ చేస్తే... "అన్వర్... సార్... బాగాలేదయ్యా... ముక్కులో నుండి రక్తం వస్తుంది. 108 కు ఫోన్ చేసాము. త్వరగా రండయ్యా..." అని ఆందోళనతో అంటుంటే భరించలేని స్థితిలో మొద్దుబారుతున్న నా శరీరం... శ్వాస పెరిగింది. మెదడొక్కటే... చిందర వందరగా పని చేస్తున్నట్లుగా ఆలోచనలు మొదలయినవి. అది మాత్రం జరుగవద్దు. అది... అంటే...? నా మనస్సులో భయం పెరుగుతున్న తీవ్రత నాకు స్పష్టంగా తెలుస్తున్నది... సార్‌కు ఏమీ కాదు... అసలు సార్‌కు ఏమైనా ఎందుకు అవుతుంది? హైద్రాబాద్‌లో డాక్టర్లు ఎందరు లేరు? ఈ రాత్రికి నేను వెళ్లను. సార్‌కు ఏమీకాదు. నేను వెళ్లాల్సిన అవసరం ఏం రాదు... అనుకుంటూ నా మనస్సును, చెలరేగుతున్న ఆందోళనను సమాధాన పరుచుకోవడానికి ప్రయత్నిస్తున్నా...

సార్‌కు ఏమైంది...? అవసరం లేదు. నేను వెళ్లడమేమిటి... భయం ఇంకా పెరుగుతున్నది... ఏం కాదు... నేను వెళ్లను... వెళ్లాల్సిన అవసరం రావద్దు. అక్కడ డాక్టర్లు ఉన్నారు. తిరిగి... తిరిగి అక్కడికే వస్తున్న ఆలోచనలతో నేను ఇంటి నుండి బయటపడ్డాను. ఎవరెవరికో ఫోన్‌లు చేస్తున్నా... సార్‌కు ఏం జరగొద్దు... అనుకుంటూనే ఏం జరిగిందో అని ఆందోళన పడుతున్నా... అందరూ బయలుదేరమంటున్నారు. ఏ పరిస్థితుల్లో బయలుదేరమంటారో కూడా అర్థంకాని స్థితి అది. ఎవరూ ఏమీ చెప్పడం లేదు ఎందుకు? ఏమన్నా అయితే చెప్పరా..? సార్‌కు ఏమీ కాదు... నరనరాన స్పందన ఒక్కటే "సార్‌కు ఏం కారాదు... నేను వెళ్లడం కూడా అనవసరం..." సుడులు సుడులుగా తిరుగుతున్న ఆలోచనలతో బస్సు ఎక్కాను. పాశం యాదగిరి నుండి ఫోన్ వచ్చింది. "అన్వర్ సార్ మనకికలేడు... వచ్చేయ్..." అన్నాడు. ఇప్పటి దాకా నేను కోరుకున్నది ఏమిటి? తెలిసింది ఏమిటి? అణచుకుంటున్న ఆందోళనంతా దుఖంగా మారింది. ఏడ్వడం తప్ప నాకు ఏం తోచడం లేదు. ఏడుస్తూనే అందరికీ ఫోన్‌లు చేయడం మొదలు పెట్టాను. "ఛ... ఇది... ఎట్లా జరుగుద్ది..." అంటూ నమ్మలేక ఫోన్ పక్కన పడేస్తున్నారు. టీవీల ద్వారా తెలుసుకుంటున్నవాళ్లు నమ్మకం కుదరక మళ్లీ మళ్లీ ఫోన్‌లు చేసి నిర్ధారించుకుంటున్నారు. "సార్ బతికుండాలె" అనే బలమైన భావన వల్ల సార్ లేడన్నది నమ్మలేక పోతున్నారు. ఆప్తులందరూ "ఈ వార్త అబద్ధం" కావాలనే కోరుకుంటున్నారు. ఆ సమయంలో... వాస్తవాన్ని అబద్ధంగా మార్చుకోవడానికి ఎందరు ప్రయాసపడుతున్నారో... ఒక్క రోజు వెనకకు వెళితే సార్ బతికి ఉన్నాడు. ఈ రోజు రద్దయి మళ్లీ నిన్నటి రోజు నుండి మొదలయితే ఎంత బాగుండు... ఈ రోజు జరిగిందంతా అదృశ్యం అయితే ఎంత బాగుండు... అందరి అంత:స్థితీ ఇదేనేమో... ఇక ఇంట్లో ఎవరు నిలబడగలరు? అందరూ ఆ రాత్రే బయట పడుతున్నారు. రేపటి గురించి... పనుల గురించి... ఎవరు ఆలోచిస్తున్నారు? రాత్రనక, పగలనక, ఎండనక, వాననక, బాధితులందరి దగ్గరికి పయనమయ్యే బాలగోపాల్ సార్ వద్దకు అందరూ బరువెక్కిన దు:ఖపు గుండెలతో పయనమవుతున్నారు.

* * *

ఉదయం 4 గంటలకు సార్ ఇంటికి వచ్చేసరికి మీడియా హడావిడిగా ఉన్నది. సార్ వద్దకే వెళ్లాను. ఎప్పటిలాగానే ఎవర్నీ పట్టనట్లుగా ఎలక్ట్రికల్ ఫ్రిజ్‌లో కళ్లజోడుతో నిద్ర పోతున్నాడు సార్... ఆరోగ్యంగా ఉన్న మనిషి... మంచి నిద్రలో ఉన్నట్లుగా ముఖంలో అదే కళ... మనిషికి ఏమీ కాలేదు అన్నట్లుగా... బ్రతికే ఉన్నానన్నట్లుగా భ్రమలు కల్పిస్తున్నాడు. ఎవరికీ జడవని తత్వాన్నే ప్రదర్శిస్తున్నాడు. చుట్టూ మూగిన

అందరి ఏడ్పుల్ని కూడా పట్టనట్లుగా ఉన్నాడు సార్. ఎక్కడైనా ఎవరైనా ఏడుస్తున్నారని తెలిస్తే సార్ ఇంట్లో ఉండేవాడా...? రవాణా సౌకర్యం గురించి ఆలోచించేవాడా...? కాలి నడకన ఎన్ని గుట్టలు ఎక్కలేదు? అడవుల్లో ఎన్ని మైళ్లు నడవలేదు? నోరులేని ప్రజల గొంతై ఎంతగా ప్రశ్నించాడు? ఇప్పుడు మాత్రం అందర్నీ ఏడిపిస్తున్నాడు. కనీసం ఎందుకు ఏడుస్తున్నారని కూడా అడగడం లేదు. సార్‌ను నాలుగు గంటలకు తీసుకువెళదాం... అని జీవన్‌గారు చెప్పిన తరువాత... నాకు మరింత ఏడ్పు మొదలయింది. ఇంకో గంటనే కదా సార్ మా మధ్య ఉండేది... తరువాత... ముందున్నదంతా దు:ఖమే.. అన్నీ జరిగిపోతున్నాయి. జరగొద్దు... అని అనుకున్నవన్నీ జరుగుతున్నాయి. ఇప్పుడు ఇంకో గంటలో సార్ ఇక మాతో ఉండడు. ఒక్కొక్కటిగా తలుచుకుంటుంటే చెప్పరాని బాధ మొదలవుతున్నది. సార్‌తో నాకున్న పరిచయాన్ని తెలిసిన వారంతా ఫోన్‌లో నన్ను ఓదార్చుతున్నారు. నా ద్వారా సార్ గురించి విన్నవారంతా ఇంట్లో మనిషిని కోల్పోయినట్లుగా బాధపడుతున్నారు. ఇతరులనుఓదార్చేంత శక్తిని సార్ నాకు ఎప్పుడు కట్టబెట్టాడో.... సమయం వెనకకు వెళ్లదు. వద్దని ఎంత కోరుకున్నా... అన్నీ ముగిసి పోతున్నాయి. సార్ వేలాది మంది జనంతో కల్సి వెళుతూ తనొక్కడే తిరిగిరాని లోకాలకు వెళుతున్నాడు. అన్నీ గుర్తుకొస్తున్నాయి. స్టేట్ ఇ.సి. మీటింగ్‌కు రావని మందలింపులు ఇక నాకు ఉండవు. మీటింగ్‌లలో కనబడకపోతే 'అన్వర్ రాలేదా?' అని సార్ చేసే వాకబులు... కనబడితే వేసే సీరియస్ జోకులు.., పని చేస్తాడని నా గురించి ఇతరులకు చెప్పే మెచ్చుకోలు మాటలు... అన్నీ నాకు దూరంగా జరిగిపోతున్నాయి. సమయం చెడ్డది... అన్నింటిని నాకు దూరం చేస్తున్నది. సార్‌ను కడసారి చూసుకున్నాను. ఎన్నడూ కూడా ఊహించని స్థితిలో సార్‌ను... చితిమీద... అంతా అయిపోతున్నది... భారంగా ఆలస్యంగా... ఒక్కొక్కరుగా... అక్కడనుండి కదలలేక కదులుతున్నారు. సార్‌కు వీడ్కోలు... ఒడవని దు:ఖం ఒడిలో కట్టుకున్నా... సార్‌కు... వీడ్కోలు... చితి మండుతూనే ఉంది.

* * *

## ఆయన నడవడికే మాకు ప్రమాణం

నేను, కృష్ణ, బేల, విశాఖ నుండి విమానంలో వచ్చిన కొందరు మిత్రులము అక్కడే ఉన్నాము. బేల ఉదయం నుండి చెబుతున్నది. సార్ చేసిన పనులు మనం చెయ్యాలని అంటున్నది. సార్ నేర్పింది ఆచరించాలంటున్నది. అప్పుడే సార్ ఆత్మ తృప్తి చెందుతుందని, ఏడ్వకూడదని చెబుతున్నది. సార్ వదిలి వెళ్లిన పనులు శక్తి మేరకు పూర్తి చేయాలని అంటున్నది. నాకు ఎక్కడా... సమాధానం దొరకలా... ఎందుకంటే ఎవరూ పూరించలేని పాత్రను సార్ పోషించాడు. ఎదుటి వాళ్లను ఎంతగానో

ప్రభావితం చేసాడు. డబ్బును, హోదాను, సౌఖ్యాలను, భయాన్ని జయించాడు. అవన్నీ పరుల కోసం ఉపయోగపడే మనిషికి అనవసరం అనుకున్నాడు. జ్ఞానం, శ్రమ అన్నీ ప్రజలకే చెందాలన్నాడు. ఇవి వారిచ్చినవే అని ఆ కృతజ్ఞత కూడా శ్రమ చేయడం ద్వారానే చెల్లించుకోవాలన్నాడు, ఆచరించి చూపాడు. మాటలు చెప్పే వారిని మౌనంగా ఆచరణలోనే ప్రశ్నించాడు. జవాబు చెప్పడం ఎవరి తరం? ఒక్క సారే కాదు ఇంకా కొందరు కూడా ఉండవచ్చును. సార్ గురించి మాత్రమే నేను చెప్పగలను.

సార్ నాకే కాదు మాలో ఎవరికీ ఏదీ నోటితో చెప్పలేదు. సార్ నడవడికే ఎట్లా బ్రతకాలో నిర్ణయించుకోమని చెప్పేది. సమాధాన పడటం, నిర్ణయాలు తీసుకోవడం ఎదుటివారి వంతుగా మారేది. సార్‌ను వెతుక్కున్న, అనుసరించిన అందరి అంతర్ అనుభవము ఇదే... సార్‌తో కల్సి ఎన్ని పనులు ఎత్తుకున్నాం. వాటి బరువు తెలిసిందా? వాటి ప్రభావాలు మమ్మల్ని ఎందుకు భయపెట్టలేదు? వెనకడుగుకు స్థానం ఎక్కడుంది? సార్ ఇచ్చే చైతన్యం భయాన్నీ జయించేది. కోడి పిల్లలను తన రెక్కల్లో దాచుకున్నట్లుగా సార్ మమ్మల్ని కాపాడుకున్నాడు. ఇప్పుడు తల్లి కోడి లేదు... భరోసా ఎక్కడ..? నాకు తీరని దు:ఖమే మిగిలింది.

* * *

సార్‌ను నేను చూసింది 1990 ముందు పత్రికల్లోనే. తెలంగాణ జిల్లాల్లో విప్లవ విద్యార్థి, యువజన, రైతుకూలి ఉద్యమాలు జరుగుతున్నపుడు ఉద్యమకారుల్ని, సానుభూతిపరుల్ని చెట్లకు కట్టి కాల్చి చంపడం, అమాయకులను నిర్బంధాలకు గురిచేయడం, ఇండ్లను కూల్చడం, ధాన్యాన్ని బావుల్లో పారబోయడం వంటి రాక్షస కృత్యాల పాలనా దినాలు అవి. ప్రతీదినం ఎన్‌కౌంటర్ హత్యలను బ్యానర్లుగా మోస్తున్న పత్రికలు... నేను ఉదయమే దగ్గరలో ఉండే మంగలి షాప్‌కు వెళ్లి పేపర్ వార్తలను ఆసక్తిగా చదివేవాణ్ని. సార్ ఎన్‌కౌంటర్ల వెనుక ఉన్న అసలు నిజాలను బయట ప్రపంచానికి తెలియజేసేవాడు. రాజ్యాన్ని ప్రశ్నించేవాడు. ఒక రోజు 'ఉదయం' డైలీ పేపర్‌లో సార్ ఫోటో వేసి కిడ్నాప్‌కు గురైనట్లు వార్త రాశారు. దొడ్డుగా ఉండే అద్దాలు పెట్టుకున్న ఫోటో అది. 'అతడు తన సోడాబుడ్డీ అద్దాల్లోంచి నిషేధించబడిన భవిష్యత్ చిత్రపటాన్ని చూసాడని, అణగారిన ప్రజల హక్కుల కోసం తపిస్తాడని" అటువంటి కొన్ని వ్యాఖ్యలతో సార్‌ను గురించి రాసారు. అవి చదివి నా స్కూల్లో అందరికీ నాకు తెల్సినట్లే చెప్పేవాణ్ణి. సార్ కిడ్నాప్ అవడానికి ముందు వెళ్ళిన పాడేరు (ఖమ్మం జిల్లా) గ్రామానికి ఇటీవల సార్‌తో కల్సి వెళ్లడం జరిగింది. చాలామంది సార్‌ను గుర్తుపట్టారు. ఆ సంఘటనను, ఆనాటి నిర్బంధ పరిస్థితులను గుర్తు చేసారు. చంద్రపుల్లారెడ్డి నాయకత్వంలోని గోదావరీ లోయ ప్రతిఘటన పోరు నిర్మించిన అటవీ

గ్రామాల వరుస అది. ఇప్పుడు వాళ్ల ఊళ్లను విధ్వంసం చేస్తూ అక్కడ ఓపెన్‌కాస్ట్‌లు వస్తున్నాయి. నాడు భూమికోసం విప్లవ పార్టీల నాయకత్వంలో పోరాడిన వాళ్లు ఆ భూమి నేడు వాళ్లకు కాకుండా పోతున్నా... తిరగబడలేకపోతున్నారు. వారి పోరాటానికి సార్ అప్పుడు మద్దతిచ్చాడు. నిర్బంధానికి వ్యతిరేకంగా నిలబడ్డాడు. 25 సంవత్సరాల తరువాత కూడా సారే మళ్లీ వాళ్ల దగ్గరికి వెళ్లి 'మేము అండగా నిలబడుతాము. విధ్వంసక అభివృద్ధికి వ్యతిరేకంగా నిలబడమని, వాళ్లకు ధైర్యం చెప్పాడు. భూమి హక్కుల గురించి వివరించాడు. మళ్లీ మళ్లీ వస్తానన్నాడు. వేరే వారు చెబితే ఏమందురో కాని సార్ చెబుతుంటే వాళ్లకు బలమైన గురి ఏర్పడింది. గతం నుండి నేటి వరకు మారని సార్ నిజాయితీ... ఏర్పర్చుకున్న ఉద్యమ సంబంధమే అందుకు కారణమేమో. కిడ్నాప్ గురించి ముసలివాళ్లు కొందరు మళ్లీ మళ్లీ గుర్తు చేస్తుంటే గతంలో జరిగింది... అయిపోయింది... ఇప్పుడేమిటి? అన్నట్లుగా సార్ ఏ భావమూలేనితనంతో ఉండిపోయాడు. అక్కడి నుండి బయలుదేరిన తరువాత ఆ రోజు ఏం జరిగిందని అడిగితే క్లుప్తంగా చెప్పి ముగించాడు, ప్రాధాన్యం లేని విషయం లాగా.

## 1990లో మొదటిసారి చూశాను

1990లో రైతుకూలీ సంఘం మహాసభలకు వరంగల్ వెళ్లాను. కాళోజీ ప్రారంభోపన్యాసం తరువాత బాలగోపాల్ సార్ మాట్లాడాడు. సార్‌ను నేను మొట్టమొదటిగా చూడటం అప్పుడే. సార్ మాట్లాడుతుంటే గమ్మత్తుగా తోచేది. వేగంగా బ్రాహ్మలు మంత్రాలు జపిస్తున్నట్లుగా మాట్లాడేది. మన మెదళ్లకు పని పెట్టాలే.. వేగంగా ఆ మాటల వెంబడి పరుగెత్తాల... సార్ భూమి పంపకం గురించి చెప్పాడు. మిగులు భూముల వివరాలు చెప్పాడు. భూమిలేని పేదల సంఖ్య చెప్పాడు. భూ పోరాటాల వెనుక ఉన్న ప్రజల అవసరాలను, జీవించే ఆకాంక్షలను సమర్థించాడు. సారాంశంగా నేను గుర్తుంచుకున్నది ఇదే. అప్పుడే భూ ఆక్రమణ పోరాటాలు ఉధృతంగా మారాయి.

1992లో సార్‌ను నేను రెండోసారి కరీంనగర్ ఎపిసిఎల్‌సి మహాసభల్లో చూశాను. భూమయ్య సార్ నాకు సౌహార్ద్ర ప్రతినిధి బ్యాడ్జి ఇచ్చి హాల్లోకి పంపాడు. సార్‌ను మరింత దగ్గరగా చూసింది అప్పుడే. సార్ స్టేజీపై ఉంటే హాల్లో, బయటకు వస్తే బయటకు, మున్సిపల్ గెస్ట్‌హౌస్ వద్దకు కన్నాబిరాన్ గారితో కల్సి భోజనానికి వెళితే అక్కడకు సార్‌ను చూస్తూ వెళ్లడమే నా పని అప్పుడు. హక్కుల సంఘంలో చేరాలన్న కోరిక ఉండేది. చేరలేను. ఎందుకంటే సార్‌ను సాహసికునిగా చూసే దృష్టికోణం తప్ప హక్కుల తాత్వికతను అర్థం చేసుకునే మానసిక పరిణితి నాకు

అప్పటికి లేదు. 1993లో మరోసారి టాడాకు వ్యతిరేకంగా కరీంనగర్‌లో సభ పెడితే హాజరైనాను. సార్, కన్నాబిరాన్ గారు మాట్లాడారు. హక్కుల సంఘాల కార్యకలాపాలు అప్పుడు పత్రికల ద్వారా మాత్రమే తెలిసేవి. వార్తలు చూసుకొని వెళ్లడమే తప్ప ఒకరిని ఒకరు ఫోన్‌ల ద్వారా పిలుచుకోవడం, పిలుచుకున్నా రాకపోవడం వంటి అవలక్షణాలు తక్కువే... పత్రికల ద్వారా హక్కుల ఉద్యమాన్ని సార్ ప్రజల్లోకి ఎక్కువగా తీసుకెళ్లడం వల్లనే చాలామందికి రాజ్యాంగ హక్కుల పట్ల ఆసక్తి కలిగింది. తెలుగు పత్రికలకు, పాఠకులకు కూడా హక్కుల స్పృహను సారే అందించాడనడం అతిశయోక్తి కాదు. మరోసారి 1994లో గోదావరిఖనికి వక్తగా వచ్చినపుడు చూశాను.

1996లో ఎపిసిఎల్‌సి గుంటూరు మహాసభలకు ముందు కరీంనగర్ జిల్లా కార్యవర్గ సమావేశం సుధాకర్‌రెడ్డి గారింట్లో జరిగింది. డా॥ తిరుపతి నన్ను సభ్యుడుగా చేర్పించాడు. ఆ తరువాత జరిగిన మహాసభల్లో సార్ నాయకత్వ బాధ్యతల్లోంచి తప్పుకున్నాడు. అప్పట్నించి అమరుడు పురుషోత్తం ఎక్కువగా కరీంనగర్ జిల్లాకు ఎన్‌కౌంటర్లపై నిజనిర్ధారణలకు వచ్చేవాడు. ఎవరి పని విధానం ద్వారా నేను హక్కుల ఉద్యమంలోకి వచ్చానో ఆ... సార్... నాకు కనబడని రోజులు అవి. హక్కుల దృక్పథం పని విధానం గురించి ఎవరితో చర్చించినా సార్ చెబుతున్నదాన్ని తప్పుగా ఎవరూ అర్థం చేయించలేకపోయేవారు. విచిత్రంగా మాటలవరకైతే మళ్లీ సార్‌నే సమర్థించేవాళ్లు. ఇంతలో మానవ హక్కుల వేదిక ఏర్పడింది. నా వెతుకులాట క్రమంలో నేను మళ్లీ సార్ దగ్గరకే వెళ్లాను. పురుషోత్తం మరణించిన తరువాత కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాలలో ఎపిసిఎల్‌సి పనులు ఎవరూ కొనసాగించలేదు. మళ్లీ బాలగోపాల్‌సారే ఎన్‌కౌంటర్లతో పాటుగా హక్కుల ఉద్యమాన్ని అన్ని రంగాలలో విస్తృతపరిచాడు. ఇది ఆంధ్రప్రదేశ్ హక్కుల ఉద్యమం పని తీరులోనే వచ్చిన మార్పుగా చూడవచ్చును.

## 'సేవ్ సింగరేణి' సార్ పుణ్యమే

గోదావరిఖని పారిశ్రామిక ప్రాంతంలో తిరిగి ఎన్‌టిపిసి యాష్‌పాండ్‌వల్ల సమీప గ్రామాల ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను సేకరించాడు. ప్రజల వద్ద సంతకాల సేకరణ జరిపి హైద్రాబాద్ పొల్యూషన్ బోర్డుకు వెళ్లి స్వయంగా ఫిర్యాదు చేసి అధికారులచే యాష్‌పాండ్‌ను బంద్ చేయించాడు. నిర్దిష్టమైన డిమాండ్లతో పనిచేస్తే సమస్య పరిష్కారం అవుతుందని చెప్పాడు. ఉత్తర తెలంగాణ జిల్లాలోని అతిపెద్ద ప్రభుత్వరంగ సంస్థ అయిన సింగరేణిలో వస్తున్న మార్పులపై దృష్టిపెట్టాడు. మిత్రులు రూపొందించిన "సింగరేణి" (తెలంగాణ బొగ్గుగనులపై వాస్తవిక నివేదిక) పుస్తకాన్ని పర్‌స్పెక్టివ్స్‌తో ప్రచురింపజేశాడు. ఆ పుస్తకంలో సింగరేణి బొగ్గుగనులు తెలంగాణ

ప్రజలకు ఉద్యోగ వనరులుగా కొనసాగాలని, అందుకు సింగరేణి రక్షణ ఉద్యమమే మార్గమని 'సేవ్ సింగరేణి' పోరాట సంఘాన్ని ఏర్పరచారు. సింగరేణి ఉద్యమం మానవహక్కుల వేదికదిగా భావించరాదని, సింగరేణి సంస్థ రక్షణ ఎజెండాగా పెట్టుకుని పని చేయాలని చాలా మందిని కలిసి ఒప్పించాడు. జగన్మోహనరావు, పోరెడ్డి వెంకటరెడ్డి, చంద్‌లాంటి వారు 'సేవ్ సింగరేణి'ని కరీంనగర్ నుండి ఆదిలాబాద్ జిల్లాలోని కోల్‌బెల్ట్ ప్రాంతాలకు విస్తరింపజేసారు. సింగరేణిలో ప్రైవేటీకరణ వ్యతిరేక ఉద్యమానికి సార్ నిర్మించిన 'సేవ్ సింగరేణే' ప్రేరణ.

సార్‌ను పీపుల్స్‌వార్ మద్దతుదారుగా మా ప్రాంతంలోని విప్లవ పార్టీల వాళ్లు భావించేవారు. అయినా ఏదైనా సదస్సులో మాట్లాడాల్సివస్తే సార్‌నే అందరూ వక్తగా పిలిచేవారు. రాజకీయాల జోలికి వెళ్లకుండా సార్ విషయం మీదనే మాట్లాడేవాడు. సార్‌ను ఒక గ్రూప్‌కు చెందిన వ్యక్తిగా అపోహపడే అందరూ కూడా విచిత్రంగా సార్ అంటే మాత్రం గౌరవంగా ఉండేవారు. అది ఒక్కసార్‌కు మాత్రమే దక్కిన విలువ.

ఓపెన్‌కాస్టు ప్రాజెక్టుల వల్ల జరగనున్న విధ్వంసాన్ని, పర్యావరణ నష్టాలను గుర్తించి జగన్‌మోహన్‌రావు "మరో సరస్వతి కానున్న గోదావరి" వ్యాసం రాసి ఈ సమస్యను ముందుకు తెచ్చాడు. సార్ ఈ సమస్యపై ఉత్తర తెలంగాణలోని నాలుగు జిల్లాలోనూ విస్తృతంగా తిరిగాడు. సమస్యలు తెలుసుకున్నాడు. బలమైన ప్రజా నిరసనే పరిష్కారంగా భావించి ఓపెన్‌కాస్టు వ్యతిరేక పోరాట కమిటీలను నిర్మించాడు. గ్రామాల్లో సదస్సులు పెట్టాడు. హక్కుల గురించి చెప్పాడు. ప్రజా చైతన్య యాత్రలు జరిపి గ్రామ గ్రామానికి సమస్యను తీసుకువెళ్లాడు. ఈరోజు ఒసి ప్రాజెక్టుల ప్రజాభిప్రాయ సేకరణలలో టెంట్లు కూలుతున్నాయంటే, ప్రజలు నిలదీస్తున్నారంటే, ప్రాణాలు పోయినా ప్రాజెక్టులు రానివ్వమని ఎదురు తిరుగుతున్నారంటే దాని వెనక బాలగోపాల్ సార్ పడిన శ్రమ ఎంతో ఉన్నది.

## బొగ్గు గనుల్లోకీ దిగాడు

సింగరేణిలో రెండుసార్లు భారీ ప్రమాదాలు జరిగాయి. ఒకసారి గనిలోకి నీళ్లు వచ్చి 17 మంది చనిపోగా ఇంకో సంఘటనలో పైకప్పుకూలి 10 మంది కార్మికులు ఒకేసారి మరణించారు. ప్రభుత్వం జస్టిస్ బిలాల్ నజ్కీ, డిప్యూటీ మైన్స్ సేఫ్టీ ఆఫీసర్ రుద్రగార్లతో కోర్టు ఆఫ్ ఎంక్వైరీ జరిపించింది. సార్ రెండు బొగ్గుగనుల్లోకీ దిగి చూశాడు. ప్రమాద కారణాలను కార్మికులను ఇండ్లలో రహస్యంగా కలిసి సేకరించాడు. ఎన్నిసార్లైనా విసుగుపడకుండా ఒక్కరి కోసమైనా వచ్చి తిరిగి రికార్డు చేసేవాడు. సింగరేణి అధికారులు తమ తప్పు లేదని వ్యక్తిగతంగా వచ్చి కలిసి వివరణ ఇచ్చుకుంటే. అది కోర్టులో చెప్పుకోమన్నాడు సార్. వారికి ఎక్కడా లొంగుబాటును చూపలేదు.

ప్రతీ విచారణకు హాజరైన సార్ కార్మిక సంఘాల వాదనను ఇంగ్లీషులోకి మార్చి కోర్టుకు చెప్పేవాడు. ఒకరోజు కంపెనీ వకీలు వచ్చి కలిసి లంచ్ చేద్దామని అభ్యర్థించింది. "నా ఫ్రెండ్ ఉన్నాడు. అక్కడికే వెళతాను" అని సార్ మరో అవకాశం లేకుండా తల తిప్పుకున్నాడు. చిన్న విషయంలో కూడా లొంగని తత్వం సార్‌ది. మరోసారి విచారణ అనంతరం కంపెనీ డైరెక్టరు వచ్చి 'బాలగోపాల్ మేము హంతకులమా...? మా తోటి కార్మికులను కావాలని చంపుతామా...?' అన్నాడు. 'మీ దృష్టంతా ఉత్పత్తి లెక్కల మీదనే ఉంది. హంతకులా... కాదా... మీరే తేల్చుకోండి' అన్నాడు సార్. 'రక్షణ, ఉత్పత్తి రెండూ యాజమాన్యాల బాధ్యతే. రెండోదానికి ప్రాధాన్యతనిచ్చి మొదటిదాన్ని వదిలేస్తే... అందుకు మూల్యం కార్మికుల ప్రాణాలయితే, హంతకులు... ఎవరు?' అన్నాడు. సార్ విశ్లేషణ ఎదుటివారికి మాటల్ని కరువు చేస్తుంది.

రెండు ప్రమాదాల్లోనూ అధికారుల పాత్రను తప్పుపట్టి ప్రత్యామ్నాయాలను చూపిస్తూ విచారణ నివేదిక వచ్చిందంటే దానికోసం సార్ పడిన తపన సింగరేణి బొగ్గుగని కార్మిక శ్రేణి ఎన్నడూ మరువదు.

ఎన్నో ఎన్‌కౌంటర్, లాకప్ హత్యలకై సార్ వచ్చి నిజనిర్ధారణలు జరిపేవాడు. చనిపోయినవారి హోదాలకు ఎన్నడూ ప్రాధాన్యాన్ని ఇవ్వలేదు. ఒకసారి ఆదిలాబాద్ జిల్లా కోటపల్లి మండల అటవీ ప్రాంతంలో పసుల చంద్రయ్య అనే గిరిజనున్ని చెట్టుకు వేలాడదీసి పోలీసులు కొడితే చనిపోయాడు. విషయం తెలిసిన వెంటనే సార్ వచ్చాడు. గ్రామానికి వెళ్లాలంటే వాగు దాకా జీపులో వెళ్లాలి. తరువాత పది కి.మీ. అడవిలో నడిస్తేనే గ్రామానికి చేరుకుంటాం... డ్రైవరు సహకరిస్తే వాగుదాటి గ్రామం దాకా కూడా వెళ్లగలము. మొదట రోడ్డు బాగాలేదని జీపు డ్రైవర్ రానన్నాడు. తర్వాత సార్‌ను గుర్తుపట్టి వచ్చాడు. డ్రైవర్ మాజీ అంట... సార్ పేరు చెబితే... దొరికే ఆదరణే వేరు. అక్కడ వివరాలు రాసుకున్నాక గ్రామస్థులు డికాషన్ తెచ్చి ఇచ్చారు. నేను తాగలేక ఒలకబోసాను. సార్ మాత్రం మొత్తం తాగి 'ఇంకా పోస్తారా...?' అన్నట్లు చూస్తున్నాడు. తిరిగి వస్తుంటే 'నేను తాగలేకపోయానని' చెప్పాను. 'దాన్ని రోజూ తాగే వాళ్లు బతికే ఉన్నారు కదా..." అన్నాడు. తిట్లు లేకుండా తిట్టడం సార్‌కే సాధ్యం. "తాగితే చస్తావా?" అన్నట్టుగా నాకు అనిపించింది.

ముదిగొండ కాల్పులు జరిగినప్పుడు వరంగల్‌లో మీటింగ్‌కు హాజరైన సార్‌ను ఎస్.ఐ. యాదగిరిరెడ్డి హత్యకేసులో వారెంట్ పెండింగ్‌లో ఉందని అరెస్టు చేసారు. మరునాడు కోర్టుకు సార్ హాజరు కావాల్సి ఉన్నది. నేను సార్‌ను చూడడానికి వెళ్లాను. పెద్ద బ్యాగులో పుస్తకాలతో వచ్చాడు సార్. "ఇంత లగేజి ఎందుకు"? అని అడిగా

"పెండింగ్‌లో ఉన్న వారెంట్ కదా... జైలుకు వెళ్లాల్సిందే..." సిద్ధపడ్డట్టుగా చెప్పాడు. నాకు షాక్ కొట్టింది. ఇదే స్థానంలో వేరే ఎవరైనా ఉంటే అక్రమ కేసని, ఏదో కుట్ర ఉందని టీవీ వాళ్లను పిలిపించుకొని మరీ రాద్ధాంతం చేసేవాళ్లు...! సార్‌కు, వాళ్లకు ఎంత తేడా! ఈ కేసులో ఉన్న అందరిపై కేసు ఎత్తివేసినప్పుడు వారెవ్వరూ సార్ పేరును ఎందుకు తీయించలేదో... నాకు అర్థంకాలేదు. పనిచేసే వారికి జైలు కూడా కార్యస్థలమే. అందుకే సార్ జైలునైనా బయట సమాజాన్నైనా ఒకేలాగా చూస్తాడు.

ఒకసారి రామగుండం మున్సిపాలిటికి చైర్మన్ పదవి ఎస్‌సిలకు రిజర్వు చేయబడింది. పాత చైర్మన్ స్టే తీసుకువచ్చి పదవిలో కొనసాగడానికి ప్రయత్నించాడు. స్థానిక దళిత సంఘాల నాయకులతో కలిసి హైదరాబాద్‌లోని ఒక సీనియర్ దళిత న్యాయవాది వద్దకు వెళ్లాం. కేసు వాదిస్తాను కాని నాకు 30 వేలు, జూనియర్లకు 5 వేలు, కాగితాల ఖర్చు 5 వేలు ఇమ్మన్నాడు. దళితులు కాబట్టి తక్కువగా తీసుకుంటున్నానన్నాడు. వేరే వాళ్లయితే లక్షల్లో అడిగేవాడ్ని అన్నాడు. తరువాత సార్ వద్దకు వెళ్లాము. కేసు విని సార్ "దళితులకు ఛైర్మన్‌గిరి రిజర్వు చేయబడింది కాబట్టి స్టే తెచ్చాడు. బిసికి రిజర్వు అయి ఉంటే ఎన్నికల్లోకి వెళ్లేవాడు. అది రాజ్యాంగ విరుద్ధం" అని చట్టాన్ని నోటితోనే చెప్పాడు. "నా ఫీజు 500/-, కాగితాల ఖర్చు మరో 500/- ఇవ్వమన్నాడు. నాతో వచ్చిన దళిత నాయకులు "సార్ మీకు 40 వేలు ఇద్దామనుకుంటున్నాము" అన్నారు. "మీ వద్ద ఉంటే వుంచుకోండి... నా ఫీజు మాత్రం వెయ్యి... ఇస్తే ఇంకో వెయ్యి కలిపి ఇవ్వండి. అంతకన్నా నేను ఎక్కువ తీసుకోను" సార్ ఖచ్చితంగా అన్నాడు.

నేను అంతకు ముందు వకీలు అడిగిన ఫీజు విషయం చెప్పాను. "కోర్టుకు ప్రజలకు మధ్య ఫీజు రూపంలో అడ్వకేట్లు నిలబడి ప్రజలకు న్యాయం జరగడం లేదు అంటే ఎలా...?" అని సార్ అన్నాడు. సార్ ఆ కేసును వాదించినపుడు జడ్జి "విచిత్రంగా ఉందే బాలగోపాల్ మీరు ఎన్నికలను డిమాండ్ చేయడం" అన్నారు. కోర్టు హాల్లో నవ్వులు... తీర్పు అనుకూలంగా వచ్చి ఎన్నికలు జరిగి దళితుడే ఛైర్మన్ అయ్యాడు.

ఆదిలాబాద్ జిల్లాలో గిరిజనులు అతిసార, మలేరియాలతో మరణించిన ప్రతిసారీ సార్ బయల్దేరి వచ్చాడు. ఆ జిల్లా కమిటీకి ముందుగానే తాను వస్తున్నట్లు చెప్పేవాడు. వచ్చినప్పుడల్లా డాక్టర్లను నిలదీసేవాడు. ఆరోగ్యానికి సంబంధించిన నిజనిర్ధారణలలో డా॥ తిరుపతి సార్‌తో కల్సి వచ్చేవాడు. ప్రెస్‌నోట్లు రాసేముందు ఏం చెప్పాలో అతనితో చర్చించేవాడు. తెలిసిన విషయాల్లో సార్ ఎంత సాధికారికంగా ఉంటాడో తెలియని విషయాలను అడిగి తెలుసుకోవడంలో అంత వినమ్రంగా ఉంటాడు.

ఆరోగ్యశ్రీ గుండె ఆపరేషన్ మరణాల గురించి మా జిల్లా బాధ్యుడు అయిలయ్య సార్ దృష్టికి తీసుకువస్తే డా॥ తిరుపతి, డా॥ జగదీష్, డా॥ చంద్రభానులతో కలిసి మరణించిన అందరి ఇండ్లకు తిరిగాడు. ఆ పథకంలో ఉన్న లోపాలను డాక్టర్ల సూచనలతో ఎత్తి చూపాడు. కార్పొరేట్ హాస్పటళ్ల దోపిడీకి ఆరోగ్యశ్రీ పథకం ఎలా ఉపయోగపడుతున్నదో బహిరంగపరిచాడు. తరువాత ప్రభుత్వం ఈ పథకంలో కొన్ని మార్పులు చేసింది.

"ఒరిస్సా మరో గుజరాత్ కారాదు..." అనే కరపత్రాన్ని వేసి కరీంనగర్ జిల్లా కమిటీ హుజూరాబాద్‌లో సభ పెట్టింది. కరపత్రాన్ని చదివిన సంఘ్‌పరివార్ సభ్యులు సభకు ఆవేశంతో హాజరయ్యారు. ఉద్రిక్తతను గమనించి పోలీసులు కూడా ఎక్కువగానే వచ్చారు. సభ ప్రారంభం నుండే సంఘ్ పరివార్ వాళ్ళు గొడవ మొదలుపెట్టారు. ప్రశ్నించడం తప్ప జవాబులు వినం అనే తీరులోనే గొడవ చేస్తున్నారు. సార్ సీరియస్‌గా లేచి "ఇది మేము పెట్టుకున్న సభ. మీకు నచ్చకపోతే వెళ్లిపోవచ్చు... వేరే సభ పెట్టుకోవచ్చు, మీకు ఓపిక ఉంటే మాత్రం ఉండి మేము మాట్లాడిన తరువాత సందేహాలు ఉంటే అడగండి" అని తన ఉపన్యాసాన్ని ప్రారంభించాడు. ప్రశ్నలు రాలేదు కాని 'మానవహక్కుల వేదిక డౌన్ డౌన్' అంటూ నినాదాలు మొదలయినాయి. 'మానవ హక్కుల వేదిక జిందాబాద్' అంటూ మరోవైపు నుంచి ప్రతి నినాదాలు పెరిగాయి. ఒకరిని ఒకరు తోసుకుంటూ సార్ దగ్గరకు వెళ్తున్నారు. సార్‌పై దాడి జరుగుతుందనే భయం మొదలయింది. కాని సార్ ఏ మాత్రం జంకకుండా వారి మధ్యనుండే నడచుకుంటూ బయటకు వచ్చారు. పోలీసులు కల్పించుకొని ఎటువారిని అటు పంపారు. 'హుజూరాబాద్ వంటి ప్రాంతాలలో పరిస్థితి ఇట్లా ఉంటదనుకోలేదు' అని తిరుపతి సార్‌తో అన్నాడు. "విప్లవోద్యమాలు బలంగా ఉన్న రోజుల్లోనే జగిత్యాలలో వీళ్లు మనపై ఇట్లాగే దాడులు చేసారు. ఇప్పుడు ఉద్యమ భయం తగ్గింది. వీళ్లకు హద్దులుండవు. హిందూ మతోన్మాదం నమూనా దేశవ్యాప్తంగా అమలులోకి వస్తుంది. ఇప్పుడే మరింత పని చేయాలి మనం" అని కూడా అన్నాడు సార్. సార్ ప్రైవేటీకరణ, మతోన్మాదం రెండూ పెద్ద ప్రమాదాలుగా భావించి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేవాడు.

## ఎన్నడూ ఎవరికీ భారం కాలేదు

సార్ ఎన్నడూ ఎవరికీ ఏవిధంగా భారంగా ఉండలేదు. కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లా తూర్పు ప్రాంతంలో ఏ పని పెట్టుకున్నా... గోదావరిఖని నుండే మొదలయ్యేవాళ్లం. సార్ ఉదయం 4 గంటలకే బస్టాండ్‌కు వచ్చేవాడు. నేను అలారం పెట్టుకొని వెళ్లి తీసుకువచ్చేవాణ్ని. ఒకరోజు అలారం మ్రోగలేదు. నాకు 5.30కి తెలివి

వచ్చింది. హడావిడిగా బస్టాండ్‌కు వెళ్లాను. సార్ లేడు. నాకు ఆందోళన మొదలయింది. వసంత మేడంకు ఫోన్‌చేస్తే బయలుదేరాడంది. ఇంకా భయం పెరిగింది. హెూటళ్ల వద్ద చూసాను లేడు. మళ్లీ బస్టాండ్ లోపలికి వచ్చాను. చివర్లో ఎక్కడో బల్లమీద పడుకొని ఉన్నాడు. కాళ్లకు దోమలు కుడుతున్నాయి. లేపి 'ఆటోలో ఇంటికి రావద్దా?" అంటే "ఎందుకు పొద్దున్నే లేపడం, నాకు ఇక్కడ బాగానే నిద్ర పట్టింది" అన్నాడు. తిరుగు ప్రయాణం టికెట్టు ముందే కొనమని చెప్పేవాడు. రాత్రి బస్సులో నిద్రపోయి ఉదయాన్నే దినచర్యలోకి వెళ్లడానికి సిద్ధపడేవాడు. ఎక్కడికి వెళ్లినా టూవీలర్, ఆర్‌టిసి బస్సు, ఆటోలలోనే పోదామనేవాడు. తప్పనిసరి పరిస్థితిలో జీపుల్లో వెళ్లాల్సి వస్తే ముందే తనవంతు డబ్బులు ఇచ్చేవాడు. ఎవరైనా భరిస్తాం అంటే వినేవాడు కాదు. "మీకెక్కడివి పైసలు" అని తన బస్ చార్జి వరకు ఉంచుకొని మిగిలిన డబ్బులన్నీ ఇచ్చేవాడు.

చేవెళ్ల, ప్రాణహిత ఓపెన్‌కాస్టు వ్యతిరేక ప్రచార యాత్రల సందర్భంగా ఖర్చు ఎక్కువగా అయినట్లు సార్ గుర్తించి... సార్ అడిగితే చెప్పనని భావించి, ఖర్చు ఎంత అయిందో తెల్సుకొమ్మని నరేన్ గారికి చెప్పాడు. నరేన్ గారిని చూడడమే తప్ప నాకు వ్యక్తిగతంగా పరిచయం లేకుండె అంతకుముందు. నరేన్ గారు మెల్లగా ఖర్చుల వివరాలు నా వద్దనుండి లాగారు. అది నరేన్ గారి ప్రత్యేకత. తెలుసుకున్నాక సార్ నాకు 15 వేలు ఇస్తానన్నాడు. నాకు సార్ దగ్గర డబ్బులు తీసుకోవడం ఇష్టంలేదు "మీకెక్కడివిసార్" అన్నా. ఒక కేసు గెలిస్తే వాళ్లు హెచ్‌ఆర్‌ఎఫ్‌కు డొనేషన్ ఇచ్చారన్నాడు. అది హెచ్‌ఆర్‌ఎఫ్ డొనేషన్‌గా నేను భావించను. సార్ కష్టపడి కేసు గెలిపించినందుకు వచ్చిన డబ్బే అది. తన కష్టం నుండే సార్ నాకు కష్టం కాకుండా 15 వేలు ఖమ్మంలో ఇచ్చాడు. ఎదుటివారి ఇబ్బందులను గుర్తించే ఇంగితం ఎందరిలో ఉంటుంది?

## సార్ వక్తగా వస్తే... వేరే ఏర్పాట్లు అక్కరలేదు

ఏ మీటింగ్‌కైనా సార్‌ను వక్తగా పిలిస్తే నిర్వాహకులకు ఇక ఏ టెన్షన్ ఉండేది కాదు. సార్ డేట్ ఇచ్చాడంటే అనుకున్న సమయానికి కొన్ని గంటలు ముందే ఉండేవాడు. నిర్వాహకులు ఎవరైనా 'కారు పెడతామంటే' ఎందుకు బస్సే సుఖం అని బస్సు చార్జీలు మాత్రమే తీసుకునేవాడు. ఆర్.టి.సి.ని ప్రైవేటు పరం చేస్తే అసెంబ్లీని కాలబెడతానని ఒకసారి నవ్వుతూ అన్నాడు. ఆర్‌టిసిపై తన మమకారాన్నే కాక తనలో ఉన్న హింసావాదిని కూడా చూపెట్టాడు ఆ మాటల్లో.

సేవ్ సింగరేణి ఉద్యమంలో మొదలయి ఓపెన్‌కాస్టు వ్యతిరేక పోరాటంలో సార్‌తో తిరిగిన జగన్‌మోహన్‌రావు తర్వాత హెచ్‌ఆర్‌ఎఫ్ జిల్లా ఉపాధ్యక్షుడైనాడు.

ఆరు పదులు నిండిన వయస్సులో బి.పి., షుగర్ ఉన్నా లెక్క చేయకుండా జిల్లాలో విధ్వంసక అభివృద్ధి, గ్రానైట్ మైనింగ్, ఇసుక తరలింపు, నీటి వనరుల విధ్వంసం తదితర విషయాలకు సంబంధించి ఎక్కడేం జరిగినా... అక్కడ ప్రత్యక్షం అయి శక్తి మేరకు ప్రజల్ని చైతన్య పరుస్తున్నాడు. సార్ నాపై పెట్టిన బాధ్యత ఇది అని ఏడుస్తాడు. బాలగోపాల్ సార్ మొదట సంక్లిష్టంగా ఉన్నట్టుగా తోస్తాడు కాని ఓపికగా... లేదా ధైర్యం చేసి తడిమితే సార్ ఎంత సున్నితమో తెలుస్తుంది. ఎంత సరళంగా ప్రజల్లోకి వెళ్లగలడో సార్‌ను అనుసరిస్తే తెలుస్తుంది. ఆర్భాటాలకు తావియ్యకుండా ప్రజా నిరసనను ఒక ఉద్యమ రూపంలో ఎలా మార్చగలడో చెప్పడానికి ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక పోరాటాలే ఒక ఉదాహరణ. ఆ పోరాటాల్లో కొత్త అనుచరులను తయారు చేసుకోవడం... అందుకు జగన్‌మోహన్ రావు వాస్తవిక సాక్ష్యం.

## చివరి జ్ఞాపకాలు...

తేది: 25.9.2009 పొద్దున సార్ గోదావరిఖనికి వస్తే ఇద్దరం కలిసి ఆదిలాబాద్ జిల్లా కమిటీ నిర్మాణం గురించి ఉట్నూర్ వెళ్ళాము. మధ్యాహ్నానికి కమిటీ ఎన్నిక పూర్తయింది. మరునాడు మలేరియాతో మరణించిన గిరిజనుల గ్రామాలకు వెళ్లాల్సి ఉన్నది. "ఇప్పుడేం చేస్తాం... సాధ్యమైనన్ని గ్రామాలు తిరుగుదాం" అని సార్ తయారయిండు. సమీప గ్రామాలు తిరిగి రాత్రికి ఉట్నూర్‌కు వచ్చాము. ఆరోజు రాత్రి కొత్తగా పెరిగిన జిల్లాల నిర్మాణాల గురించి చెప్పాడు. పదేళ్ళ మానవ హక్కుల వేదిక చేసిన పనిపట్ల సంతృప్తిగా ఉన్నాడు. రోజు రోజుకు విస్తృతమవుతున్న వేదిక పని విధానాన్ని గర్వంగా చెప్పాడు. "సార్ మీరు కోర్టు పనులు తగ్గించుకోవాలి... మీ డేట్స్ కోసం ఒక్కోసారి రెండు నెలలు ఆగాల్సి వస్తుంది...' అంటే... తనకు 58వ సంవత్సరం వచ్చిందన్నాడు. 60 సంవత్సరాల తరువాత కూడా ప్రాక్టీసు చేయడం తన విధానం కాదు అన్నాడు. ఇంకో రెండేళ్లలో పూర్తికాలం వేదిక పనుల్లో నిమగ్నం అవుతానన్నాడు. సార్ ఆ మాట చెప్పాక రెండేళ్ల తరువాత వేదికెంత ఉధృతంగా పని చేయనున్నదో... ముందే నేను ఊహించుకున్నాను. బహుశా సార్‌కు కూడా రెండేళ్ల తరువాత హక్కుల వేదిక చేపట్టబోయే పనుల గురించి ఏదో ప్రణాళిక ఉండే ఉంటుంది.

తేది: 26.9.2009న తెల్లవారుతుండగా డా॥ తిరుపతి, కుమార్‌లు వచ్చారు. "గిరిజనుల నుండే చదువుకున్న యువకులకు మెడికల్ ట్రెయినింగ్ ఇస్తే కొంత మేరకు వైద్యం అందుబాటులో ఉండి సీజనల్ వ్యాధుల మరణాలు కొంత తగ్గించవచ్చు"నని సార్‌తో వాళ్ళు చర్చించుకున్న ఆలోచన చెప్పారు. ప్రత్యేకంగా మెడికల్ సిలబస్ తయారుచేసి తానే ట్రైనింగ్ ఇస్తానని డా॥ తిరుపతి అంటే ఈ ఆలోచనను గిరిజన

గ్రామాల్లో తిరుగుతూ సార్ అక్కడి యువతకు చెబుతూ అందర్నీ ఉత్సాహపరిచాడు. ఆసక్తి చూపిన వారి వివరాలు డా॥ తిరుపతి రాసుకున్నాడు. "ఆలోచన వస్తే చాలు పనిని వాయిదా పెట్టకుండా వెంటనే ఆచరణలో పెట్టే తత్వం" సార్‌ది.

ఆరోజు రాత్రి శ్రీరాంపూర్ (ఆదిలాబాద్ జిల్లా అధ్యక్షుడు బక్కయ్య ఇంటికి) వచ్చి అందరం పడుకున్నాము.

తేది: 27.9.2009న ఉదయం 5 గంటలకే అక్కడి నుండి సిరివంచ తాలూక అటవీ గ్రామం ఆకినపల్లి (మహారాష్ట్ర) బయలుదేరాలి. అక్కడ నలుగురు గిరిజనులను ఫారెస్టు ఆఫీసర్ కాల్చి చంపిన ఘటన జరిగింది. సార్ అలారం కూడా పెట్టుకోకుండా 4 గంటలకే లేచి తయారయినాడు. అందరం తయారయి బస్టాండ్‌కు వచ్చి బస్ కోసం చూస్తున్నాము. పేపర్ చదువుకుంటున్న సార్‌ను చూస్తూ డా॥ తిరుపతి నాతో "ఇంకో పదిహేనేళ్ల తరువాత సార్ ఉండకపోతే ఈ గిరిజనులు చస్తుంటే చూడడానికి ఎవరు వస్తారు?" అన్నాడు. "ఎవ్వరూ రారు..." అన్నాను. ప్రయాణ మార్గంలో చెన్నూరు వద్ద ప్రాణహిత నదిని దాటితే సిరివంచ వస్తుంది. పడవ ఎక్కేముందు సార్ నవ్వుతూ "నాకు నీళ్ల గండం ఉందని మానాన్న జాతకం రాసాడు" అన్నాడు. "అయితే మీరు ముందు ట్రిప్పులో వెళ్లండి తరువాత మేము వస్తాం..." అన్నాను. 'అదెట్లా?' అన్నాడు సార్. "మీతో వస్తే గండం మీకు మాత్రమే పరిమితంగా ఉంటుందా సార్" అని అన్నాము. అందరం నవ్వుకుంటూనే పడవ ఎక్కాము. ఆరోజు ఏ గండమూ ఎదురుకాలేదు. దసరా పండుగ మూడు రోజులూ సార్‌తోనే ఉన్నాము. "మా పండగను మీరే మింగారు. ఇంకోసారి దసరాకు మీరు ఇటువైపు పని పెట్టుకోవద్దు" అన్నాము. "సరే చూస్తా..." అని సార్ నవ్వాడు. బస్‌కు టైం ఉన్నందున ఆరోజు రాత్రి అక్టోబర్ 1, 2 తేదీల్లో జరగబోయే రాష్ట్ర మహాసభల కార్యదర్శి నివేదిక రాయడం ప్రారంభించాడు. కరెంటు పోయింది. చేతిలైటు వెలుగులో రిపోర్టు రాస్తున్న సార్‌ను ఫోటో తీసుకున్నాను. అదే నా చివరి ఫోటో... ఈ బులెటిన్ అట్టమీది ఫోటో.

రాష్ట్ర మహాసభలు ముగిసాయి. కొత్త నాయకత్వం ఎంపిక జరిగింది. సార్ బాధ్యతలను అప్పగించాడు. ఐదు రోజులు నిండక ముందే సార్... మమ్మల్ని వదిలి వెళ్లిపోయాడు.

సార్ లేని పరిస్థితి ఎందుకు ఊహకు వచ్చిందో...? జలగండం గురించి ఎందుకు ప్రస్తావన వచ్చిందో..!? ఇంకోసారి రావద్దని ఎందుకు సార్‌ను అన్నానో...? నాయకత్వపు బాధ్యతలను మా చేతుల్లో సార్ ఎందుకు ఉంచాడో...? ఇదంతా యాధృచ్ఛికంగా జరిగిందే కదా... ఇంత త్వరగా సార్ దాన్ని ఎందుకు నిజంగా మార్చాడు? ఒక్కో ఆలోచన వస్తుంటే దు:ఖం నాలో ఒంటరిదవుతుంది. దు:ఖం

ఒంటరితనాన్ని అనుభవించడానికి మించిన భారం ఏముంటుంది? దు:ఖాన్ని చైతన్యంగా మార్చుకునే శక్తి లేనివాణ్ని నేనొక్కడినే కాదు. నా సహచరులు కూడా... చుట్టుముడుతున్న నిరాసక్తత నుండి బయటపడి పని చేయడానికి తయారవుతున్నాము.. పనిలో ఉన్నంతసేపే తృప్తి... బాధ తెలియదు... పని అయిపోయినంక ఒంటరిగా బస్సు ఎక్కిన తరువాత మళ్లీ సలుపుతున్న గాయం... ఒంటరితనం... మాతో సారే ఉంటే... ఎంత నిర్భీతిగా ఉండేవాళ్లమో. లోటు లోతుగానే కలవరపెడుతున్నది. అధిగమించడానికి మాకున్న ఏకైక మార్గం "పని" మాత్రమే... ఒకరి నుండి ఒకరికి ఓదార్పు కూడా "పనే". ఎంత తీరిక లేకుండా పని చేస్తే అంతగా "సార్"కు దగ్గరగా వెళ్లగలము. సార్‌కు ఎప్పుడూ దగ్గరగా ఉండడమే ఇప్పుడు హక్కుల కార్యకర్తల ముందున్న ప్రాధమిక బాధ్యత.

# మా వాడు, మా గొంతు

రామారావు దొర*

తమ ఆత్మబంధువని ఆదివాసులు మనస్ఫూర్తిగా చెప్పుకోదగిన ఏకైక బయటి వ్యక్తి బాలగోపాల్. ఆకలి, అనారోగ్యాలతో మనుగడే ప్రశ్నార్థకంగా మారిన ఆదివాసీ జన శ్రేయస్సు కోసం పరితపించిన మానవతామూర్తి ఆయన. తమకు ఏకైక జీవనాధారంగా ఉన్న ప్రకృతిని సైతం అభివృద్ధి పేరుతో తమ నుంచి లాగేసుకుంటున్న పాలకుల వికృత విధానాలను ఆదివాసుల తరఫున కడకంటా వకాల్తా పుచ్చుకొని మరీ నిలదీసిన ఆదివాసీ పక్షపాతి డాక్టర్ బాలగోపాల్.

సాదాసీదాగా, ఎంతో వినమ్రంగా కనిపించే ఆ నిలువెత్తు మానవతావాదిని నేను తొలిసారి 2001 జూన్ 10న దుంబ్రిగుడలో కలిసాను. టూరిస్టు పరిశ్రమ కోసం బొటానికల్ గార్డెన్ నిర్మించడానికి ఆదివాసీ పంట భూములను అప్పగించే ప్రభుత్వ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ గిరిజన విద్యార్థి సంఘం (జి.ఎస్.యు) ఆనాడు ఏర్పాటు చేసిన కార్యక్రమంలో ఆయన పాల్గొన్నారు.ఆ కృషి వల్ల 250 ఎకరాల పంట భూమి ఆదివాసులకు మిగిలింది. హక్కుల నేతగా ఆయన నిర్వహించిన కార్యక్రమాలతో నాకు ఆనాటినుంచీ అనుబంధం ఉంది.

స్వాతంత్ర్య షష్ఠిపూర్తి సంబరాలు ముగిసిన ఐదోరోజునే 2007లో జి. మాడుగుల మండలం వాకపల్లిలో ఆదివాసీ మహిళలపై కూంబింగ్ పోలీసులు అత్యాచారానికి పాల్పడ్డ సంగతి అందరికీ తెలిసిందే. ఘటన వెలుగులోకి వచ్చినప్పటి నుంచి సాక్ష్యాధారాలు దొరక్కుండా చేయడం కోసం పోలీసులూ, జిల్లా అధికారులూ చేయని ప్రయత్నం లేదు. అత్యాచారానికి వెలకట్టి తలా ఐదులక్షలు ఇస్తామన్నా బాధితులు

* జర్నలిస్టు, హెచ్.ఎం.టి.వి, పాడేరు

## కన్నడంలో బాలగోపాల్ పుస్తకాలు

సంఘపరివార్ శక్తులు తమ దౌర్జన్యపూరిత కార్యక్రమాలు నడుపుతున్న సమయంలో అఖిల భారత నిజనిర్ధారణ కమిటీలో భాగంగా బాలగోపాల్ గత ఏడాది కూడా ఈ రాష్ట్రానికి వచ్చారు. ఒరిస్సాలో లక్ష్మణానందస్వామి హత్యను నెపంగా చేసుకుని అక్కడి క్రైస్తవుల మీదా, వారి చర్చిల మీదా దాడి చేసిన విధంగానే, కర్నాటకలో ముఖ్యంగా కోస్తా ప్రాంతాల్లో (మంగళూరు, ఉడుపి జిల్లాలు) క్రైస్తవులు మత మార్పిడులకు పాల్పడుతున్నారని అభాండాలు వేస్తూ వాళ్ళ ప్రార్థనా మందిరాలపైనా, వారిపై దాడులు జరిపిన సంఘపరివార్ శక్తుల అకృత్యాలను ఈ నిజనిర్ధారణ ద్వారా బయటికి తీసుకొచ్చారు. ఈ దాడులు జరిగినప్పుడు (ఇప్పుడు కూడా) కర్నాటకలో బిజెపి అధికారంలో ఉన్నందువల్ల క్రైస్తవులకు రక్షణగాని, ఆర్ఎస్ఎస్, దాని అనుబంధ సంస్థల కార్యకర్తలకు శిక్షగాని లేకుండా పోయాయి. అయితే దేశంలోని వేరు వేరు చోట్లనుండి వచ్చిన మానవహక్కుల వాళ్ళ చొరవ వలన ఆ దాడులకు కొద్దిగా విరామం వచ్చింది. 'ఫ్రం కంధమాల్, టు కరావళి – ద అగ్లీ ఫేస్ ఆఫ్ సంఘ్ పరివార్' పేరుతో నివేదిక ఈ దాడుల గురించీ, వాటి నేపథ్యాన్ని గురించీ వివరమైన విశ్లేషణ చేసింది. ఎప్పటి మాదిరిగానే ఈ నివేదికను తయారు చేయడంలో బాలగోపాల్‌గారి శ్రమ, పాత్ర అతి ముఖ్యమైనవి. తర్వాత ఇదే నివేదికను 'కంధమాల్‌నింద కరావళియవరెగే' అన్న పేరిట కన్నడానికి తర్జుమా చేసి పిడిఎఫ్ ప్రకటించింది.

కాశ్మీరీలు ఎదుర్కొంటున్న సమస్యల గురించి నిజనిర్ధారణ కమిటీల రిపోర్టుల ఆధారంగా బాలగోపాల్ రాసిన 'కల్లోల లోయ' కూడా కన్నడానికి అనువదింపబడింది. ఆ పుస్తకం ప్రకటించిన తర్వాత 'విల్ ది పెయిన్ నెవర్ ఎండ్?' అన్న మరొక రిపోర్టును, మరికొన్ని విషయాలను అనుబంధాలుగా చేర్చి 'ప్రక్షుబ్ధకణివె' అనే శీర్షికన బెంగళూరులోని ప్రగతి గ్రాఫిక్స్ సంస్థ వారు ప్రకటించారు. ఇటీవలనే, 2009లో ప్రకటింపబడిన ఈ పుస్తకాన్ని పిడిఎఫ్‌కు చెందిన ఇద్దరు సభ్యులు సిద్ధం చేశారు.

బెంగళూరులోని వేర్వేరు సామాజిక సంస్థలు, విద్యా సంస్థలు తమ కార్యక్రమాలకు ఆయనను వక్తగా పిలిచిన ఇటీవలి సందర్భాలలో బాలగోపాల్ క్రైస్ట్ యూనివర్సిటీ విద్యార్థులనుద్దేశించి చట్టాల గురించి మాట్లాడారు. ఇదే యూనివర్సిటీ వాళ్ళు ఇంతకుముందు కూడా రెండు, మూడు సార్లు ఆయనను ఆహ్వానించి ఉన్నారు. శ్రీలంకలో ఎల్‌టిటిఇ పతనం తర్వాత తమిళుల ఊచకోతకు వ్యతిరేకంగా జరిగిన ఒక కార్యక్రమంలో బాలగోపాల్ పాల్గొని అన్యాయాలకు గురైన తమిళులకు సంఘీభావాన్ని ప్రకటించారు.

కర్నాటకలో చర్చిలమీద జరిగిన దాడులపై విచారణకు ప్రభుత్వం ఏర్పాటు చేసిన కమిషన్ అధ్యక్షుడు రిటైర్డ్ జస్టిస్ సోమశేఖర్ క్రైస్తవులను అనవసరంగా ఇబ్బంది పెట్టే రీతిలో విచారణను నడుపుతున్నారన్నదాన్ని గురించి ఆంధ్రజ్యోతిలో బాలగోపాల్ రాసిన వ్యాసం ఇటువంటి కమిషన్‌లు ఎలా పనిచేయరాదో అన్న విషయాన్ని విశదీకరిస్తుంది. 2009 అక్టోబరు మొదటివారంలో అనంతపురంలో జరిగిన హెచ్‌ఆర్‌ఎఫ్ మహాసభలలో పిడిఎఫ్ సభ్యులు ఇద్దరు ఆహ్వానితులుగా పాల్గొన్నారు. అంతవరకూ కార్యదర్శిగా ఉన్న బాలగోపాల్ ఆ పదవిని వదలి ఉపాధ్యక్షులలో ఒకరిగా ఎన్నికైనారు. పదవి ఏదయినప్పటికీ హెచ్‌ఆర్‌ఎఫ్‌కు బాలగోపాల్ నాయకత్వం ఆవశ్యకత మాత్రం ఎప్పటికీ తగ్గదనుకున్నాం. అయితే అక్టోబరు ఎనిమిదవ తేదీన ఆయన హఠాన్మరణం అందరిలాగే పిడిఎఫ్‌ను కూడా కదిలించి వేసింది. ఆయన గురించి తెలిసిన వారినందరినీ కలవరపరిచింది.

ఆయనకు శ్రద్ధాంజలి సమర్పించడానికి బెంగళూరులో ఏర్పాటు చేసిన సభలో వివిధ సంఘాలవాళ్ళు, బాలగోపాల్‌తో పరిచయమున్నవాళ్ళు పాల్గొన్నారు. అనంతపురం నుంచి చంద్రశేఖర్‌గారు ముఖ్య అతిథిగా ఆ సభకు వచ్చారు. బెంగళూరు వాస్తవ్యులైన రవీంద్రనాథ్ (బాలగోపాల్‌గారి అన్న), మరి కొందరు బంధువులు కూడా ఆ సభకు వచ్చారు. వాళ్ళ కుటుంబం తరఫున రవీంద్రనాథ్‌గారు బాలగోపాల్ గురించి మాట్లాడారు. ఆ సందర్భంలో బాలగోపాల్ ఇంటర్వ్యూలో కొంత భాగాన్ని ప్రదర్శించడం జరిగింది. బాలగోపాల్ మిత్రులు ఆయన వ్యాసాలు కొన్నిటిని కన్నడానికి అనువదించి ప్రకటించాలని నిర్ణయించారు. ఇప్పుడు ఆ ప్రయత్నాలు నడుస్తున్నాయి.

ఇక్కడ ఆయనను చూసినవాళ్ళు ముఖ్యంగా గుర్తుంచుకునేది, ఆయన సరళత. తాను గొప్ప నాయకుడ్ని అన్న అహంకారం లేకుండా చాలా సామాన్యుడిగానే ఆయన అందరితోనూ కలిసేవారు. ఎక్కువగా మాట్లాడకపోయినా, ఆయన తన చుట్టూ ఉన్నవాళ్లనుంచి ఎక్కువ దూరం పోయినవాడూ కాదు. పిడిఎఫ్ సభ్యులు బాలగోపాల్‌తో తమ స్నేహపూర్వక సంబంధాలను ఎప్పటికీ మరవలేరు. ఆయనతో కొన్ని విషయాలలో అభిప్రాయ భేదాలున్నవాళ్ళు కూడా ఆయన వాదనాపటిమను, నిబద్ధతను, సాదాసీదా జీవనాన్ని, సునిశిత విశ్లేషణా శక్తిని, ఏ విషయాన్నైనా సూటిగా, నేరుగా చెప్పగల ఆయన స్పష్టతనూ, విజ్ఞతనూ ఒప్పుకోకుండా, మెచ్చుకోకుండా ఉండలేరు.

# సోయి తత్వవేత్త

**బుర్ర రమేశ్‌బాబు,** తత్వశాస్త్ర విశ్లేషకుడు, NCERT, భోపాల్

**బా**లగోపాల్ మానవహక్కుల దృక్పధాన్ని అతని వ్యక్తిత్వం నుండి వేరు చేయలేము. నిజానికి అతని దృక్పధం అతని వ్యక్తిత్వంతో పెనవేసుకుపోయింది. అతని దృక్పథం సమాలోచనల ఫలితం కాదు, అది కఠోర శ్రమాలోచనల సారం. అతని దృక్పథసారం నిండథిరుకున పెట్టే ప్రశ్నలెన్నో, వాటిని పరిష్కరించే మానవీయ దృష్టికోణాలెన్నో. చట్రంలో, చట్రంద్వారా, చట్రంకోసం పరిమితమయిన సిద్ధాంతఆచరణలపై ఎక్కుపెట్టిన ప్రశ్నలు. బహుశా అన్యాయాలు, అణచివేతలు, అమానవీయతలను నిలదీసే 'ప్రత్యేక' ప్రశ్నలు. ప్రతీ ప్రత్యేక అమానవీయత, అణచివేత, అసమానతకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టిన సామాన్య మానవీయ దృష్టికోణాలు. అతని దృక్పథ సారం పంథాలనుండి రాలేదు, పథం నుండి ఎదిగింది. నిజానికి పంథాలచే నిర్దేశించబడ్డ ఆచరణల పరిమితులను ప్రశ్నించే క్రమం నుండి రూపుదిద్దుకుందే అతని దృక్పథ సారం. ఎదుగుతూ ఉండే మానవీయతే అతని మానవహక్కుల దృక్పథసారం.

బాలగోపాల్ మానవహక్కుల దృక్పథం – మూడు దశాబ్దాలుగా అలుపెరగకుండా చేసిన హక్కుల లోక సంచార క్రమంలో ప్రత్యక్షంగా అనుభవంలోకి వచ్చిన జీవనస్థితుల్ని (Life-situations), ఆ స్థితుల్లోని అణచివేత, అన్యాయాలకు వ్యతిరేకంగా మానవీయతను సూత్రీకరించే క్రమాల అల్లికలనుండి ఎదిగింది. ఎదుగుతుంది. ఎదుగుతూ ఉంటుంది.

బాలగోపాల్ 'తత్వము' సోయితత్వము. 'సోయి' నిద్రావస్థనుండి బయటపడిన, పడవలసిన స్థితిని, మతిని, నైతిక నిర్మితినీ తెలియచెబుతుంది. అదే పనిగా నిద్రావస్థలో ఉన్నపుడు, మత్తు స్థితిలో ఉన్నపుడు, నీతినీ, సమాజరీతినీ మరచి

నడుచుకున్నపుడు – ఆ స్థితిని సూచిస్తూ, దానిని నిరసిస్తూ, దానినుండి బయటపడవలసిన అవసరాన్ని సూచిస్తూ ఏ అవ్వకైనా ప్రయోగించే అర్ధవంతమైన పదం 'సోయి'. ఇది నైతికతను కల్గిన జాగరూక స్థితిని చెబుతుంది. నైతికతతో పెనవేసుకున్న చైతన్య తత్వం 'సోయి'. అది జైవిక నిద్రావస్థ కావచ్చు, మైకపు స్థితిలో కళ్ళు మూసుకుపోయిన దురవస్థ కావచ్చు, భావజాలాలలో మునకస్థితిలోని 'మతి' స్థితి కావచ్చు. వీటిని నిరసించి వ్యక్తిని చైతన్యపరిచి 'సోయి'లోకి తేవడం సోయి తత్వము. సోయి తత్వము స్వీయ స్థితి, మతి, నీతిని ఎరుక చెబుతుంది. నైతికత వెలుగులో స్వీయ స్థితి, మతులను వ్యాఖ్యానిస్తుంది; తీర్మానిస్తుంది. లోక సంచారి ఐన బాలగోపాల్ మానవహక్కుల స్థిర–సంచారము సోయి తత్వంతో, స్వీయ ఎరుకతో ప్రారంభమయింది.

బాలగోపాల్ హక్కుల దృక్పథం స్వీయఎరుక కోసం 'సోయి'తో చేసిన శ్రమాలోచనల నుండి జనించింది. అప్పటికే స్థిరీకరింపబడి హక్కుల ఆలోచనలను, ఆచరణలను నిర్దేశిస్తున్న విప్లవ దృక్పథం, ఆమ్నెస్టీ దృక్పథాల అతి పరిమితుల మీద జీవన స్థితుల, (Life - Situations) ఆధారంగా నైతికత వెలుగులో పెట్టిన విమర్శనుండి జనించింది. ఈ సంకలనంలోని శ్రమాలోచనల్లో బాలగోపాల్ పలుమార్లు, పలు సందర్భాలలో పౌరహక్కుల సైద్ధాంతిక – ఆచరణల పరాధీనతను ప్రశ్నిస్తాడు. పరాధీనతనుండి బయటపడి స్వతంత్ర అస్థిత్వాన్ని ఏర్పరచుకోవడం కోసం ప్రజాస్వామ్య హక్కుల దృక్పథాన్ని ముందుకుపెడతాడు. ప్రతీదాన్ని సిద్ధాంతీకరించే హక్కుల సంఘాలకు తమను, తమ కార్యరంగాన్ని సిద్ధాంతీకరించే 'సోయి' లేదని, అలా 'సోయి' లేకపోవడం కాకతాళీయం కాదని భావించాడు. హక్కుల కార్యకర్తల్లో చాలా మందికి 'పునాది' వాద రాజకీయ సిద్ధాంతాల ఎడ ఉండిన ముందస్తు విశ్వాసం ఈ 'సోయి' లేమికి కారణమన్నాడు. ఎందుకంటే, హక్కుల ఉద్యమం, నిర్దిష్ట స్థితిగతుల్లో, స్థిర రాజకీయ విశ్వాసాల వెలుగుల్లో, ఒక ప్రత్యేక ఆచరణను దశాబ్దాల కాలంగా దేశంలో, ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో తనదిగా కలిగి ఉండడం మూలాన హక్కులకు ఒక స్థిరమయిన అర్థం వచ్చి చేరింది. ఇలా వచ్చి చేరిన అర్థం హక్కుల ఉద్యమాన్ని, దాని విస్తృతిని, స్వభావాన్ని ఒక నిర్దిష్ట పరిమితిలో కుదించివేసి, హక్కుల ఉద్యమాన్ని ఒక స్వతంత్ర ఉద్యమంగా కాక, ఒక రాజకీయ ఉద్యమ పరిచారికగా మార్చివేసిందన్నది బాలగోపాల్ నిశ్చితాభిప్రాయం. దీనికి కారణమయిన, అవ్యక్తంగా ఉండి హక్కుల సంఘాల ఆచరణలను శాసిస్తున్న పునాదివాద రాజకీయ విశ్వాసాలనుండి జనించిన అభిప్రాయాలను పరీక్షకు పెట్టవలసిన అవసరం ఉందని ఈ శ్రమాలోచనల్లో బలంగా ప్రతిపాదిస్తాడు బాలగోపాల్. ఇందుకు హక్కుల సిద్ధాంతాన్నీ, ఆచరణనీ హక్కుల సిద్ధాంతం నుండి జీవన స్థితులను చూడక

జీవనస్థితుల ఆధారంగా, వాటి వెలుగులో పరీక్షకూ, విమర్శకూ పెట్టాడు. దీనితో సిద్ధాంతాలు చూడని ఆధిపత్య పోకడలు, – అణచివేత కోణాలు ఎన్నింటినో మన ముందుంచుతాడు. ఈ సోయిలో భాగంగా ఆదర్శాలలో సైతం అంతర్లీనంగా ఉండేటటువంటి ఆధిపత్యాలను పట్టుకుని ప్రశ్నిస్తాడు బాలగోపాల్. ప్రయోజన జనిత, పరిమిత హక్కుల భాషను నైతిక భాషలోకి మార్చవలసిన అవసరాన్ని ప్రతిపాదిస్తాడు. అందుకే Conscientisation హక్కుల ఉద్యమ లక్ష్యం కావాలంటాడు. ఈ దృక్పథ పరివర్తన క్రమంలో హక్కులకు సంబంధించిన సిద్ధాంతాలను గూర్చి, ఆచరణను గూర్చి, రాజ్యం రాజకీయాలను గూర్చి, వాటి తాత్వికతను గూర్చి మౌలికమయిన ప్రశ్నల్ని లేవనెత్తాడు. అన్నింటిని గూర్చి 'సోయి' తెచ్చాడు.

సమకాలీన సమాజంలో మనుషులు–వ్యక్తులుగా, సమూహాలుగా–హక్కుల భాషలో సంభాషిస్తున్నారు. ప్రజలు–ప్రభుత్వాలు, పాలకులు–పాలితులు, వ్యక్తులు–వ్యవస్థలు, జాతీయ సంస్థలు–బహుళజాతీయ కంపెనీలు, ప్రభుత్వరంగ సంస్థలు–ప్రభుత్వేతర సంస్థలు (NGOs) అన్నీ హక్కుల భాషలోనే సంభాషిస్తున్నాయి. ఇందువల్లనే, ఐక్యరాజ్యసమితి సెక్రటరీ జనరల్ మానవహక్కులన్నవి మనుషులందరి సామాన్య భాషయిందన్నాడు. సామాన్య భాషగా ఎదిగిందా? లేదా? అన్నదానిని ప్రక్కన పెడితే, విభిన్న ప్రయోజనాలు కల్గినవారు, ఏకకాలంలో హక్కుల భాషలో సంభాషించడం పెరిగిపోతుంది. ఈ క్రమంలో ప్రజల పోరాటాలే కాకుండా దేశాల మధ్య యుద్ధాలు కూడా హక్కుల పేరుతో జరుగుతున్నాయి. అణచివేతకు వ్యతిరేకంగా మాత్రమే కాక అణచివేతకై కూడా హక్కుల భాష ఉపయోగపడుతూ ఉండడం వలన అది మలినం అవడంతోపాటు విపరీతార్థంలో 'సార్వజనీనాలవుతున్నాయి'.

వ్యక్తి హక్కుతో మొదలయిన హక్కుల ప్రస్థానం సమూహాలకు, ప్రాంతాలకు, కులాలకు, మతాలకు, జాతులకు, చివరికి అంతర్జాతీయ సమాజాలకు హక్కులు అన్నంత వరకు విస్తరించింది. ఇంకా బాలల హక్కులు, వృద్ధుల హక్కులు, మహిళల హక్కులు, వికలాంగుల హక్కులు, స్వలింగ సంపర్కుల హక్కులు అనేకం వ్యవస్థితమౌతున్నాయి. మరింత ముందుకు పోయి మనుషుల హక్కులకు మాత్రమే పరిమితం కాక, పశుపక్ష్యాదుల హక్కులు, పర్యావరణ హక్కుల వరకు కూడా విస్తరిస్తున్నాయి. భిన్న వ్యక్తులు, సామాజిక శక్తులు, కొన్నిసార్లు పరస్పర వ్యతిరేక ప్రయోజనాలు కల్గిన వ్యక్తులు, సామాజిక శక్తులు తమ, తమ ప్రయోజనాల కోసం హక్కుల భాషను ఆశ్రయిస్తున్నారు.

మనుషులు ఎదుగుతారు. సమాజాలు ఎదుగుతుంటాయి. మనుషుల్నీ, సమాజాల్నీ పాలించే నియమాలూ, విధానాలూ, విలువలూ ఎదుగుతుంటాయి.

'మానవీయత' చరిత్ర క్రమాలన్నింటిలో అణచివేత, పీడన అమానవీయతలపై తిరుగుబాట్లు, పోరాటాల రూపాలలో వ్యక్తీకరణ నొందింది. దీనికి అనేక ఉదాహరణలు చరిత్ర నిండా మనకు కన్పిస్తాయి. ఐతే అది హక్కుల భాష ద్వారా వ్యక్తీకరణ పొంది వ్యవస్థితమయింది ఆధునిక కాలపు ప్రారంభం నుండే. ఇలా వ్యవస్థితమయిన తొలినాళ్ళ హక్కులు 'సహజ హక్కుల' పేరుతో సిద్ధాంతీకరించబడినాయి. హక్కుల త్రయాలను – జీవించే హక్కు, స్వేచ్ఛ హక్కు, సంపద హక్కు – మూల హక్కులుగా తీర్మానించాయి.

ఈ ఉదారవాద హక్కుల సిద్ధాంతం 'వ్యక్తి' ఐన మనిషిని సృజించింది; 'ప్రయోజనాల' భాషని ప్రయోగించింది; వ్యక్తికి – వ్యవస్థకి (రాజ్యానికి) నకారాత్మక సంబంధాన్ని స్థిరీకరించింది. దీంతో వ్యక్తి స్వేచ్ఛలో రాజ్య జోక్యాన్ని నిరసిస్తూ హక్కుల ప్రస్థావనలు జరిగాయి. ఈ తొలినాళ్ళ ప్రస్థావనలు వ్యక్తి–కేంద్ర ప్రయోజనాలని మరియు రాజ్యకేంద్ర అణచివేతల్ని సిద్ధాంతీకరించాయి. ఐతే, కాలక్రమంలో హక్కుల గూర్చిన ఆలోచనల్లో కూడా మార్పులు చోటుచేసుకున్నాయి. రాజ్యం నుండి వ్యక్తి స్వేచ్ఛకై ప్రారంభమయి, సాగిన హక్కుల ప్రస్థావనలు, రాజ్యం ద్వారా 'సమిష్టు'ల వికాసం అన్న ఒడంబడికల, ఒప్పందాల ప్రకటనల వరకు కొనసాగింది. యింకా ముందుకు పోతుంది.

సమానత్వం మౌలిక ఆదర్శంగా ముందుకు వచ్చిన సామ్యవాద సిద్ధాంతం రాజ్యం పట్ల నకారాత్మకతను మరింత దృఢం చేస్తూ ఉదారవాద వ్యక్తి స్వేచ్ఛను ఒట్టి డొల్లగా తీర్మానించి తిరస్కరించింది. స్వేచ్ఛ ప్రాధాన్య రాజకీయ, పౌరహక్కుల కంటే ముందుగా సమానత, ప్రాధాన్య ఆర్థిక హక్కులను సాధించవలసిన అవసరాన్ని, ఆవశ్యకతను పేర్కొంది.

ఉదారవాద మరియు మార్క్సిస్టు సిద్ధాంతాలు హక్కుల ప్రాధాన్యతల్లో, వాటి క్రమ శ్రేణీకరణలో భిన్న అభిప్రాయాలు, ప్రతిపాదనలు చేసినప్పటికీ హక్కుల అణచివేతలో ఏక కేంద్రకాన్ని ప్రతిపాదించాయి. ఏక కేంద్ర అణచివేత సిద్ధాంతం మానవహక్కుల అణచివేతకి ఉన్న విభిన్న పార్శ్వాల్ని పరిగణనలోకి తీసుకోలేకపోయింది. ఈ ఏక కేంద్ర అణచివేత సిద్ధాంత మూలాలు Laissez Faire (ఆర్థిక) సిద్ధాంతపు ఆవిర్భావ సందర్భానికి చెందినవి. యూరప్‌లో వచ్చిన పునరుజ్జీవన, సంస్కరణ ఉద్యమాలు మతం నుండి రాజకీయాల స్వాతంత్ర్యాన్ని కోరితే, Laissez Fair తత్వము రాజ్యంనుండి ఆర్థిక స్వేచ్ఛను ప్రతిపాదించింది. మనిషిని ఆర్థిక జీవిగా (మాత్రమే) పరిగణించి ఆ స్వేచ్ఛకు అడ్డుపడుతున్న రాజ్యాన్ని అణచివేత కేంద్రంగా తీర్మానించింది. భిన్న అర్థంలో మార్క్సిస్టు సిద్ధాంతం కూడా రాజ్యాన్ని అణచివేత

కేంద్రంగా తీర్మానించింది. మనిషికి ఉండే మిగతా పార్శ్వాల, వాటిని నియంత్రించే విభిన్న (అధికార) కేంద్రాల ఊసు హక్కుల సిద్ధాంతాల ఆరంభకాలంలో అంతగా కనిపించదు. హక్కులు వాటి క్రమానుగత శ్రేణీకరణలో అణచివేత కేంద్రం ప్రపంచవ్యాపిత హక్కుల సూత్రీకరణలను, ఆచరణలను, ఉద్యమాలను ప్రభావితం చేసింది. ఈ హక్కుల సూత్రీకరణలు హక్కులలో ద్వంద్వాలను, అణచివేతలో ఏక కేంద్రకాన్ని, ప్రయోజన నిబంధిత ఆచరణలను, తదనుగుణమయిన భాషను స్థిరీకరించాయి. ఈ సూత్రీకరణలతో ఆచరణాత్మక సంవాదాన్ని నెలకొల్పాడు బాలగోపాల్. ఆ సంవాదం నుండి ఎదిగింది బాలగోపాల్ మానవహక్కుల దృక్పథం.

తాత్వికీకరణ ద్వంద్వీకరణకు బాటలు వేసింది. ప్రపంచము దాని నడక తాత్విక సిద్ధాంతాల వలన ద్వంద్వాత్మకమయ్యింది. దీంతో ప్రపంచపు అర్థాలను, అర్థాలను నిర్మించే భాష ద్వంద్వాత్మకమయింది. ఈ ద్వంద్వాత్మకత (Duality) క్రమంగా జంట ప్రత్యర్థుల (Binary Opposites) రూపాలలోకి మార్చబడి శ్రేణీకరణ నొందింది. దీంతో, వీటిలో ఒకటి మౌలికమై ఆధిపత్య స్థానంలోకి పోతే, రెండవది గౌణమై అధీన స్థానంలో ఉంచబడింది. ఈ ద్వంద్వాత్మకత, జంట ప్రత్యర్థుల అవగాహన హక్కుల కార్యరంగాన్ని నిర్దేశిస్తూ వస్తుంది. హక్కుల ఉద్యమ సైద్ధాంతిక, కార్యక్షేత్రాల్లో ఈ ద్వంద్వాత్మకత స్వేచ్ఛ–సమానత్వం; పౌర స్వేచ్ఛలు – ప్రజాస్వామ్య హక్కులు, వ్యష్టి–సమిష్టి; ప్రత్యేకత్వం – సార్వత్రికం; పునాది – ఉపరితలం పరిణామాత్మక మార్పు – గుణాత్మక మార్పుగా నిర్మించబడింది, అర్థం చేసుకోబడింది. మానవహక్కులను సిద్ధాంతీకరించే క్రమంలో ఎదుర్కొన్న 'జంట ప్రత్యర్థు'లను జీవనస్థితులనుండి వచ్చిన పోరాటాల ద్వారా అధిగమించే కృషి బాలగోపాల్‌లో మనకు కనిపిస్తుంది. స్వేచ్ఛ హక్కు – సమానత్వ హక్కు అన్న ద్వంద్వాలను వాటి శ్రేణీకరణను తిరస్కరించిన బాలగోపాల్, సమానత్వ భావన హక్కుల సూత్రీకరణలో అంతర్లీనంగా ఉంటుందంటాడు. సూత్రప్రాయంగా హక్కులంటే సమానత్వమని ఒప్పుకోవడానికి హక్కుల ఉద్యమాలకు సంశయముండనవసరం లేదంటూనే, సమానత్వాన్ని ఆదర్శంగా మార్చి మనిషిని దానికి సాధనంగా చేసే ప్రయత్నాన్ని నిరసిస్తాడు. మనిషికి మనిషిగా విలువనిచ్చే గుణాన్ని కాపాడుకుంటూ సమానత్వాన్ని ప్రాతిపదిక చేసుకున్న హక్కుల దృక్పథాన్ని తాత్వికంగా బలోపేతం చేసుకోవలసిన అవసరముందంటాడు బాలగోపాల్.

బాలగోపాల్ హక్కుల ప్రస్థానం అధికారం, అణచివేత, హింసల (ఏకైక) కేంద్రమయిన రాజ్యాన్ని ఎదుర్కోవడం అన్న అవగాహనలో మొదలయింది. ఈ సిద్ధాంత అవగాహనలో హక్కుల పోరాటం అధికార (ఏకైక) కేంద్రమయిన రాజ్యము, దాని వైరి 'వర్గం' గా రూపొందించబడిన పీడిత ప్రజల మధ్య జరుగుతుంది. ఈ

హక్కుల అవగాహనలో రాజ్యం ఆవశ్యకంగా ప్రతినాయకుడు. మూర్తీభవించిన ప్రతినాయకుడు. అది అధికారం, అణచివేత, హింసల కేంద్రం. ఈ అవగాహన వెలుగులో దశాబ్దకాలం హక్కుల ప్రస్థానాన్ని కొనసాగించిన బాలగోపాల్ ఈ అవగాహన 'వెలుగు'లో ఉన్న చీకట్లను జీవితానుభవాల వెలుగులో గుర్తించి తదనుగుణంగా హక్కుల అవగాహనను విస్తృత పరుచుకుంటూ పునర్నిర్వచించుకోవలసిన అవసరాన్ని ప్రకటిస్తూ వచ్చాడు. దానిలో భాగంగా హక్కుల, హక్కుల పోరాటాల, వాటి స్వభావాలను గూర్చి సూత్రీకరించాడు. ఈ సూత్రీకరణలోని సందర్భాలు బహుళ అణచివేతలతో కూడిన సామాజిక వ్యవస్థలు ఐతే, సూత్రీకరణల సారం మనిషిని మనిషిగా భావించి, ప్రతి మనిషికీ ఒకే విలువ ఉండాలన్న సార్వత్రిక నైతిక విలువ. సూత్రీకరణ కార్యస్థలం ప్రత్యేక ఆకాంక్షకోసం, ప్రయోజనాల భాషలో జరుగుతున్న ప్రత్యేక ఉద్యమంలోని విలువకు సార్వత్రికతను తీసుకువచ్చే చైతన్య రంగం. ఈ సూత్రీకరణల సామాజిక సందర్భంగా భారతీయ సమాజము, బౌద్ధిక సందర్భంగా ప్రపంచ వ్యాప్తంగా శాస్త్ర, సామాజిక శాస్త్రాలలో వస్తున్న నవ్య పోకడలు, తెరమీదకు వస్తున్న విభిన్న సామాజిక ఉద్యమాలు మారుతున్న, ఆవిర్భవిస్తున్న అధికార కేంద్రాలు.

భారతీయ 'సంప్రదాయ' సమాజం 'ఆధునికానంతర' సమాజం. ఇది ఏకశిలా సదృశ్యమయిన సమాజం కాదు. ఇది బహుళ సమాజాల సమాజం. పాశ్చాత్య హక్కుల భావనకు కేంద్రమయిన 'వ్యక్తి' కానీ, వ్యక్తి స్వేచ్ఛకానీ భారతీయ సంప్రదాయ సమాజాల ఎరుకలో లేవు. ఎందుకంటే, వ్యక్తి ఐన మనిషి భారతీయ సమాజాలలో అస్తిత్వంలోనే లేరు. వారు కులం అనే సంకుచిత సమిష్టికి వ్యక్తీకరణలు, దానికి ప్రతినిధులు. వారి స్వేచ్ఛ, సమానత్వం, స్వేచ్ఛ లేమి, సమానత్వ లేమి అసంకుచిత సమిష్టిలో అంతర్భాగంగానే ఉంటాయి. దీనితోపాటే పాశ్చాత్య సమాజం నుండి దిగుమతి ఐన అసమానత్వ రూపం 'వర్గం' కూడా ఆ రూపంలో భారతీయ సమాజాలలో కనిపించదు, కనిపించినా వ్యవస్థితం కాలేదు. ఈ హక్కుల భావనను, ప్రస్థానాన్ని నడిపించిన ఈ రెండూ – వ్యక్తి కేంద్ర హక్కుల భావన, వర్గకేంద్ర పోరాట భావన – భారత దేశంలో హక్కుల ప్రస్థానాన్ని, దాని స్వభావాన్ని నిరంతరం ప్రశ్నార్థకంలోకి నెట్టివేసాయి.

బౌద్ధికంగా 16వ శతాబ్దంనుండి శుద్ధ శాస్త్రాల – భౌతిక, ప్రకృతి – అధ్యయన పద్ధతులు సామాజిక అధ్యయన పద్ధతులపై తీవ్రమయిన ప్రభావాన్ని చూపాయి. దీంతో సార్వత్రిక నియమాల పేరుతో, వాటి వెలుగులో ప్రతీ సమాజాన్ని 'శాస్త్రీయంగా' అధ్యయనం చేయడం జరుగుతూ వస్తుంది. ఈ అధ్యయన పద్ధతులు సమాజాన్ని గూర్చి, చరిత్రను గూర్చి మహా కథనాల్ని, అఖండ సిద్ధాంతాల్ని

పాదుకొల్పాయి. ఈ సిద్ధాంతాల ప్రకారం, మానవ సమాజంలో ఒక కేంద్ర సామాజిక తత్వం (Social Category) ఉంటుంది. దాన్ని అల్లుకుని, ఆనుకుని, అణచివేతలు – విముక్తులు; మానవీయతలు – అమానవీయతలుంటాయి. కాబట్టి ఉద్యమాలు దీనిచుట్టు అల్లుకుని ఉండాలన్నది దీని సారాంశం.

ఐతే, 19వ శతాబ్దపు చివరి అర్థ భాగంనుండి జ్ఞానసిద్ధాంతంలో 'విపరీతమైన' మార్పులు శరవేగంగా చోటుచేసుకున్నాయి. శుద్ధ శాస్త్రం ప్రతిపాదించిన పదార్థం. దాని ప్రభావాలను గూర్చిన, కార్య–కారక సంబంధాలను గూర్చిన, వాస్తవికత యొక్క వస్త్వాశ్రయతను గూర్చిన ఎరుకలో ఎరుకపరచుకునే వారి భూమికను గూర్చిన అవగాహనలు మార్పుకు లోనయ్యి, అనిశ్చితి సూత్రం (Principle of indeterminacy) శాస్త్రాల అధ్యయనాన్ని ప్రభావితం చేస్తుంది. ఇదే కాలంలో సమాంతరంగా ఆధునికానంతర వాదాల పేర్లతో సామాజిక శాస్త్రాల అధ్యయనంలో 'విపరీతమయిన' కథనాలు ముందుకు వచ్చాయి. ఇవి ఒకే అస్తిత్వం స్థానంలో బహుళ అస్తిత్వాలు, ఒకే అధికార కేంద్రం స్థానంలో బహుళ అధికార కేంద్రాలు ఏకకాలమందే ఒకే సమాజంలో ఉంటాయని సూత్రీకరించాయి. దీనితో బహుళత్వం సామాజిక అధ్యయనాలను ఆక్రమించింది. బాలగోపాల్ హక్కుల దృక్పథం ఈ సామాజిక సందర్భంనుండి వస్తున్న విభిన్న ప్రత్యేక సామాజిక ఉద్యమాలతో, అవి లేవనెత్తుతున్న ఆకాంక్షలతో, సమకాలీన బౌద్ధిక సందర్భంనుండి వస్తున్న విభిన్నత సూత్రీకరణలతో విమర్శనాత్మక, నిర్మాణాత్మక వైఖరిని కలిగి ఉంది. ఆంధ్రప్రదేశ్‌లో 1990 దశకం నుండి వచ్చిన కుల అణచివేత, కుల వివక్ష వ్యతిరేక ఉద్యమాలు, కుల హక్కుల ఉద్యమాలు, ఆదివాసీ హక్కుల పోరాటాలు, స్త్రీల ఉద్యమాలు, సారా వ్యతిరేక ఉద్యమాలు అణచివేతల గూర్చిన కొత్త ప్రశ్నలను, స్పృహలను మోసుకు వచ్చాయి. దీంతో హింసరూపాలు, పార్శ్వాలను గూర్చి, అణచివేత రూపాలు, కేంద్రాలను గూర్చి లోతయిన చర్చ ప్రారంభమయింది. ఈ ఉద్యమాలు లేవనెత్తిన సమస్యలు, ఆకాంక్షలు హక్కుల సంఘాల ఆలోచనల, ఆచరణల పరిమితులను ఎత్తి చూపాయని బాలగోపాల్ పేర్కొంటాడు. ఈ పరిమితుల్ని సైద్ధాంతిక, తాత్విక స్థాయిలో అధిగమించే కృషిలో భాగంగా రూపొందినవే, బాలగోపాల్ హక్కుల దృక్పథంలోని సూత్రీకరణలు, ఈ సూత్రీకరణలు ఆధునికతలోని మహాకథనాలు ప్రవచిస్తున్న అంతిమ పరిష్కారాలను సందర్భానికే పరిమితమయిన ఆధునికానంతర ప్రత్యేక పరిష్కారాలనూ అధిగమిస్తాయి.

మనుషులు చారిత్రక, సార్వత్రిక, నైతిక జీవులు. మిగతా ప్రాణుల్లాగా మనుషులు నిరంతరం వర్తమానంలో అచారిత్రకంగా జీవించరు, వారు చారిత్రక స్పృహతో

జీవిస్తారు. అలాగే మనుషులు యివ్వబడిన ప్రత్యేక సందర్భంలో, సందర్భానికే కట్టుబడి మాత్రమే జీవించరు. వారు యివ్వబడిన ప్రత్యేక సందర్భానికి వెలుపలికి పోయి సార్వత్రికత స్పృహలో మరియు స్పృహతో జీవిస్తారు. ఇంకా, మనుషులు మిగతా ప్రాణుల్లాగా amoral గా జీవించరు. వారు తమ జీవితాన్ని తాము నీతి అని భావించిన నియమాల వెలుగులో జీవిస్తారు. కాబట్టి కండ, బుద్ధి బలాలు మాత్రమేకాక, వారి నైతిక బలాలు మనుషుల్ని పరిపాలిస్తాయి. నిజానికి నాగరికతల వికాసమన్నది మానవీయ విలువల వికాసం మీద ఆధారపడి ఉంటుంది. ఇట్టి నైతికత హక్కుల భాష కావాలి. నైతిక నిర్మాణాలకై కృషి హక్కుల కార్యక్షేత్రం కావాలి. ఎందుకంటే, ఆదర్శ సమాజమన్నది చరిత్ర గమనపు అనివార్యతగా కాక మనుషులు – వ్యక్తులుగా, సమూహాలుగా – చైతన్యయుతంగా చేసుకునే, తద్వారా చేరుకునే నైతిక తీర్మానంగా అర్థం చేసుకోవాలి. ఇలా రూపొందించుకున్న నైతిక తీర్మానాలకు – సామాజిక నిర్మాణాలకు మధ్య జరిగే నిరంతర సంభాషణ, సంవాదం, పోరాటంనుండి మానవీయ సమాజ ఆవిర్భావం జరగాలంటాడు బాలగోపాల్.

మానవహక్కులను చిరునామాగా కల్గిన స్థితినుండి మానవహక్కులకు చిరునామాగా మారిన శ్రమాలోచనల సారాన్ని ప్రకటించే సూత్రీకరణలను మూసలో ఆలోచించే (Structured thought) చాలామంది జీర్ణించుకోవడం కష్టమే. అలాగని కక్కాలనుకోవడం అజీర్తికి, అనారోగ్యానికి చిహ్నం. ఆరోగ్యకరమయిన సమాజాలకు బాలగోపాల్ చెప్పిన సోయి తప్పనిసరి.

# హక్కుల ఉద్యమకారుడు బాలగోపాల్‌కు నివాళి

**'స్వేచ్ఛ' సంపాదకీయం, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం**

హక్కుల నేత బాలగోపాల్ ఆకస్మిక మరణం ప్రజాస్వామికవాదులందరిని నిర్ఘాంత పరచింది. హక్కుల ఉద్యమ ప్రస్థానంలో ఆయన లేని లోటును ఇప్పట్లో భర్తీ చేయడం కష్టం. రాష్ట్రవ్యాపితంగా, దేశవ్యాపితంగా హక్కుల ఉద్యమానికి ఒక గుర్తింపును, విశ్వసనీయతను తీసుకురావడంలో బాలగోపాల్ విశేష కృషి దాగివుంది. హక్కుల ఉద్యమానికి ఒక కొత్త ఒరవడిని, దృక్పథాన్ని యివ్వడమే కాకుండా దాన్ని ఆచరణలో సాదించడానికి తన జీవితాన్ని అంకితం చేశాడు. బాలగోపాల్‌ది విశిష్టమైన వ్యక్తిత్వం. మేధావి, రచయిత, నేత, సాధారణ కార్యకర్త ఒకే వ్యక్తిలో మేళవించి ఉండటమే ఆయన ప్రత్యేకత. సంస్థకు బాధ్యతాయుత స్థానంలో ఉన్నా సాధారణ కార్యకర్తలాగా గోడకు పోస్టర్లు అంటించడం, కరపత్రాలు పంచడం, సంస్థ ప్రచురణలను అమ్మడం చేయగలడు. వ్యక్తే సంస్థగా, సంస్థలో ఒక వ్యక్తిగా గొంతులేని వారి తరపున గొంతెత్తాడు. మన రాష్ట్రంలో హక్కుల ఉద్యమానికి చిరునామా అయ్యాడు. హక్కుల ఉద్యమ చరిత్రలో సమున్నతంగా నిలిచిపోయాడు.

1970ల ప్రాంతంలో శ్రీకాకుళ గిరిజన రైతాంగపోరాటాలపై ప్రభుత్వ ఫాసిస్టు దమనకాండకు వ్యతిరేకంగా, ప్రత్యేకించి బూటకపు ఎన్‌కౌంటర్ల రూపంలో అమలయిన రాజ్యహింసకు వ్యతిరేకంగా, మన రాష్ట్రంలో పౌరహక్కుల ఉద్యమం మొదలయింది. ఎమర్జెన్సీ తర్వాత బూటకపు ఎన్‌కౌంటర్లపై తార్కుండే కమిటి, జస్టిస్ భార్గవ కమీషన్‌ల విచారణ జరగడంలో పౌరహక్కుల సంఘం కృషివుంది. భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షలకు వ్యతిరేకంగా పౌరహక్కుల ఉద్యమం స్పందించి పనిచేసింది. ఆనాటి ప్రజా ఉద్యమాల స్ఫూర్తితో బాలగోపాల్ హక్కుల ఉద్యమాన్ని తన కార్యక్షేత్రంగా ఎంచుకుని 1980ల నుండి ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘానికి

దగ్గరయ్యాడు. కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొన్నాడు. అనతికాలంలోనే, అనగా 1983లోనే సంస్థ ప్రధానకార్యదర్శిగా బాధ్యతలు స్వీకరించాడు. 15 సంవత్సరాల పాటు సంస్థకు నాయకత్వం వహించి, పౌరహక్కుల సంఘాన్ని విస్తృత పరచడంలో ఎనలేని కృషి చేశాడు.

ఎటువంటి నిర్బంధాన్నైనా తట్టుకుని నిలబడగలగడం పౌరహక్కుల కార్యకర్తలకు వుండాల్సిన ముఖ్య లక్షణం. ఈ విషయంలో బాలగోపాల్ నుండి నేర్చుకోవాల్సింది ఎంతైనా వుంది. పౌరహక్కుల సంఘంపై ప్రభుత్వ నిర్బంధం తీవ్రరూపం దాల్చి, గోపిరాజన్న, జాపాలక్ష్మారెడ్డి, డా॥ రామనాథం, నర్రా ప్రభాకర్‌రెడ్డి, పురుషోత్తం, ఆజంఅలీలు రాజ్యహింసకు బలైపోయినా, తనను పోలీసులు కిడ్నాప్ చేసినా, ఏ మాత్రం బెదరకుండా సంస్థను ముందుకు నడిపించడంలో బాలగోపాల్ అసమాన ధైర్యసాహసాల్ని, చొరవను ప్రదర్శించాడు. సమాజంలో ప్రతి సమస్యకు హక్కులకోణం వుంటుందని చాటిచెప్పి, హక్కుల దృక్పథాన్ని విస్తృతపరచాడు. "సమాజంలో ప్రతి మనిషి గౌరవంగా, హుందాగా బ్రతకడానికి హక్కులు అవసరం. సమాజంలో అసమానతలను, ఆధిపత్యాన్ని, పీడనలను ప్రశ్నించడానికి హక్కులు ఒక సాధనం" అని బాలగోపాల్ హక్కుల అర్థాన్ని, అవసరాన్ని తెలియజెప్పాడు.

హక్కులు సార్వజనీనం, హక్కులు అందరికీ వుండాలి. వాటిని అనుభవించే అవకాశం అందరికీ వుండాలి. వాటిని ఉపయోగించుకునే సామాజిక, ఆర్థిక వాతావరణం ఉండాలని బాలగోపాల్ అభిలషించాడు. నిత్యం సమాజంలో సామాన్య ప్రజల హక్కులు ఏఏ రూపాల్లో ఉల్లంఘనలకు గురవుతున్నాయో పరిశీలించి, అందుకు దారితీసిన సామాజిక ఆర్థిక పరిస్థితుల్ని కారణాలను అవగాహన చేసుకుని, ప్రభుత్వ విధానాల మంచిచెడ్డలను చర్చించి ఎన్నో సమస్యలపై బాలగోపాల్ నివేదికలను రూపొందించాడు. నిజనిర్ధారణ అంటే కేవలం వాస్తవాలను సేకరించి పత్రికా ప్రకటనలు ఇవ్వడం కాదు. నిజనిర్ధారణ ద్వారా చేసిన అధ్యయనం, రిపోర్టులు ప్రజలను చైతన్య పరచడానికి ఉపయోగపడాలని, ఆ చైతన్యంతో ప్రజలు స్వతంత్రంగా తమ హక్కుల కోసం పోరాడే ధైర్యాన్ని పొందాలని బాలగోపాల్ చెప్పేవారు. తన పని విధానం హక్కుల కార్యకర్తలందరికీ అనుసరణీయం. ఇవ్వాళ హక్కుల సంస్థల్లో పనిచేస్తున్న వందలాది మందికి బాలగోపాల్ స్ఫూర్తిగా నిలిచాడు. సమాజంలో ముందుకు వచ్చే ప్రజాస్వామిక ఉద్యమాల ఆకాంక్షలను ఆకళింపు చేసుకోవడం, వాటిని సమర్థించడం, హక్కుల కోణం నుండి వాటికి మద్దతు తెలపడం హక్కుల ఉద్యమ కర్తవ్యంగా భావించాడు బాలగోపాల్.

పౌరహక్కుల ఉద్యమ పరిధిని, అవగాహనను విస్తృతపరచడంలో బాలగోపాల్

ప్రధాన భూమికను పోషించాడు. 1985లో కారంచేడులో దళితుల ఊచకోత ఘటన నేపథ్యంలో సమాజంలో హక్కుల ఉల్లంఘనకు 'కులవ్యవస్థ' కూడా ఒక ప్రధాన కారణమనే అవగాహనతో దళితులపై దాడులకు వ్యతిరేకంగా ఉద్యమించాడు. కులప్రాతిపదికన రిజర్వేషన్లు కల్పించడం సమానత్వపు హక్కుకు వ్యతిరేకం అనే అభిప్రాయం నుంచి రిజర్వేషన్లు ఒక ప్రజాస్వామిక హక్కుగా అవగాహన చేసుకోవడంతోపాటు కుటుంబ హింసకు నేపథ్యంగా వున్న పురుషాధిక్య సమాజాన్ని గుర్తించి హక్కుల దృక్పథాన్ని విస్తరించాడు. కరువు సమస్యలో హక్కుల కోణాన్ని తీసుకువచ్చాడు. రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలను అమలు చేయకపోవడం, ప్రభుత్వ నిర్లక్ష్యం ద్వారానే కరువు సమస్య ఉందని, తద్వారా జీవించే హక్కుకు ప్రమాదం వుంటుందని వ్యాఖ్యానించాడు. రాజ్యహింసతోపాటు, ఇతర సామాజిక, ఆర్థిక వ్యవస్థల, ఆధిపత్య వ్యవస్థల హింసను అర్థం చేసుకోవాలన్నాడు. హక్కుల స్పృహతో వీటిని వ్యతిరేకిస్తూ ప్రజాస్వామీకరణ కోసం కృషిచేయాలని వాదించాడు.

కొన్ని అంశాలపై అవగాహనలో ఏర్పడిన అభిప్రాయభేదాల వల్ల బాలగోపాల్ 'మానవ హక్కుల వేదిక'ను ఏర్పాటు చేశాడు. అయినా ఏకాభిప్రాయం ఉన్న అనేక హక్కుల ఉల్లంఘనలపై పౌరహక్కుల సంఘంతో కలసి పనిచేశాడు. ఎన్నో ఉమ్మడి కార్యక్రమాల్ని చేపట్టడం జరిగింది. ఉద్యమకారుల హింసపై విమర్శనాత్మకంగా స్పందించినప్పటికి, రాజ్యహింసను ఎండగట్టడంలో ఎక్కడా రాజీపడలేదు. చివరగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సంయుక్తంగా 'ఆపరేషన్ గ్రీన్ హంట్' పేరుతో చేపట్టిన మావోయిస్టుల ఏరివేత కార్యక్రమం అమాయక గిరిజనుల మరణానికి దారితీస్తుందనే ఆందోళనతో 'ఆ వేటను ఆపమని నినదిద్దాం' అనే పిలుపునిచ్చాడు. ఇప్పుడు ఆ కంఠం మూగబోయింది.

## A Big Loss At This Juncture

The PUCL is bereaved at the untimely demise of one of our finest civil liberties activists and advocates K Balagopal of the Human Rights Forum, AP. For the Human Rights movement the loss of Balagopal at this juncture is very severe, especially when a war is being fought in this country between the Maoists and the various States and the Central Government. His boldness, understanding and interventions were needed most in the present turbulent times.

We share our grief with his wife, son and the large group of friends and admirers that he had.

**K G Kannabiran**, **Pushkar Raj**
**People's Union For Civil Liberties**

---

## His Spirit Will Survive

It came as a bolt out of the blue: Balagopal is no more! It was a life dedicated to civil liberties and democratic rights. As general secretary of APCLC he underwent several ordeals. The police abducted him, blindfolded him, took him to an unknown place and threatened him with death. He braved all and continued to be in the field.

The civil liberties movement in India started in 1936 along with people like Tagore, Nehru and Sarojini Naidu and came to an end in 1946. The second phase began in the early 1970s with the formation of APCLC, APDR and other such organisations. No history of the civil liberties and democratic rights movement will be complete without K Balagopal. We will not see Balagopal again. But his spirit will survive. The CPDR pays tribute to him.

**Committee For Protection Of Democratic Rights**
(Mumbai)

## Stressed On Absolute Honesty

Dr Balagopal's demise is a great loss to the human rights community in India. He will be remembered by all for his simplicity and sincere dedication to the HR cause. He initiated a ‘great debate’ on the concept of human rights and the ethics to be followed in HR activism while unearthing facts usually obliterated from public view by the establishment, police and the media. While HR organisations express solidarity with various democratic people's movements, Balagopal always pointed out that the rights movement existed essentially in the realm of values and was endowed with a particular task. That of bringing out and placing before society as values the normative principles generated by life-situations and struggles.

He believed that truth must never be concealed even if it was uncomfortable to us. Sincerity and honesty are absolutely necessary if rights organisations were to have credibility, he felt. This was one of the lessons we learnt from the life of Balagopal who was a personal role model to many of us. Our association with him was extremely enriching. We fondly recall several fact-findings we shared both in Tamil Nadu and other States and most recently the excellent speech he delivered at the seminar: “Towards a political solution to the Sri Lankan Tamils issue” which we organised in August this year in Chennai. He set forth a striking analysis of the 13th Amendment of the Sri Lankan Constitution. We extend our deepest condolences to his family and HRF colleagues. We shall miss him a lot.

**People’s Union For Human Rights**
(Tamil Nadu)

## Proud To Have Been Associated With Him

APDR is stunned to learn of the sudden demise of K. Balagopal. He was one of the few outstanding personalities in post seventies India who shaped and built up a formidable voice and organisation for civil liberties, democratic rights and human rights. His insight into the theory and practice of rights movement and the issues involved was reflected in a large number of incisive and thought provoking articles. These writings contributed enormously in understanding the politics and dynamics of the rights movement and were almost universally appreciated -- even by those who disagreed with his views.

Dr. Balagopal travelled the length and breadth of this huge country --- from the North-East to Jammu & Kashmir, from Tamil Nadu, Orissa and West Bengal to Gujarat on arduous fact finding missions into human rights violations. Often he led a group of activists from various States, speaking different languages, having little or no previous experience in fact-finding. Most such missions were undertaken in unfavorable terrain in the face of a perceptible threat by the machinery of the State and perpetrators of human rights violations. The brilliantly prepared and well documented reports of such fact findings, written mostly by Balagopal were a scathing expose of rights violations and illegalities perpetrated by the State and various undemocratic forces.

As a lawyer, Balagopal argued dozens of cases pertaining to encounter killings by the police. His knowledge of national and international laws, particularly rights related laws and practices was an asset for the entire human rights movement. His arguments before the NHRC in 1997 on behalf of the APCLC opposing the then Solicitor General's views resulted in the historic recommendation of lodging FIRs against and prosecuting all police personnel in encounter killings. One of his last contributions for protection and expansion of the human rights agenda is the report prepared by a team of experts, of which he was a part,

engaged by the Planning Commission titled “Development Challenges in Extremist Affected Areas”. At this juncture, when the State's arsenal is being lined up for a fight to the finish offensive against the Maoists fashioned as "Operation Green Hunt", the observations and recommendations of the report offer a sharp critique of the State's erroneous policy.

APDR is proud of having being associated with such a towering personality for about two decades and will fondly remember his able leadership and simplicity, his resolute firmness in the face of odds and his care for fellow activists.

**Association For Protection Of Democratic Rights**
(West Bengal)

---

# Unbearably Shocking

The sudden demise of Balagopal is unbearably shocking to all of us in the democratic rights movement. He was the most visible leader of the ‘rights movement’ in India. OPDR recollects its association with Balagopal since 1983 when he was elected general secretary of APCLC. We recall his dynamism in a number of fact-finding committees and programmes jointly undertaken both in AP and at the all-India level.

Many issues that Balagopal posed to the ‘rights’ fora should be seriously and openly debated and his absence in this context is a huge loss. His simple living and dedication to whichever task he undertook is really difficult for anyone else in the ‘rights movement’ to emulate.

**C Bhaskar Rao** (General Secretary)
**Organisation For Protection Of Democratic Rights**

# A Remarkable Intellectual

The CLMC expresses grief and sorrow at the sudden demise of eminent human rights leader Dr. K. Balagopal. His death is an unbearable and irreplaceable loss for the whole civil liberties and human rights movement and the vacuum cannot be filled. It is a great loss for mass movements as he was a powerful voice on behalf of the oppressed. He advocated hundreds of cases in court for the poor and dispossessed and opposed unflinchingly all kinds of atrocities and State-sponsored terrorism. His passing away has saddened all those concerned with democracy, civil liberties, human rights and above all, humanism. A person like Balagopal comes only once in many centuries.

Over the years, Balagopal was targetted several times for his activism. RSS goons attacked him in Jagityal in 1985, he was abducted in 1989 by one 'Praja Bandhu', an outfit floated by the police, beaten up badly in Kothagudem in 1991, implicated in false cases under various undemocratic laws and incarcerated but he never faltered and continued to work tirelessly for the welfare of the marginalised.

Balagopal was a remarkable intellectual. He spoke with rare conviction and wrote many incisive and well argued essays against the politics of the Sangh Parivar, neo-liberalism, State terrorism and destructive development. He travelled far and wide visiting conflict areas like Jammu and Kashmir, the North-East, Chattisgarh and Jharkhand and spoke out against violence on democratic struggles. The people of the troubled State of Jammu and Kashmir always looked forward to his visits.

Dr. Balagopal took the lead in exposing the false propaganda of Hyderabad police in connection with the Mecca Masjid blasts. We recall the joint press conference the CLMC then had with HRF. He filed bail petition for Dr Ibrahim Ali Juniad in the A.P. High Court and obtained a release order. This opened the gates for the process of release of Muslim youth who were detained during the second police action on Muslims in 2007. Our last

joint fact finding with him was into the fake encounter killing of two Hyderabad youth of Old City, who were branded dacoits and killed by the police in Karimnagar.

The pamphlet Balagopal wrote for the HRF's 3rd State conference in Anantapur and his last speech on that occasion, just 6 days before he passed away, are highly inspiring for all rights activists. While deeply mourning his loss, we pledge to continue the struggle for civil liberties and human rights.

**Civil Liberties Monitoring Committee**
(Hyderabad)

---

# A Truly Committed Fighter

The sudden and untimely passing away of Balagopal is a tragic loss for all of us in PUDR and to the civil liberties and democratic rights movement in India. We are still stunned and shocked at the news and unable to find proper words to communicate our grief and sadness or indeed to speak of Balagopal in the past tense.

We had got to know Balagopal as the truly committed and tireless fighter for civil rights who, even in the midst of acute repression, never lost his compassion, humaneness, and sense of humour. His passing is a deep personal and political loss for us. At a time when a new and terrible phase of repression has been launched by the State, when basic democratic space and rights that we all have been fighting for are under such severe attack, Balagopal's death is going to leave an unfathomable void in our movement. It is a loss we will feel every day in these dark times.

From all of us in PUDR on this sad day, we would like to extend our deepest condolences to all HRF friends, to Balagopal's family, and all other friends in AP and elsewhere.

**People’s Union For Democratic Rights**
(Delhi)

## Profound Scholarship

The CNDP pays its heartfelt condolences at the sudden and untimely passing away of K Balagopal. He was known across the nation for his profound scholarship and fearless activism in the arena of human rights. He was personally associated with the process of formation of the CNDP in 2000. He would later become an inspiration and great support for the movement against uranium project, (AP) - a constituent of the CNDP - spearheading successful popular resistance against the proposed uranium mining /milling project in Nalgonda. The CNDP pays the richest tribute to his memory.

**Coalition For Nuclear Disarmament And Peace**

---

## Outstanding Theoretician

AFDR is shocked at the sudden demise of Balagopal, one of the greatest theoreticians in the arena of democratic rights in India. He was instrumental in shaping and building a formidable rights movement in India. He had penetrating insight into the theory and practice of rights movements and the issues involved therein. He was respected even by his critics for his commitment and acute understanding.

Balagopal organised several fact-finding missions on human rights violations under trying circumstances. Our memory goes back to 2003 when we accompanied him to J&K on a fact-finding trip. At one stage we were held up by the Indian Army in Kupwara region. His impeccable and well reasoned argument and logic on the occasion were absolutely superb. We brought out a report to the people of India titled: *"Kashmir: An enquiry into the healing touch"*. It was authored by him. AFDR expresses its deep condolences and sympathies to HRF activists and his family. We resolve to carry forward his legacy.

**Association For Democratic Rights**
(Punjab)

## Simplicity, Dedication Highly Inspiring

Balagopal's sudden death has come as a shock to all human rights activists in South Karnataka. A few of us had the opportunity to interact with him when he visited Mangalore with an all-India fact-finding team to probe attacks on Muslims and more recently churches in 2008. These visits helped us gain strength to carry on with our work.

Balagopal's simplicity and total dedication to the human rights cause was highly inspiring. The report *"From Kandhamal to Karavali: The Ugly Face of Sangh Parivar"*, authored by him, will remain an invaluable historical document like his other great work on Jammu and Kashmir. In our opinion, Dr Balagopal was a born team leader and an activist par excellence. It is an irony that we had planned to release the Kannada translation of both these reports on October 9 in the course of a protest rally seeking compensation and justice to local victims of Sangh Parivar violence. A public condolence was offered to this noble human rights warrior during the rally.

We, on behalf of PUCL Mangalore and the Karnataka Communal Harmony Forum express sympathies to his family, friends and HRF activists. We take a pledge that we will work with increased vigour for the cause that was dear to him.

**PUCL**
(South Kannada)

# A Human Rights Colossus

Mathematicians, knowledgeable people say, have a sharp mind. They rarely take things to heart. But Balagopal was a different kind of a mathematician. Realising his favourite subject was not doing justice either to his conscience or the common people who are in distress, he opted for serving society. He disagreed resolutely with the way the State treated its citizens who were seeking enforcement of their hard-won rights.

Balagopal did not confine himself to Andhra Pradesh or its neighbouring States. The quest for justice brought him to Kashmir where he stated emphatically: "Paradise on earth is under undeclared martial law". He would rush to a remote Andhra village to wipe the tears of a victim but did not forget a half-widow in Jammu & Kashmir's Doda district. He ensured his presence there when it was needed most. Addressing Kashmir's civil society actors during his 2007 tour to the Valley, he said: "Do not lose heart. Keep on fighting." But last week his heart, which was as deep as an ocean, lost its beat. India lost a veteran human rights defender and Kashmir has lost a great friend. Balagopal is no more but he shall remain a source of inspiration for all those who believe in justice.

Balagopal first visited Kashmir in 1990 when he was a member of APCLC. Our association with him dates back to those very turbulent times. Clad in a white cotton shirt and grey trousers, we could see his thoughtful eyes behind a thick frame of old fashioned spectacles. The clarity with which he held forth on issues was very striking. When he spoke about the right to self determination for Kashmiris while addressing the media in a local hotel, all those present were impressed with his clear-sighted courage. That was the time when government sponsored gunmen were on the prowl.

He was possessed of steely resolve and a remarkable pen. His brilliant writings in various journals as well as meticulously documented human rights reports, which he wrote on the Kashmir

situation were marked by rare sensitivity, courage and empathy. Who can forget his path-breaking and incisive article in the *EPW* in 1996 where he wrote: *"Kashmiris tirelessly ask every human rights activist they meet whether only getting killed in a staged cross-fire is a human rights violation; and whether the denial of the right of self-determination is not in itself an act of human rights violation. The response from much of democratic public opinion in India is a stony silence".*

During the 2002 elections he was here to monitor elections with JK Coalition of Civil Society teams. His visit the next year was to study the "healing touch" Kashmiris were being promised. He was in Srinagar again to monitor the 2004 elections. At the time, we were all in deep shock and grief following the loss of Aasiya Jeelani. Our dear friend Gautam Navlakha was in tears. Many other friends rushed from Delhi to console us. But, it was Balagopal who pulled us together once again.

Balagopal visited Kashmir in May 2007 along with HRF colleagues to co-found the Asian Human Rights Defenders Network. AHRDN was formed essentially to share concerns and respond to issues related to human rights defenders who are at risk.

We feel that Balagopal's death is a great loss for the struggling people of Jammu and Kashmir. The last few decades of experience has proven that not many people in India have had the honesty and conviction in supporting the right of self-determination of the Kashmiri people and the courage to squarely and unambiguously condemn brutalities that the Indian State is, time and again, inflicting upon us. This human rights colossus was a rare exception.

We will miss you Balagopal.

**Jammu And Kashmir Coalition Of Civil Society**

# 8/10
# 2009

ఏ ప్రాంతంలోనైనా ఆ ప్రాంత
సమస్యలను గుర్తించి వాటిపై
సంస్థ సభ్యుల దృష్టిని
సారింపజేయడం, ఎవరి గడ్డపై
వారి చెవిని పెట్టి గుండె చప్పుడు
వినిపించడం బాలగోపాల్‌కే
సాధ్యమైంది. ఎవరి ఊరిని వారికి
పరిచయం చేశారు.
ఎవరి దోసిట్లో వారి ఏటినీరుని
పోశారు. మేము తడమగలిగిన
మనిషి.  మా హృదయాలను
తడిమిన మనిషి. ఆయన లేని
లోటు గుండెలోని ప్రతిపొరలోంచి
వస్తున్న మూలుగు. అది బైటికీ
రాదూ. లోపలా ఉండిపోదు.

## మా బాలగోపాల్



A Human Rights Forum Publication